# చతుర

మార్చి 2000 ★ రూ. 7/-



# జ్యోతిష్యం

ఆదిమూలం రామబ్రహ్మం

# సచిత్ర విచిత్రం




## డ్రయివ్-ఇన్-హోటల్

ఈ చిత్రం చూడగానే డ్రయివ్ -ఇన్- థియేటర్ అనిపిస్తుంది. కానీ అది నిజం కాదు. ఫ్లోరిడాలోని డిస్నీ- యం.జి.యం. స్టూడియోస్ థీమ్ పార్క్‌లోని ఓ హోటల్ ఇది. కారు ఆకారంలో చేసిన బూత్స్‌లో కూర్చుని ఈ డ్రైన్- ఇన్- థియేటర్‌లో భోజనం చేస్తూ 1950లో విడుదలయిన చిత్రాలను చూడవచ్చు. సినిమా ముగిసే సమయానికి భోజనం చేయడం కూడా అయిపోతుంది.

# చతురకతలు

## ఆశ్లీలం...

ఆ క్యూలో అన్ని రకాల మనుషులూ, అన్ని ప్రాంతాల వారూ ఉన్నారు. అయితే అందర్లోకీ కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నది మాత్రం అప్పల నరసమ్మే.

ముఖాన మందంగా పసుపూ, ఆపై పూర్వకాలపు పెద్ద రూపాయి బిళ్లంత కుంకుమబొట్టూతో సాక్షాత్తూ ఏ గ్రామదేవతో విచ్చేసినట్టుగా అందరికీ ఆశ్చర్యమూ, విస్మయమూ కలిగిస్తోందామె. ఆవిడ కొడుకుల్లో పెద్దవాడు విదేశాల్లో మాంచి ఉద్యోగంలో వుండి తెగ సంపాదిస్తున్నాడు. మాతృమూర్తికి తనున్న దేశంలో వింతలూ, విడ్డూరాలూ చూపి సంతోషపెట్టి కొంచమైనా ఋణం తీర్చుకుందామనే సదుద్దేశ్యంతో తన దేశానికాహ్వానిస్తూ రిటర్న్ టికెట్ పంపాడతను.

అప్పల నరసమ్మ అమందానందకందళిత హృదయారవిందయై బయలుదేరి వచ్చి సంబరంతో వీసా క్యూ లో నుంచుంది.

కాసేపటికి అప్పలనరసమ్మ వంతూ వచ్చింది. అక్కడి దొర అప్పలనరసమ్మను ఎగాదిగా చూశాడు. ఏవేవో ప్రశ్నలు వేశాడు. తనకు తోచినవిధంగా సమాధానమిచ్చింది అప్పలనరసమ్మ.



ఆ సమాధానాలు కొన్ని దొరకు అర్థంకాలేదుకానీ చుట్టుపక్కల ఉన్న ఆంధ్రులు యధాశక్తి దయతో అప్పలనరసమ్మ భావాన్ని తర్జుమా చేసి చెప్పారు. దొరకీ కొంచెం తెలుగు అర్థం అవుతుందిగానీ ఆయన ఖర్మకొద్దీ ఈ పూట అప్పలనరసమ్మ కటూఇటూ క్యూలో నించొన్న తెలుగువాళ్ళు వేరేవేరే జిల్లాలకు చెందినవాళ్ళు. వాళ్ళకే అప్పలనరసమ్మ గారి

ముఖచిత్రం: కె.భాస్కర్

మాండలిక భాషలో కొంతభాగం కొరుకుడు పడలేదు. ఈ ఒక్కమనిషి మాటల తర్జుమాకి అయిదారుగురు దుబాసీలుగా పనిచేసినా పూర్తి సారం దొరగారికి అవగతమవనేలేదు.

దొరకి అప్పలనరసమ్మ ప్రమాదకరమైన వ్యక్తిగా కన్పించింది. మరికొంచెం సేపట్లో తనకి వీసా ఇవ్వరన్న సంగతి అప్పలనరసమ్మకి అర్థం అయిపోయింది. అవగానే అలనాటి ఆదికవి నోటివెంట 'మానిషాద' అంటూ ఆశువుగా వచ్చినట్లే మాటలు ఆమె నోటివెంట ప్రవహించడం ప్రారంభించాయి.

"ఓర్నంజి కొడుకోయ్! నీ యమ్మా కడుపుకాలా! నీ పీనుగు దిబ్బచేరా. నీ ఆలి ముండమొయ్యా! నీ కూతురు పసుపు కుంకుమలు కాటిలో కలువా! నా బొట్టెడు బోలెడు డబ్బుపోసి టిక్కెట్లు కొని పంపి నన్ను రమ్మనమంటే వద్దనడానికి నువ్వెవరివోయ్! ముండకొడకా! నిన్ను నూకాలమ్మ ఎత్తుకుపోనూ! నీ పెళ్ళాం పుస్తెలు పుటుక్కున తెగిపోనూ" అంటూ ఏకథాటిగా, అనర్గళంగా ప్రారంభించింది.

పిడుగుల్లా భయంకర శబ్దంతో ధారాపాతంగా వర్షిస్తున్న ఆ పురాణానికి అక్కడున్న వారందరూ ఉలిక్కిపడ్డారు. క్యూలో వున్న తెలుగువారిలో చాలామందికి ఆ తిట్లలో అధికభాగం చిత్రంగా, కొత్తగా తోచాయి. వీసా ఇవ్వననగానే ముఖం మాడ్చుకుని వెళ్ళిపోయేవారినీ, రోదించేవారినీ చిన్నగా బతిమాలుకునేవారినీ మాత్రమే చూసిన దొరకిది కొత్త అనుభవం. రకరకాల తిట్లూ హావభావాలతో నాన్‌స్టాప్‌గా శివమెత్తి ఊగిపోతున్న అప్పలనరసమ్మ రౌద్రరూపం ఆయనకో నూతనమైన అనుభూతి.

"నాకు భాష అర్థం కాకపోయినా ఆమె నన్ను తిడ్తోందని తెలుస్తూనే ఉంది. ఇంతకీ ఆమె ఏమని తిడుతోందో చెప్పగలరా?" దొర ఇంతకుమునుపు దుబాసీలుగా వ్యవహరించిన వారిని అభ్యర్థించాడు.

వాళ్ళు ఇబ్బందిగా కదిలారు. చివరికి వారిలో ఒకతను ముందుకొచ్చాడు..

"మీ మిసెస్ విడో కావాలనీ, మీ మదర్‌కి పొట్టమీద ఫైర్ ఏక్సిడెంట్ కావాలని, డాటర్స్‌కి కాస్మెటిక్స్ ఎక్కడా దొరక్కుండా వుండాలనీ మీ తండ్రికి...." అంటూ నసిగాడు.

దొర గుడ్లు పెద్దవయ్యాయి. ఆశ్చర్యపోతూ అన్నాడు.

"వీసా రిజెక్ట్ చేసింది నేను. దీనిలో మా మదర్‌కీ, ఫాదర్‌కీ వైఫ్‌కీ, డాటర్స్‌కీ... ఎలాంటి సంబంధంలేదు. అయినా వాళ్ళందరికీ ఇన్‌కన్వీనియన్స్ కలగాలని ఈమె కోరుకుంటోందంటే ఈ దేశంలో ఫేమిలీ సిస్టమ్ ఎంత చక్కగా వుందో తెలుస్తోంది ఆమెనిలా పిలవండి. వీసా గ్రాంట్ చేస్తున్నా" అన్నాడాయన దయగా, జాలిగా చూస్తూ.

–సుబ్బశ్రీ

---

## ప్రత్యక్ష 'స్వర్గం'!

పుణ్యమూర్తి పేరులోనే పుణ్యం వుందేమో, అతను చేయని పుణ్యకార్యం లేదు, దానధర్మం లేదు. గుడులు, గోపురాలు కట్టించాడు. మంచినీటి బావులు తవ్వించాడు. అనాథశరణాలయాలు ఏర్పరచాడు. విద్యాసంస్థలు నెలకొల్పాడు. ఇతరులకి ఉపకారం చేయడానికే మనిషి జన్మని భగవంతుడు ప్రసాదించాడని నమ్మాడు.

అయితే అంతటి పుణ్యమూర్తి కూడా అందరిలాగా ఒకరోజున మరణించాడు. అతను చేసిన మంచి కార్యాల ఫలితంగానేమో ఇతరులని బాధపెట్టకుండా, తనూ బాధపడకుండా సునాయాసంగా మరణించాడు. సహజంగానే పుణ్యమూర్తి స్వర్గానికి వెళ్ళాడు. అయితే అక్కడ ఇతరులకి

ఉపకారంచేసే అవకాశం, అవసరం లేకపోవడంతో పుణ్యమూర్తికి దిగులుపట్టుకుంది.

స్వర్గంలో అడుగు పెట్టిన వారి ముఖాలు సంతోషంతో వెలిగిపోవడం చూసిన దేవేంద్రుడు పుణ్యమూర్తిని చూసి "అలా వున్నావేమి మానవోత్తమా" అని అడిగాడు.

"ఏం లేదు దేవేంద్రా! ఇక్కడ భూలోకంలోలా నలుగురినీ ఆదుకునే అవకాశం నాకు లేదు. భూలోకంలో అడిగిన వాడికి ఏనాడూ మొండి చెయ్యి చూపలేదు. ఆర్జించాను. సత్కార్యాలకు ఖర్చుపెట్టాను.



ఇక్కడ ఆ అవసరం లేనందుకు దిగులుగా వుంది" అన్నాడు పుణ్యమూర్తి.

"అలాగా అయితే మళ్ళీ భూలోకంలోకి వెళ్ళి ఆ జీవితం మళ్ళీ జీవించాలనే కోరిక నీకు వుందా? " అని అడిగాడు దేవేంద్రుడు.

"అంతకన్నానా దేవేంద్రా" అన్నాడు పుణ్యమూర్తి.

పుణ్యమూర్తి కోరిక ఫలించింది. పుణ్యమూర్తిని సకల దేవలోక మర్యాదలతో భూలోకానికి సాగనంపుతూ, మధ్యలో చుట్టపుచూపుగా నరకాన్నీ చూసే అవకాశాన్ని దేవేంద్రుడు కల్పించాడు.

అలా భూలోకానికి తిరిగి వచ్చిన పుణ్యమూర్తిని చూసి ఆశ్చర్యపోయిన బంధువులు, మిత్రులు అన్ని విషయాలు అతని నుంచి అడిగి తెలుసుకుంటూ,

"స్వర్గంలో గడిపావు, నరకాన్నీ సందర్శించావు. ఏ లోకం ఎలా వుంది? " అని అడిగారు.

"నామటుకునాకు స్వర్గంకన్నా నరకమే గొప్పగా వుందనిపిస్తోంది. స్వర్గంలో చెట్టుకోమనిషి పుట్టకోమనిషి విసిరేసినట్లు వున్నారు. భరించలేని ఒంటరితనం పట్టుకు పీడిస్తుంది. అపురూపమైన భవనాలు, అప్సరసలు, అమృతధారలు అలా ఎన్ని వున్నా మనసుని చీకటి ఆవరిస్తుంది. ఇక నరకంలోనా ఒంటరితనం అన్నది వుండదనిపించింది. పాత మిత్రులు, బంధువులు కోకొల్లలుగా కనిపిస్తారు. అన్ని చిత్రవధలు నలుగురితో నారాయణా అని భరించవచ్చు నరకాన్ని మించిన స్వర్గం లేదనిపించింది" అన్నాడు పుణ్యమూర్తి!

—తాజీప్రసాద్

# ఎవరికివారే

ఓ కాథలిక్ ప్రీస్ట్ న్యూయార్క్‌లో, ఫిఫ్త్ ఎవెన్యూలో ఉన్న ఓ బార్బర్ షాపుకి హెయిర్‌కటింగ్ కోసం వెళ్లాడు. ఆ క్షురకుడు బాగా చేయడంతో థాంక్స్ చెప్పి ఎంత ఇవ్వాలని అడిగాడు ప్రీస్ట్.

"నో సర్! క్రిస్టియన్ మత గురువైన మీ దగ్గరనుంచి ఏం తీసుకోవాలన్నా నాకు మనసొప్పదు." జవాబు చెప్పాడు బార్బర్ భక్తిగా.

తన కృతజ్ఞతలు తెలియచేసి వెళ్లిపోయాడా సన్యాసి. మర్నాడు ఉదయం బార్బర్ తన దుకాణం తెరవడానికి వస్తే అతనికి విస్మయం కలిగించేలా పన్నెండు బంగారు నాణాలు తలుపు గుమ్మం దగ్గర కనిపించాయి.

మరి కొంతకాలం జరిగాక జొరాస్ట్రియన్ మతానికి చెందిన ఓ గురువు ఆ బార్బర్ షాపుకి వచ్చి క్రాఫ్ చేయించుకున్నాడు.

ఆయనా డబ్బు చెల్లించబోతే భక్తితో కూడిన గౌరవంతో ఆ బార్బర్ దానిని నిరాకరించాడు. మర్నాడు ఆ బార్బరు దుకాణం




తెరవడానికి వస్తే గుమ్మం దగ్గర మళ్లీ పన్నెండు బంగారు నాణాలు కనిపించాయి.

మరోసారి థాంక్స్ చెప్పి వెళ్లిపోయాడా ప్రీస్ట్. మర్నాడు ఉదయం ఆ బార్బరు దుకాణం తెరవడానికి వస్తే ఆశ్చర్యంగా తలుపు గుమ్మం దగ్గర పన్నెండు బంగారు నాణాలు కనిపించాయి.

కొద్ది రోజుల తర్వాత ఓ బుద్ధిస్ట్ మాంక్ అదే షాపుకి గుండు గీయించుకోవడానికి వచ్చాడు. పని అయ్యాక ఆ బౌద్ధ సన్యాసి అడిగాడు ఎంతివ్వాలని.

"నో సర్! బౌద్ధమత గురువైన మీ నుంచి ఏం తీసుకోను." చెప్పాడాబార్బర్ భక్తిగా.

ఇంకొంతకాలం తర్వాత ఓ హిందూ సన్యాసి కూడా అనుకోకుండా ఆ బార్బరు షాపుకి అనుకోకుండా హెయిర్‌కటింగ్ చేయించుకోవడానికి వచ్చాడు. పనయ్యాక హిందూ సన్యాసి అడిగాడు బార్బరుని ఎంతివ్వాలని.

“ఏం వద్దు సార్! మత గురువుల దగ్గర ఒక్క పైసా కూడా తీసుకోను.” చెప్పాడు బార్బరు భక్తిగా.

మర్నాడు ఉదయం ఆ బార్బరు తన దుకాణం తెరవడానికి వస్తే తలుపు దగ్గర అతనికి విస్మయం కలిగించేలా పన్నెండు మంది గడ్డాలు, జుట్టు పెరిగిన హిందూ సన్యాసులు అతనికోసం ఎదురుచూస్తూ నిల బడి ఉన్నారు.

—ఊహ

## నమ్మకం

ఇచ్ఛాపురానికి చెందిన ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్ ఈశ్వరరావు, కడపకి చెందిన కంప్యూటర్ గ్రాడ్యుయేట్ కనకారావు అనుకోకుండా ఒకే విమానంలో పక్కపక్క సీట్లలో ఇండియా నుంచి హెచ్.ఒన్ వీసామీద ఉద్యోగ నిమిత్తం అమెరికాకు చేరుకున్నారు.

విమానంలో అలా ఇద్దరికీ పరిచయమైన ఏడాదికి వాళ్లిద్దరూ మళ్లీ అనుకోకుండా శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి లాస్‌ఏంజెలిస్‌కి వెళ్లే విమానంలో పక్కపక్క సీట్లలో తారసపడ్డారు. ఒకరినొకరు గుర్తుపట్టాక పలకరించుకున్నారు.

కనకారావు వందడాలర్ల నోటుని తీసి సిగార్లా చుట్టి అందులో పొగాకు పొడి నింపి దాన్ని చుట్టగా అంటించుకోవడం గమనించి ఇంజనీరు ఈశ్వరరావు అడిగాడు...“కంప్యూటర్ రంగంలో జీతం ఎక్కువా? ” అని. కనకారావు కొద్దిసేపు మౌనంగా ఉండిపోయాడు. తర్వాత చెప్పాడు.

“కాదు. ఓ శుక్రవారం రాత్రి నాకో అద్భుతం జరిగింది”



“ఏమిటది? ” అడిగాడు ఈశ్వరరావు.

“చెప్పినా మీరు నమ్మరు”

“నమ్ముతాను. ముందు చెప్పండి.”

“శుక్రవారం పదమూడో తారీఖు కలసివచ్చిన ఓరాత్రి నా అపార్ట్‌మెంట్ లో ఓ అశరీరవాణి పలికింది- ‘కనకారావ్! వెంటనే

నువ్వు నీ ఉద్యోగానికి రాజీనామా ఇవ్వు. ఇంట్లోని సామానంతా అమ్మేసి లాస్‌వేగాస్‌కి వెళ్లు.' అని. నేను సందేహించకుండా ఆ పని చేశాను. లాస్‌వేగాస్‌లో విమానం దిగ్గానే ఆ అశరీరవాణి మళ్లీ పలికింది. "వెంటనే సీజర్స్ పాలస్‌కి వెళ్లు"

కనకరావు చెప్పేది శ్రద్ధగా వినసాగాడు ఈశ్వరరావు.

"సీజర్స్ పేలస్‌లోకి వెళ్ళాక ఆ అశరీరవాణి పదమూడో నెంబరు గదిలోకి వెళ్లమంది. వెళ్లాను.

అక్కడ పేకాట జోరుగా సాగుతోంది. ఆ అశరీరవాణి మళ్లీ నాకుమాత్రమే వినపడేలా పదమూడోనెంబరు టేబుల్ దగ్గరకు వెళ్ల మంది. వెళ్లాను.

అది చెప్పిన నంబర్ పదమూడుమీద ఉన్న డబ్బంతా కాయమంది. కాశాను. గెలి చాను. ఆ రోజంతా ఆ అశరీరవాణి చెప్పిన నంబర్లమీద ఉన్న డబ్బంతా కాయసాగాను. అదిక ఆపమనేదాకా అలా చేస్తుంటే, పదికో ట్లడాలర్లు గెలుచుకున్నాను."

ఈశ్వరరావుకి కనకారావు చెప్పేది నమ్మ బుద్ధి కాలేదు. "పోన్లే. నీ విజయరహస్యం నాకు చెప్పాలని నీకు లేకపోతే." నిష్టూరంగా అన్నాడు ఈశ్వరరావు.

"నేను ముందే చెప్పలా.. నువ్వు నమ్మ వని. కానీ నిజానికి జరిగిందది."

ఈశ్వరరావు లాస్‌ఏంజెలిస్ లో విమానం దిగి తన ఫ్లాట్‌కెళ్లి మర్నాడు ఆఫీసులో సబ్మిట్ చేయాల్సిన బిజినెస్‌ట్రిప్ తాలూకూ రిపోర్ట్స్‌ని రాసుకుంటుండగా అశరీరవాణి వినిపించింది.

"ఈశ్వరరావ్! నువ్వు కనకారావు చెప్పింది నమ్మవచ్చు"

"నమ్ముతాను. నన్నూ ఆదుకో." భక్తిగా చెప్పాడు ఈశ్వరరావు వెంటనే లేచి మోకాళ్ల మీద కూర్చుని.

"సరే. నే చెప్పినట్లుగా విను. నీ ఉద్యోగా నికి రాజీనామా ఇవ్వు. నీ సామానంతా పూచికపుల్ల కూడా లేకుండా అమ్మేసెయ్యి. ఆ డబ్బుతో వచ్చే శుక్రవారం లాస్‌వేగాస్‌కి వెళ్లు."

"అలాగే."

ఈశ్వరరావు లేచి కేలండరు చూస్తే శుక్ర వారం, పదమూడో తారీఖు కలిసి వచ్చాయి. ఉత్సాహంగా ఈశ్వరరావు అశరీరవాణి చెప్పి నట్టు చేశాడు. లాస్‌వేగాస్‌లో విమానం దిగాక ఆ అశరీరవాణి అతన్ని టాక్సీ తీసు కుని సీజర్స్ పేలస్‌కి వెళ్ళమంది. ఈశ్వర రావు టాక్సీలో కూర్చుని తనకి ఎన్ని కోట్ల డాలర్లు రావచ్చా అని ఆనందంగా ఆలోచించ సాగాడు.

సీజర్స్ పేలస్‌లోకి వెళ్ళాక అశరీరవాణి చెప్పినట్లుగా పదమూడో నంబరు ప్లేయింగ్ కార్డ్స్ గదిలోని పదమూడోనంబరు టేబుల్ దగ్గరకి వెళ్ళి పదమూడోనంబరుమీద ఉన్న డబ్బంతా కాశాడు.

రేలెట్‌ని తిప్పాడు అక్కడి ఉద్యోగి. అది ఆగేదాకా అందులోని బాల్ ఏ నంబర్‌మీద ఆగుతుందా అని అంతా ఆదుర్దాగా చూడసా గారు ఒక్క ఈశ్వరరావు తప్ప. అతనికి తెలుసు అది పదమూడో నంబర్‌మీద ఆగు తుందని.

కాని అది పదిహేడోనంబర్‌మీద ఆగ డంతో ఈశ్వరరావు ఉన్నదంతా పోగొట్టుకు న్నాడు. ఓ దిక్కులేని బీదమనిషిగా మారిపో యాడు.

అప్పుడు అశరీరవాణిని దీనంగా ప్రార్థిం చాడు. "నిన్ను నమ్మిన నన్నిలా చేయటం తగునా?"

"నమ్మనివాళ్లని ఎవరైనా ఏం చేయగ లరు?" అంది అశరీరవాణి.

–పృథ్వీరాజ్

★

# చతుర

సంపుటి: 23 సంచిక: 2 మార్చి, 2000

ఆయన జ్యోతిష్యశాస్త్రాన్ని ఔపోసనపట్టిన పండితుడు. తాను చెప్పిందల్లా జరిగి తీరుతుందని అనడుగానీ జరిగేది చెప్పగలనని మాటిచ్చే వ్యక్తి.

ఆ ఊరిపెద్ద భార్య తన కొడుకు జాతకాన్ని ఆ పండితుడి ముందుంచి భవిష్యత్తు ఎలా వుంటుందో చెప్పమని అర్థించింది.

“మీ అబ్బాయి మంచి ప్రయోజకుడవుతాడు. జాతకంలో ఎక్కడా అపశృతి లేదు. ఎనభై తొమ్మిది సంవత్సరాల ఆయుర్దాయం" అని చెప్పాడాయన.

కానీ... తాను చెప్పింది పచ్చి అబద్ధమని ఆయనకి తెలుసు. అయినా... ఒకానొక సమయంలో తను చెప్పింది అబద్ధమే కావాలని, భగవంతుణ్ణి ఆయన ప్రార్థించడంలో అంతరార్థమేమిటి? ఆయన జ్యోతిష్య పాండిత్యమే ఆయనకు మనశ్శాంతిని కరువయ్యేలా చేసిన వైనం ఏమిటి? ఆ శాస్త్ర జ్ఞానంతో ఆయన జీవితంలో ఎదుర్కొన్న ఆటుపోట్లు ఎలాంటివి?

ఆసక్తికరంగా చదివించే ఆదిమూలం రామబ్రహ్మం రచన 'జ్యోతిష్యం' ఈ నెల చతుర సమగ్ర నవల.



"అ గ్రహారం...

అందమైన ప్రకృతిలో విశాలంగా పరుచుకున్న ఊరు.

ఆ వూరికి ఫర్లాంగు దూరంలో కొండల మధ్య ఎప్పుడూ పారే ఏరు. తూర్పున వరి పైరు పండే సారవంతమైన మాగాణి పొలం. మిగిలిన రెండుదిక్కులూ పచ్చదనం విచ్చుకొన్న మామిడి, జామ, సపోటా తోటలు.

కోడిపుంజుల కొక్కొరకోలతో నిద్రలేచి ముగ్గుల ముంగిళ్ళతో ముస్తాబయింది ఊరు.

ఆ అందాలు చూడాలని తూరుపు కొండలలోంచి ఒక్కొక్క మెట్టూ ఎక్కి పైపైకి వస్తున్నాడు సూర్యుడు.

అప్పుడు...

మోకాటిలోతు నీటిలోకి దిగి శివరామశాస్త్రి సూర్యనమస్కారం చేసి వెనుదిరిగి వస్తూవుంటే అక్కడికి దగ్గరలో పరమేశ్వర శాస్త్రి కళ్ళు మూసుకుని సూర్యధ్యానం చేస్తూ కనిపించాడు.

'వీడెప్పుడొచ్చాడు హైదరాబాదునుండి' అనుకొని అక్కడే నిలబడిపోయాడు శివరామశాస్త్రి, అతనికోసం.

పరమేశ్వర శాస్త్రి సూర్యవందనం పూర్తికావడంతో "ఎప్పుడొచ్చావురా" అని అడిగాడు శివరామశాస్త్రి.

"ఇంతకుముందే బావా. ఇంట్లో లగేజీ పడేసి నేరుగా ఇటే వచ్చేశాను. నువ్వు ధ్యానంలో ఉన్నావు. పలకరించలేదు" అంటూ వచ్చి శివరామశాస్త్రిని కలిశాడతను.

"ఏమిటీ? చాలారోజులు మకాం వేశావు? " అంటూ శివరామశాస్త్రి కదిలాడు.

"చాలా రోజులెక్కడయ్యింది బావా. ఇవ్వాల్టికి ఖచ్చితంగా వారంరోజులే. రాను పోను రెండురోజులు. పోతే హైదరాబాద్‌లో నిలకడగా ఉన్నది ఐదు రోజులే! నిజానికి నాకసలు అక్కడనుండి తిరిగి రాబుద్ధి పుట్టలేదు. ఇంకా నేను రాకపోతే ఇక్కడ మీరేం కంగారు పడతారోనని వచ్చాను" అంటూ పరమేశ్వరశాస్త్రి చెప్పుకుపోతుంటే శివరామ శాస్త్రి అడ్డుతగిలాడు.

"అంటే నీకు హైదరాబాదులో మంచి పట్టు దొరికిందన్న మాట"

"అవును బావా! ఖర్చులు పోను పదివేలు దాకా మిగిలింది" కాస్త గర్వంగా చెప్పాడు పరమేశ్వరశాస్త్రి.

శివరామశాస్త్రి నమ్మలేక నడుస్తున్నవాడల్లా నిలబడి పరమేశ్వర శాస్త్రి మొహంలోకి చూస్తూ ఉండిపోయాడు.

అప్పుడు పరమేశ్వరశాస్త్రి "జనవరి రెండవ తారీకు నేను నీకో విషయం చెప్పాను గుర్తుందా బావా? మార్చి పదిహేను, ఇరవై ఐదు తారీకుల మధ్య నాకు ధనప్రాప్తి యోగం ఉందని చెప్పాను. నువ్వు నమ్మలేదు. నా జ్యోతిష్యాన్ని తేలిగ్గా కొట్టిపారేశావు. ఇప్పుడు నమ్ముతావా? " అన్నాడు.

శివరామశాస్త్రి కదలబోయి నిలబడిపోయాడు. "అదిగో ఆ జ్యోతిష్యం అంటే నాకు మహాచిరాకు. ప్రతి విషయాన్ని నువ్వు జ్యోతిష్యంతో ముడిపెడతావు. అంత అతి పనికిరాదు" అన్నాడు కాస్త కటువుగా.

"స్వాతిశయం కాదు బావా. కాస్త నా మాటలు అర్థం చేసుకో..."

"ఒరే పరమేశం నువ్వు వంద చెప్పు నేను నమ్మను. నీ మాటలేగాదు జాతకాలు చెప్పే ఏ ఒక్కడి మాటలూ నమ్మను. భవిష్యత్తుని గూర్చి చెప్పడం మానవమాతృడికి సాధ్యం కాదు. ఎవరైనా చెప్తే వంద మాటల్లో ఒకటో, రెండో జరగవచ్చు. అదీ యాదృచ్ఛికంగా" అన్నాడు శివరామశాస్త్రి.

"అవున్లే బావా! నేను చెప్పింది జరిగితే అది యాదృచ్ఛికంగా జరిగిందంటావు గానీ నా జ్యోతిష్యాన్ని నమ్మవు" అంటూ బాధగా కదిలాడు పరమేశ్వరశాస్త్రి.

శివరామశాస్త్రి కదులుతూ, "నాకు నీమీదేమన్నా అసూయ, ద్వేషంగానీ ఉందేమిట్రా. అయితే ఒకటి. మనుషుల జీవితాలనేవి

వాళ్ళ జాతకాలననుసరించి జరుగుతాయి..."

ఆయన మాటలు పూర్తికాకముందు "అదే బావా ఆ జాతకాలను నేను చెప్పగలనంటున్నాను" అన్నాడు పరమేశ్వరశాస్త్రి ఉత్సాహంగా.

"ఇందాకే చెప్పాను. అది మానవమాత్రులైవరికీ సాధ్యంకాదని. సాధ్యం అవుతుందని అనుకోవడం అవివేకం" అన్నాడు శివరామశాస్త్రి.

పరమేశ్వరశాస్త్రి మనసు బాధగా మూలిగింది. అంతలోనే కోపం కూడా కల్గింది.

అదే శివరామశాస్త్రి కాక వేరే ఎవరైనా అయిఉంటే పరమేశ్వర శాస్త్రి తన వాగ్ధాటిని ప్రదర్శిస్తూ జ్యోతిష్యశాస్త్రంలో తనకు గల ప్రవేశం ఏ పాటిదో సుదీర్ఘఉపన్యాసంతో వివరించేవాడు. కానీ శివరామశాస్త్రి వయసులో పెద్దవాడు. పోతపోసిన శిల్పంలా ఆరడుగుల ఎత్తు, అందుకు తగిన లావుతో గంభీరంగా ఉండే ఆయనంటే భక్తి. పైగా స్వయానా బావమరిది.

శివాలయం పూజారిగా అగ్రహారంలో శివరామశాస్త్రికి ఒక విధమైన గౌరవం ఉంది. మంచి కళాకారుడు. కమ్మని గాత్రం. నాట్య కళలో అతనికి ఉన్న అభినివేశం ప్రశంసనీయమైనది. శివతాండవం అద్భుతంగా ప్రదర్శిస్తాడని ప్రతీతి. అందుకని ఆయనకి శివతాండవం శివరామశాస్త్రి అనే పేరు స్థిరపడిపోయింది.

పరమేశ్వరశాస్త్రి శివరామ శాస్త్రితో ఎదురు మాట్లాడలేక బాధనంతా మనసులోనే దిగమింగాడు. మౌనంగా ఆయన వెంట నడవసాగాడు. ఇద్దరూ నడుచుకుంటూ వచ్చి ఏటిగట్టెక్కి ఊరివైపు దిగారు.

అక్కడ బాట రెండుగా చీలుతుంది. అందులో ఒకటి ఆవూరు తూర్పు వీధిలోకి, రెండవది పడమటి వీధిలోకి కలుస్తాయి. పరమేశ్వరశాస్త్రి ఇల్లు పడమట వీధిలో ఉంది. శివరామశాస్త్రి ఇల్లు తూర్పువీధిలో ఉన్న శివాలయం ప్రాంగణంలో ఉంది.

శివరామశాస్త్రి తూర్పుబాటవైపు తిరుగుతూ "ఇటొస్తున్నావా? " అని అడిగాడు.

"లేదు బావా ఇంటికి వెళతాను. హైదరాబాదుపోతూ లక్ష్మీదేవమ్మ దగ్గర వెయ్యి రూపాయలు చేబదులు తీసికొన్నాను. వెళ్ళి ఆమెకా పైకం ఇచ్చెయ్యాలి. అడగ్గానే ఇచ్చిందాతల్లి" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"అయితే నే వెళతా" అంటూ శివరామశాస్త్రి వెళ్ళిపోయాడు.

పరమేశ్వర శాస్త్రి పడమటి బాటవైపు తిరిగాడు. ఎదురుగా ఆ వూరి వాడే అయిన యాకోబు కోడిపుంజునొకదానిని పట్టుకొని వస్తూ, "దండాలయ్యా" అని పలకరించాడు.

"ఎక్కడినుండిరా యాకోబు? " అని అడిగాడు పరమేశ్వరశాస్త్రి వాడిని.

"ఈరన్నపాలెంనుండి అయ్యగారు. దీన్ని కొనుక్కొని వస్తుండ" అని చెప్పి కోడిపుంజుని చూపుతూ తొలిగిపోయాడు.

పరమేశ్వరశాస్త్రి రెండడుగులు ముందుకు పోయి వెనక్కి తిరిగి యాకోబుని పిలిచాడు.

యాకోబు దగ్గరకు రాగానే వాడు కోడిపుంజు కోసం ఈరన్నపాలెం ఎప్పుడు వెళ్ళిందీ, ఏ సమయంలో డబ్బులిచ్చి దాన్ని కొన్నదీ వివరాలడిగి తెలుసుకుని "ఇప్పుడు ఈ పుంజుతో నువ్వు ఊళ్ళోకి వెళ్ళొద్దు" అన్నాడు.

యాకోబుకి అర్థంకాలేదు.

"అదేం బాబుగారు? " అనడిగాడు.

"అది అంతే. నా మాట విను. నీ మంచి కోరి చెప్తున్నాను. నువ్వు ఈ పూట ఊళ్ళోకి వెళ్ళవద్దు. సరేనా..." అంటూ చెప్పి పరమేశ్వరశాస్త్రి కదిలి వెళ్ళిపోయాడు.

★ ★ ★

పరమేశ్వరశాస్త్రి ఇంట్లోకి అడుగుపెడుతూ ఉంటే "అడుగో మావయ్యా వచ్చేశాడు" అంటూ, "ఏం మావయ్యా హైదరాబాదు నుండి రాబుద్ధి కాలేదటగా"అంటూ పరమే

శ్వరశాస్త్రికి ఎదురుగా పోయి అడిగింది అమృత.

"అవునమ్మా పదేపదే నువ్వే గుర్తుకొస్తున్నావు లేకుంటే ఇంకా ఉండేవాణ్ణి" అంటూ పరమేశ్వరశాస్త్రి అమృతకు దగ్గరగా వచ్చి "ఏమ్మా కులాసానా" అని అడిగాడు.

"నువ్వు లేకుంటే ఈ ఇంట్లో పరమబోరు కొడుతుందని ఈవారం రోజుల్లో తెలిసిపోయింది మావయ్యా. అత్తయ్యకు మందులు నూరడం, వంట చేసుకోవడం, సునీత బడికి పోవడంతో నాకు తోచేదికాదు" అంది అమృత.

"అయితే ఈ వారం రోజులూ నీకు కబుర్లు చెప్పేవాళ్ళు కరువయ్యారన్నమాట" అంటూ పరమేశ్వర శాస్త్రి చెక్కసోఫాలో కూర్చున్నాడు.

అమృత వచ్చి ఆయన పక్కనే కూర్చుంది.

సునీత కాఫీ త్రాగుతూ వచ్చి అమృత పక్కన చేరింది. పరమేశ్వరశాస్త్రి భార్య వర్ధనమ్మ రెండు గ్లాసుల్లో కాఫీ తెచ్చి ఒకటి భర్తకి, రెండవది అమృతకి ఇచ్చింది.

పరమేశ్వరశాస్త్రి కాఫీ తాగుతూ, "పార్శిల్ తీసి అమృతకి చూపించకపోయావా? " అన్నాడు వర్ధనమ్మతో.

"అవన్నీ ఇందాకనే చూపించిందిలే మావయ్యా. అందరికీ బట్టలు తెచ్చావుగా. నాకూ, సునీతకీ చెమ్కీ గాజులు, అత్తకీ, అమ్మకీ సాదాగాజులు తెచ్చావుగా..." అమృత సంతోషంగా అంటూ ఉంటే, "అంతే కాదమ్మా నీకూ సునీతకూ వాచీలు కూడా తెచ్చాను" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

వర్ధనమ్మకు ఆశ్చర్యమేసింది. "ఎందులో పెట్టారేమిటి? బ్యాగులో లేవే" అని అడిగింది.

"ఇందాక తొందరలో నీకు చెప్పలా. అల్మారాలో హ్యాండ్ బ్యాగ్‌లో ఉన్నాయి తీసుకురా" అని చెప్పాడు పరమేశ్వరశాస్త్రి.

వర్ధనమ్మ లేచి వెళ్ళేలోపే సునీత గంతేసి అల్మారా దగ్గరకు వెళ్ళింది. తలుపు తీసి బ్యాగ్‌లోంచి వాచీలు రెండూ తీసి "రెండూ ఒకేరకం వదినా. ఒకటి నీకు ఒకటి నాకు" అంటూ ఒక వాచీని అమృతకు ఇచ్చి ఒకటి తను పెట్టుకుంది.

అమృత వాచీని చేతికి పెట్టుకొని పరమేశ్వరశాస్త్రి వైపు చూస్తూ, "డబ్బులు బాగా సంపాయించావటగా... నాన్న చెప్పాడు" అంది.

"నేనెంత సంపాయిస్తే ఏం లాభం తల్లీ. మీ నాన్నకి, మీ అత్తకి నా జ్యోతిష్యం మీద నమ్మకంలేదుగా" పరమేశ్వరశాస్త్రి మాటల్లో విచారం ధ్వనించింది.

"అవును మావయ్యా, నువ్వు జ్యోతిష్యం ఎట్లా చెప్తావు. నీకు భవిష్యత్తు ఎట్లా తెలుస్తుంది. నువ్వు చెప్పేవన్నీ జరుగుతాయా. నువ్వు చెప్పేది నమ్ముతారా? " కాస్త ఉత్సాహంగా, అమాయకంగా అడిగింది అమృత.

పరమేశ్వరశాస్త్రి అమృత మొహంలోకి చూస్తూ, "జ్యోతిష్యం అనేది ఒక శాస్త్రం తల్లీ. ఆ శాస్త్రాన్ని సంపూర్ణంగా అధ్యయనం చేసినవాడయితే చక్కగా చెప్పగలడు. తిథి, వార, నక్షత్రాలతో జనన సమయాన్ని మాసం, సంవత్సరాలు తెలుసుకొని రాశీ చక్రం వేశి సక్రమంగా గణన చేసి జాతకం రాయవచ్చు ఇంకా జ్యోతిష్యుడు అరిషడ్వర్గాలను జయించగల్గి గ్రహ కూటములతో కూడిన కాలపురుషుణ్ణి సంపూర్ణంగా చదవగలిగిన వాడైతే అతను చెప్పేమాట పొల్లుపోకుండా జరిగి తీరుతుంది"

భర్త అలా చెప్తుంటే వర్ధనమ్మకి కంపరం పుట్టుకొచ్చింది.

"నువ్వు రావే అమృతా! ఆయనకేం వినేవాళ్ళు ఉంటే చాలు భోజనం మానేసి సాయంత్రం దాకా ఉపన్యాసం ఇస్తారు. మరీ ఈమధ్య జాతకాల పిచ్చి బాగా ముదిరిపోయింది" అంటూ వచ్చి అమృతని లేపబోయింది.

వర్ధనమ్మ అలా అనేసరికి పరమేశ్వరశాస్త్రికి కోపం వచ్చింది. అయినా తమాయిం

చుకొన్నాడు.

"చెవిటి వాళ్ళముందు శంఖం ఊదడం అవివేకం" స్వగతంలో అనుకుంటూ పైకి అనేశాడు.

"అవున్లెండి ఎదుటివాళ్ళ బలహీనతలను సొమ్ముచేసుకోవడమేగా మీ జ్యోతిష్యులు చేసే పని. ఇంటి నిర్మాణంలో వాస్తుదోషం ఉందని రక్షరేకులు కట్టించడం, మత్స్యయంత్రాలు వేయించడం, జన్మనక్షత్రంలో దోషం ఉందని శాంతులూ, దానాలూ చేయించడం, లేకపోతే ఫలానా గండం ఉంధని చెప్పి తాయెత్తులు కట్టడంవంటి మాయమాటలు చెప్పడమేగా. ఎన్నిదానాలు చేసినా, ఎన్ని శాంతులు చేసినా మొహాన రాతలు మారతాయా. వచ్చే కష్టం రాకుండా పోతుందా?" అంటూ వర్ధనమ్మ వెటకారంగా అంది.

పరమేశ్వర శాస్త్రికి నవ్వు వచ్చింది. పైకి నవ్వేశాడు. ఆ నవ్వులో ధ్వని ఉంది.

"అంతే నీకు తెలిసింది. ఇప్పుడు నువ్వు అన్నది జ్యోతిష్యులను గూర్చికాదు. జ్యోతిష్యం పేరుతో వ్యాపారం చేసేవాళ్లను గురించి. నిజానికి వాళ్ళకు జ్యోతిష్యశాస్త్రాన్ని గురించి ఏమీ తెలియదు. మాటకారితనమే వాళ్ళవిద్య. కాలగమనంలో గ్రహగతుల్ని అంచనావేసి జనన లగ్నాన్ని తిథి, వార, నక్షత్రాలతో , మాస, సంవత్సరాలను పరిగణలోకి తీసుకొని జరగబోయే విషయాలను చెప్పగల్గడం జ్యోతిష్యం" అనిచెప్పాడు పరమేశ్వరశాస్త్రి.

అప్పుడు అమృతకు ఉత్సాహం వచ్చింది.

"అయితే మావయ్యా నువ్వు చెప్పేది జరుగుతుందా? " అని అడిగింది.

"నేను చెప్పింది జరుగుతుందనడం లేదమ్మా. జరగబోయేది చెప్పగలనంటున్నాను"

"భవిష్యత్తు చెప్పడం అంటే మాటలా. మహామహా మునీశ్వరులకే చేతకాలేదు" అంటూ వర్ధనమ్మ సాగదీసింది తనకే మునీశ్వరుల సంగతి బాగా తెలిసినట్లు.

ఆ ప్రసంగాన్ని అంతటితో ఆపడం మంచి దనిపించింది పరమేశ్వర శాస్త్రికి. లేకుంటే మాటకుమాట పెరిగి పెద్దదవుతుంది. పైగా వర్ధనమ్మ పంతానికీ, పట్టింపుకీ పోయేమనిషి. తాను చెప్పిందే సత్యమంటుంది. తనమాటే నెగ్గాలంటుంది.

పరమేశ్వరశాస్త్రిది రాజీపడే మనస్తత్వం. మొండిగా వాదించడం ఆయనకు ఇష్టం ఉండదు. నిజానిజాలనేవి కాలగమనంలో బయట పడతాయనేది పరమేశ్వర శాస్త్రి నమ్మకం.

అందుకనే ఆయన మౌనం వహించాడు.

వర్ధనమ్మ అమృతను లోనికి తీసుకొనిపోయింది. అమృత వద్దంటున్నా వినకుండా వర్ధనమ్మ పరమేశ్వరశాస్త్రి తెచ్చిన బట్టలను ఆమెకు కట్టబెట్టింది. తలలో పూలుపెట్టి బయటకు తీసుకొచ్చింది.

"బావున్నాయమ్మా. నీ వంటికి బాగా సరిపోయాయి" అంటూ మెచ్చుకున్నాడు పరమేశ్వరశాస్త్రి.

"ఏ బట్టలైనా దీనికి సరిపోతాయి. పచ్చ బంగారం రంగు" అని అంది వర్ధనమ్మ.

"అచ్చం వాళ్ళ అమ్మ రంగు గదటే..."

"మా అన్నయ్య మటుకేం మంచి రంగు కాదా"

"కాదని నేననలేదులేవే..." అని పరమేశ్వరశాస్త్రి అంటూ ఉంటే, "నిన్న కాకినాడనుండి అబ్బాయి ఉత్తరం రాశాడు. వారంరోజుల్లో పరీక్షలు అయిపోతాయిట. వెంటనే వస్తానని రాశాడు" అంది వర్ధనమ్మ.

పరమేశ్వరశాస్త్రి ఏదో మాట్లాడబోతుంటే "ఏదన్నా దగ్గరలో మంచి ముహూర్తం చూడండి వాడికీ, దీనికీ ముడిపెట్టేద్దాం" అని అంది.

ఆమె మాటలు అమృతకి చేదుమాత్రల్లా ఉన్నాయి. అక్కడ ఉండాలనిపించడంలేదు.

"అత్తయ్యా నే వెళతాను. నాన్న ఎదురు చూస్తూ ఉంటాడు" అనేసి క్షణం కూడా అక్కడ ఉండకుండా పరుగులాంటి నడకతో

వెళ్ళిపోయింది.

వర్ధనమ్మ అవాక్కయి అచేతనంగా నిలబడిపోయింది.

పరమేశ్వరశాస్త్రికి ఆ క్షణంలో ఎన్నో ఆలోచనలు కలిగాయి.

"నీకంతా తొందరే. ఏమాట ఎప్పుడు అనాలో గూడా తెలియదు" కాస్త కోపంగా అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"ఇప్పుడేమయ్యింది. నేనేం తొందరపడ్డాను. మా అన్నయ్య కూతుర్ని మన అబ్బాయికి చేసుకుందామనుకున్నాను. అంతేగా"

"నువ్వలా అన్నావన్నది నేను కాదనట్లేదు. కానీ అన్నీ మనం అనుకున్నట్లే జరగవు. మీ అన్నయ్య కూతుర్ని కోడలుగా చేసుకోవాలని నీకుంది. మంచిదే. మరి అమృతకి ఉండాలిగా మన చంద్రశేఖర్‌ని చేసుకోవాలని" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"ఏం ఎందుకుండదు. మన చంద్రానికి ఏం తక్కువ. మీకు తెలుసో తెలీదో దానికి వాడంటే మనసు"

"అది నీ భ్రమ. అమృతకి మనవాడంటే ఇష్టంలేదు"

"అని మీరెలా చెప్పగలరు. జ్యోతిష్యం చూశారా ఏమిటి"

"దీనికి జ్యోతిష్యం చూడక్కరలేదు. నువ్వు ఎప్పుడయితే మనవాడు వస్తాడని చెప్పావో అప్పుడే అమృత మొహంలో కళ మారింది. పెళ్ళి ప్రస్తావన ఎత్తగానే క్షణం ఉండకుండా వెళ్ళిపోయింది" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"అంతేనా మీకు తెలిసింది. అది వెళ్ళిపోవడం మన వాడంటే ఇష్టంలేక కాదు. పెళ్ళి అంటే సిగ్గుతో... ఇంతకీ మీకు ఇష్టం ఉందా లేదా? " అని అడిగింది వర్ధనమ్మ.

"నా యిష్టాయిష్టాలతో నీకు పనిలేదు కదా. నీ యిష్టప్రకారం చెయ్యి. నేను ఎదురు చెప్పను. అసలు నా జాతకంలోనే ఉంది నేను భార్యకు ఎదురుచెప్పలేనని"

"మిమ్మల్ని అడగటం నాదే బుద్ధితక్కువ. మీ మనసులో ఏముందో నాకు తెలియకుంటేగా. మీ చెల్లెలి కూతుర్ని వాడికి కట్టబెట్టాలనేగా ఇంతసేపూ రాద్ధాంతం చేశారు? " అనేసి వర్ధనమ్మ విసవిసా లోపలికి వెళ్ళిపోయింది.

"నేను మావయ్య గారింటికి వెళుతున్నా" అంటూ సునీత లేచి శివరామశాస్త్రిగారింటికి వెళ్ళిపోయింది.

పరమేశ్వరశాస్త్రి మౌనంగా ఉండిపోయాడు.

చంద్రశేఖర్‌కి అగ్రహారంలో ఉన్న హైస్కూలు చదువు పూర్తికాగానే కాకినాడ పంపించారు.

కాకినాడలో పరమేశ్వరశాస్త్రి చెల్లెలు రాజేశ్వరి ఉంది. అక్కడ ఆమె భర్త రాజారావుకి ఉద్యోగం. వాళ్ళకి ఒక కూతురు. ఒక కొడుకు. కూతురు మాధవి డిగ్రీ రెండో సంవత్సరం చదువుతోంది. కొడుకు రవి ఇంటర్ రెండవ సంవత్సరం. చంద్రశేఖర్ స్వయానా అన్నకొడుకు కావడంతో రాజేశ్వరి వాడికి ఏ లోటూ రాకుండా చూసుకుంది. మేనల్లుడిని సొంత అల్లుడిగా చేసుకోవాలనే ఉద్దేశ్యం కూడా ఆమెకు లేకపోలేదు. ఈ సంవత్సరంతో చంద్రశేఖర్‌కి చదువు అయిపోతుంది.

పరమేశ్వరశాస్త్రికి లక్ష్మీదేవమ్మ గుర్తుకొచ్చింది. వెంటనే లేచి లోపలికి వెళ్ళాడు భార్యకు చెప్పిపోదామని.

అక్కడ వర్ధనమ్మ కళ్ళు తుడుచుకుంటూ కనబడింది.

"ఇందులో నువ్వు ఏడవవలసినంత పనేమీలేదు. అంతా నీ యిష్టప్రకారమే జరుగుతుంది" అన్నాడు.

"మీ యిష్టప్రకారమే చేసుకోండి. నాకేం పట్టదు" ముక్కు చీదుకుంటూ ఏడుపు కాస్త ఎక్కువ చేసింది.

"సరేలే ఎలా జరగాల్సి ఉంటే అలా జరు

# మంచుమనిషి

సచిత్ర విచిత్రం



ఇటీవల అమెరికాలో మంచుతుపాన్ వచ్చింది. న్యూయార్క్ ఎయిర్ పోర్ట్‌ని కొద్దిరోజులు మూసేశారు కూడా. పెన్సిల్వేనియా రాష్ట్రంలోని ప్రామ్ అనే ఊళ్ళో బిల్ జైడర్స్ అనే వ్యక్తి రోడ్డుమీద మంచునంతటినీ పోగేసి 15 అడుగుల ఎత్తున్న స్నోమాన్‌ని తయారుచేశాడు. అయితే పోలీసులు దాన్ని వెంటనే పడగొట్టమనీ, లేదా 300 డాలర్ల ఫైన్ కట్టడమేకాక ఒకరోజు జైలు శిక్ష కూడా అనుభవించాలని చెప్పారు. రోడ్డుపక్కన తయారుచేయబడిన ఆ మంచుమనిషి ఏక్సిడెంట్లకి బాధ్యుడవ్వచ్చని ముందుజాగ్రత్తతో ఈపని చేశామన్నారు. అయితే బిల్ ఆ మంచుమనిషిని యథాతథంగా తన ఇంటి ఆవరణలోకి తరలించి దాని ఎత్తు 30 అడుగులకి పెంచాడు. అప్పుడు పోలీసులు అందుకు అభ్యంతరం చెప్పలేకపోయారు. కారణం అది ప్రైవేట్ ప్రాపర్టీలో వుంది కాబట్టి.

గుతుంది" అని పరమేశ్వరశాస్త్రి గుమ్మం దాకా వచ్చి "నేను లక్ష్మీదేవమ్మగారింటికి వెళుతున్నాను" అనేసి బయటకు వచ్చేశాడు.



పరమేశ్వరశాస్త్రి చెప్పిన మాటలను యాకోబు ఖాతరుచేయలేదు.

వాడు ఊళ్ళోకి రాగానే అక్కడక్కడా కనబడ్డ కోడిపుంజులను చూసి యాకోబు చంకలో ఉన్న పుంజు కూతపెట్టడం మొదలెట్టింది.

దాని కూత రంగారావుగారింటిముందు కట్టేసి ఉన్న కోడిపుంజు చెవిలోపడి అది పోటీగా కూతపెట్టింది. దాని పక్కనే వాలు కుర్చీలో ఉన్న రంగారావు చివ్వున లేచి వీధి గుమ్మంలోకి వచ్చాడు. యాకోబుని, అతని చంకలో పుంజుని చూశాడు.

"ఏరా ఎక్కడదేమిటి పుంజు" అని అడిగాడు.

"కొనుక్కొస్తున్నా... ఈరన్న పాలెంలో" అని చెప్పాడు యాకోబు.

రంగారావు వాడిని దగ్గరకు పిలిచి పుంజును తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"నాకిచ్చెయ్... డబ్బులిస్తాను" అని అడిగాడు.

"అమ్మనండి నాకు కావాలి"

"ఇంకోటి కొనుక్కోరా. పెట్టల మీదకేగా"

"కాదు... పందేనికి"

"పందేనికా..." అంటూ ఆ పుంజుని తీసి కొని లోనికి వెళ్ళాడు రంగారావు.

ఆయన చేతిలో పుంజును చూచి రంగారావు పుంజు కూతేసింది. దానికి పోటీగా రంగారావు చేతిలో ఉన్న యాకోబు పుంజు కూతపెట్టింది.

వెంటనే రంగారావు ఆ పుంజుని నేలమీద దించి తన పుంజుని దానిమీదికి వదిలాడు.

రెండు పుంజులూ కలబడి తన్నుకోవడం ప్రారంభించాయి.

రంగారావు ఉత్సాహంగా గంతులేస్తూ ఉంటే యాకోబుకి దిగులుగా ఉంది. తన పుంజుకి ఏం ప్రమాదం ముంచుకొస్తుందో నని.

క్షణాల్లో రంగారావు మొహంలో రంగులు మారాయి. అతనిలో ఆవేశం తన్నుకొస్తోంది.

యాకోబు పుంజు ఎక్కడ తన్నిందోగానీ రంగారావు పుంజు నేలమీద పడిపోయింది.

అది చూచిన రంగారావు ఒక్క వూపున వంగి యాకోబు పుంజు కాళ్ళు రెండూ పట్టుకొని పైకెత్తి గాలిలో గిరగిరా తిప్పి నేలకేసి ఒక్కబాదు బాదాడు. దానినుండి చిమ్మిన రక్తం యాకోబు వంటినిండా మరకలు మరకలుగా పడింది.

క్షణంలో అది రక్తపుమడుగులో మునిగిపోయింది.

ఆ పరిణామానికి యాకోబు బిత్తరపోయాడు. నెత్తీ, నోరూ బాదుకొంటూ కుప్పలా కూలిపోయాడు.

వాడి ఏడుపు దొడ్లో ఉన్న రంగారావు తల్లి లక్ష్మీదేవమ్మకి వినబడి ఆమె పరుగుపరుగున అక్కడికి వచ్చింది. ఆమెను చూస్తూనే యాకోబు ఆమె కాళ్ళమీద పడ్డాడు.

"అమ్మో పెద్దమ్మో నీ కొడుకు నా కోడి పుంజుని నిలువునా చంపేశాడమ్మో"

అంటూ ఏడ్చేశాడు.

"ఇంకా ఇక్కడే ఉంటే నీ తలకాయ పగలగొడత. పో అవతలికి" రంగారావు యాకోబుమీదికి దూకాడు.

లక్ష్మీదేవమ్మ రంగారావుని దూరంగా నెట్టేసింది.

"నీకెన్ని గుండెలురా నా పుంజుమీదికి నీ కోడిని వదుల్తావా" అంటూ రంగారావు పోయి వాలుకుర్చీలో వాలాడు.

"నీ కొడుకేనమ్మా దారిన పోయే నన్ను పిలిచి నా చేతిలోంచి పుంజును లాక్కొచ్చి పందెం వేశాడు. మీది ఓడిపోయి సచ్చింది. నాదాన్ని నేలకేసి బాది చంపాడు" అని ఏడుపు లంకించుకొన్నాడు యాకోబు.

వాడి ఏడుపుకి చుట్టుపక్కల వాళ్ళు వచ్చి అక్కడ గుంపుగా చేరారు.

లక్ష్మీదేవమ్మకి డబ్బులు ఇవ్వడానికి వచ్చిన పరమేశ్వరశాస్త్రి అక్కడున్న జనాన్ని చూసి ఏదో జరిగిందనుకొన్నాడు. వెంటనే ఆ జనాన్ని తొలిగించుకొంటూ లోపలికి వెళ్ళాడు.

"బాబుగారూ..." అంటూ యాకోబు పరుగున పరమేశ్వరశాస్త్రి ముందుకు వచ్చి "మీ మాట ఇనకపోయినందుకు నాకు బాగా శాస్తి జరిగిందయ్యా" అని ఏడ్చాడు.

అక్కడి దృశ్యాన్ని చూసిన పరమేశ్వరశాస్త్రికి వొళ్ళు జలదరించింది. రెండు కోడిపుంజులు చచ్చిపడిఉన్నాయి. చుట్టూ రక్తపు మడుగు.

పరమేశ్వరశాస్త్రికి విషయం బోధపడింది. వెంటనే ఎక్కడలేని ఆనందం కూడా కలిగింది.

పంచాంగం చూసి కేవలం మంచి రోజు చెప్పడం మాత్రమే పరమేశ్వరశాస్త్రి తన తండ్రిదగ్గర నేర్చుకొన్నాడు. కానీ జ్యోతిష్యం నేర్చుకుని జాతకాలు రాయాలనే కోరిక బలంగా ఉండేది.

అగ్రహారంలో ఆయుర్వేద వైద్యం చేస్తూ తెలిసిన జ్యోతిష్య పండితులదగ్గరకు వెళ్ళి వాళ్ళకు శుశ్రూష చేసి జ్యోతిష్యం నేర్చుకొన్నాడు. కానీ ఆయన పాండిత్యాన్ని ఆ వూళ్ళో ఎవరూ గుర్తించలేదు. కేవలం వైద్యుడుగానే చూసేవారు. ఆయన హస్తవాసి మంచిదని ప్రతీతి ఉంది. ఆయుర్వేద వైద్యుడిగా ఆయనకి చుట్టు పక్కల గ్రామాలలో గూడా పేరుంది. జబ్బునుబట్టి తనే కొన్ని మందులు తయారుచేసి ఇస్తాడు. కొన్ని కొనుక్కొచ్చి ఇస్తాడు. ఈమధ్య ఇంగ్లీషు మందులు వాడటం, ఇంజక్షన్‌లు చేయడం అలవాటు చేసుకొన్నాడు. అందువల్ల వచ్చిపోయే రోగులతో పరమేశ్వరశాస్త్రి ఇల్లు ఎప్పుడూ రద్దీగా ఉంటుంది. ఆయన ఇంట్లోలేని సమయంలో వర్ధనమ్మ, సునీతలు ఏకంగా డాక్టర్లు అయిపోతారు.

భర్త పంచాంగాలు ముందేసుకొని ఏవేవో గుణించుకొంటుంటే వర్ధనమ్మకి చికాకుగా ఉండేది.

"మీకు జాతకాల పిచ్చి బాగా పట్టుకొంది" అని పరిహాసంగా చురక వేసేది.

ఆమె పరిహాసం పరమేశ్వరశాస్త్రికి పంతాన్ని పెంచింది.

ఉయ్యాల బల్లమీద కూర్చొని వూగుతూ ఆలోచిస్తున్న ఆయనకి ఏదో ఆలోచన వచ్చింది. వెంటనే అటకమీద శిథిలావస్థలో ఉన్న వాళ్ళ తండ్రిగారి దస్త్రాన్ని దించాడు. అందులోనించి ఒక నోటు పుస్తకం తీసి దుమ్ము దులిపాడు.

ఆ పుస్తకంలో పరమేశ్వరశాస్త్రి జనన లగ్నానికి సంబంధించి తిథి వార నక్షత్రాలతోసహా రాసి ఉంచాడు వాళ్ళ తండ్రిగారు. ఇంకా అందులో వాళ్ళ బంధువుల జనన లగ్నాలు రాసి ఉన్నాయి. అవన్నీ చూసిన పరమేశ్వరశాస్త్రికి ఆనందం కలిగింది. ఆయా జనన లగ్నాలనుబట్టి జాతకాలు రాసి తన జ్యోతిష్య పాండిత్యాన్ని పరీక్షించుకోడానికి మంచి అవకాశం అనుకొన్నాడు.

ఒక మంచి ముహూర్తంలో తన జననలగ్నాన్ని దగ్గరుంచుకొని జాతక చక్రం తయా

రుచేసి జాగ్రత్తగా గణన చేశాడు. ఈ విష యమై పరమేశ్వరశాస్త్రి ఇదివరలోనే లెక్కలు వేశాడు. ఇప్పుడు మరలా అదే విషయమై బహుజాగ్రత్తగా పరిశీలించడం ప్రారంభిం చాడు.

మార్చి నెల మూడవ వారంలో ధన ప్రాప్తి, ఆపైన అడపాదడపా అవమానానికి గురైనా గుర్తింపు, పేరు ప్రఖ్యాతులు, ప్రయాణాలు, సన్మానాలు, అప్పుడప్పుడు గృహఛిద్రాలు, సమస్యలు, యోగ ప్రాప్తి అనే విషయాలు తెలుసుకొన్నాడు.

ఆ విషయాలన్నీ శివరామశాస్త్రికి చెప్పాడు పరమేశ్వరశాస్త్రి.

"నువ్వు వైద్యాన్ని నిర్లక్ష్యం చేస్తున్నావు. తిండి పెట్టేది అదే" అని శివరామశాస్త్రి కర్త వ్యాన్ని గుర్తుచేస్తున్నట్టుగా అన్నాడు.

బావగారి మాటల్లో వాస్తవం ఉంది. తను వైద్యం మీదనే జీవిస్తున్నాడు. మరేవి ధమైన ఆదాయ మార్గాలు లేవు. ఆ వైద్యాన్ని నిర్లక్ష్యం చేస్తే కుటుంబ పోషణ కష్టమే అవుతుంది.

కాని మనసు జ్యోతిష్యం మీదికి మరలు తోంది.

మార్చి మూడవ వారంలో తనకు ధన ప్రాప్తి యోగం ఉందని తన జాతకంలో ఉన్నట్టు తెలుస్తోంది. మరి ధనం ఎలా వస్తుంది.?

ఆలోచించసాగాడు.

మార్చి నెల వచ్చింది. మొదటి వారం గడిచింది. రెండవ వారంలో మూడు రోజులు గడిచాయి.

"రేపు టౌనుకు పోయిరండి" అని వర్ధ నమ్మ అంది.

"దేనికి" అడిగాడు పరమేశ్వరశాస్త్రి.

"ఇంట్లో సరుకులు నిండుకున్నాయి"

మరుసటిరోజు 10 గంటలకు భోజనం చేసి బస్సు ఎక్కాడు.

టౌనులో బస్సు దిగి బజారుకు వెళ్ళాడు. అక్కడ రిక్షాలో మైకు పెట్టుకొని ఒక వ్యక్తి "మీరు ఇల్లు కట్టదలుచుకొన్నారా? అయితే వినండి వాస్తు బ్రహ్మగా పేరుపొంది బహు సన్మాన, సత్కారాలు పొందిన బరంపురం వీరబ్రహ్మాచారిగారు మన పట్టణంలో ఆర్టీసి బస్టాండ్‌కి ఎదురుగా ఉన్న మౌర్య హోట ల్‌లో వేంచేసి ఉన్నారు. వారికి మీ స్థల వివరాలు తెలిపి ఇల్లు ఎలా కట్టాలో దానికి చెయ్యవల్సిన పూజలు శంకుస్థాపనాది విష యములు అడిగి తెలుసుకొనవచ్చును. మీరు సకల, సుఖ, శాంతులలో, అష్ట ఐశ్వర్యాలతో తులతూగాలంటే వాస్తుబ్రహ్మ గారిని సంప్రదించండి. అవసరమైనచో వాస్తు బ్రహ్మగారు మీ స్థలమును దర్శించి మీరు అనుకొన్న రీతిలో వాస్తుదోషాలు లేకుండా ప్లాను తయారు చేసి ఇవ్వగలరు" అంటూ చెబుతున్నాడు.

అది విన్న పరమేశ్వరశాస్త్రికి బుర్రలో ఏదో ఆలోచన మొదలైంది.

టౌన్‌లో సరుకులు తీసుకొని సాయంకా లానికి అగ్రహారం వెళ్లేసరికి ఆయన ఒక నిర్ణయానికి వచ్చాడు.

తెల్లవారి కాఫీ తాగిన తరువాత పంచాంగం చూశాడు.

సమయం బావుంది. పని అవుతుంది. అనే నమ్మకం కలిగి ఆలస్యం చేయకుండా రంగారావుగారింటికి వెళ్ళాడు. ఆ సమ యంలో రంగారావు ఇంట్లోలేడు. ఆయన తల్లి లక్ష్మీదేవమ్మగారున్నారు. పరమేశ్వర శాస్త్రిని చూస్తూనే "ఏం పంతులుగారు వచ్చారు" అని అడిగింది.

"రంగారావుగారికోసం వచ్చానమ్మా"

"లేడే...పొలం వెళ్ళాడు. ఏదన్నా పనా"

"ఆ పనే.. లేడుగా..." అంటూ నసిగాడు.

"డబ్బుగాని ఏదన్నా అవసరమా ఏంది"

క్షణం ఆలస్యం చేయకుండా "అవునమ్మా ఓ వెయ్యి రూపాయలు కావాలి. వారంలో తిరిగి ఇచ్చేస్తాను" అన్నాడు.

"వాడు లేకుంటే నేను ఇవ్వనా ఏంది. ఉండు తెచ్చిస్తా" అనేసి లక్ష్మీదేవమ్మ

ఇంట్లోకి వెళ్ళి వెయ్యి రూపాయలు తెచ్చి ఇచ్చింది.

పరమేశ్వరశాస్త్రికి పరమానందమయ్యింది. ఆయనకి ఎప్పుడన్నా డబ్బు అవసరమై రంగారావుని చేబదులు అడిగితే అడిగిన దాంట్లో సగం ఇచ్చేవాడు. అందుకని పరమేశ్వరశాస్త్రి అవసరమైనదానికి రెట్టింపు అడగటం అలవాటు చేసుకొన్నాడు.

ఆ అలవాటుప్రకారం వెయ్యి రూపాయలు అడిగితే లక్ష్మీదేవమ్మ అడిగినంత ఇచ్చింది.

తన టైం బావుంది అనుకొన్నాడు. ఇంటికి వెళుతూనే "సాయంకాలం హైదరాబాదు వెళుతున్నాను" అని భార్యతో చెప్పాడు.

వర్ధనమ్మకి అర్థంకాలేదు. కళ్ళు అప్పగించి చూసింది.

"హైదరాబాదా? " అని అడిగింది.

"అవును హైదరాబాదే"

"ఎందుకు"

"డబ్బు సంపాదనకు. అక్కడ జ్యోతిష్యం చెప్పి డబ్బు సంపాదించుకురావడానికి" హుషారుగా చెప్పాడు.

"ఉట్టికెక్కలేనమ్మ స్వర్గం ఎక్కబోయిందట. ఇక్కడ మీ జ్యోతిష్యం అడిగేవారు లేరుగానీ హైదరాబాదు పోతారట హైదరాబాదు"

పరమేశ్వరశాస్త్రికి కోపం వచ్చింది. విసురుగా శివాలయం వైపు వెళ్ళి తన హైదరాబాదు ప్రయాణం గూర్చి శివరామశాస్త్రికి చెప్పి వచ్చాడు.

పాత పంచాంగాలన్నీ మూటగట్టుకొని ఆ సాయంకాలం ప్రయాణమయ్యాడు.

తెల్లవారేసరికి హైదరాబాదులో లాడ్జిలో దిగాడు.

కాలకృత్యాలు ముగించుకొని పంచాంగం చూశాడు.

'అరగంటదాకా ఎక్కడికీ కదలకూడదు' అనుకున్నాడు.



"సార్... కాఫీగానీ, టీగానీ కావాలా" తలుపు నెట్టి తొంగిచూస్తూ అడిగాడు బోయ్.

"ముందొక ప్లేటు ఇడ్లీ కావాలి" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

బోయ్ రెండు నిమిషాల్లో ప్లేట్లో ఇడ్లీ తెచ్చి పరమేశ్వరశాస్త్రి ముందుంచాడు.

పరమేశ్వరశాస్త్రి ఇడ్లీ తిండానికి ఉపక్రమిస్తూ "ఇప్పుడు తెచ్చిపెట్టు మాంచి స్ట్రాంగ్ కాఫీ" అన్నాడు.

బోయ్ కాఫీ తెచ్చేసరికి పరమేశ్వరశాస్త్రి ఇడ్లీ తినేసి అతని చేతిలో కాఫీ అందుకొంటూ "నీ పేరేమిటి" అని అడిగాడు.

"మధుమూర్తి. ఇక్కడ అందరూ మధు అంటారు"

ఇక్కడికి దగ్గర్లో ఏదైనా ప్రింటింగ్ ప్రెస్ ఉందా" కాఫీ సిప్‌చేస్తూ అడిగాడు పరమేశ్వరశాస్త్రి.

"ఇక్కడే పక్క గల్లీలో ఉంది సార్. ఏదన్నా ప్రింట్ చెయ్యాలా. ఓనర్ నాకు తెలిసిన వాడే. కుమారస్వామి. రమ్మంటే వస్తాడు"

"పిలుచుకురాగలవా"

"ఆ పిలుచుకొస్తాను"

పరమేశ్వరశాస్త్రి ఖాళీచేసిన ఇడ్లీప్లేటు, కాఫీ కప్పు తీసుకొని వెళ్ళిపోయి పదిహేను నిముషాలలో కుమారస్వామిని వెంటబెట్టుకొని వచ్చాడు మధు.

కుమారస్వామి వస్తూనే పరమేశ్వరశాస్త్రికి నమస్కారం చేసి కుర్చీలో కూర్చున్నాడు. పరమేశ్వరశాస్త్రి తన జేబులోంచి ఒక కాగితం తీసి "దీన్ని ప్రింట్ చేయ్యాలి" అంటూ కుమారస్వామికి ఇచ్చాడు.

దాంట్లో ఉన్న విషయం చదివి "మీరు జ్యోతిష్యులా" అని అడిగాడు కుమారస్వామి.

అవును... జనన లగ్నాన్నిబట్టి జాతకం చెప్తాను" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

కుమారస్వామికి కాస్త కుతూహలం కలిగింది. కొద్దిగా ముందుకి వంగి "మీరు

ఏమీ అనుకోనంటే" అంటూ కుమారస్వామి తను పుట్టిన సంవత్సరం, నెల, తారీఖు చెప్పాడు.

పరమేశ్వరశాస్త్రికి అది మంచి అవకాశమనిపించింది. వెంటనే పాత పంచాంగాల కట్టలోంచి కుమారస్వామి చెప్పిన సంవత్సరానికి సంబంధించిన పంచాంగం తీసి జాతక చక్రం తయారుచేశాడు.

పధిహేను నిముషాల తరువాత

"మీరు చదువు మధ్యలో ఆపేశారు. ఒకసారి ప్రాణగండంనుండి బయటపడ్డారు. పెళ్ళయ్యింది. భార్యనుండి విడిపోయారు. సొంత ఊరు వదిలారు. మళ్ళీ పెళ్ళిచేసుకొన్నారు. ఇప్పుడు మీరు అనుభవిస్తున్న ఆస్తిపాస్తులన్నీ మీ రెండవ భార్యనుండి సంక్రమించినవే. అవునా? "

మళ్ళీ పరమేశ్వరశాస్త్రి చెప్పటం మొదలుపెట్టాడు.

"మొదట్లో ఒక అమ్మాయి పుట్టిపోయింది. ఆ తరువాత సంతానం కలుగలేదు. ఇంక రెండేళ్ళవరకు కలగదు. తర్వాత సంవత్సరం కవలపిల్లలు పుడతారు. ఇద్దరూ మగపిల్లలే"

కుమారస్వామి మొహం ఆనందంతో వెలిగిపోయింది. ఆయన చెప్పిందంతా నిజం కావడంతో పరమేశ్వరశాస్త్రి జ్యోతిష్యంపట్ల మంచి నమ్మకం కల్గింది. మధుని పిలిచి రెండు హార్లిక్స్ తెమ్మన్నాడు.

"ఇంకా చాలా విషయాలు చెప్పాలి. నేను ఇక్కడినుండి వెళ్ళేలోపు అన్నీ చెప్తాను. ముందు నాపని చేసిపెట్టు. సాయంకాలానికల్లా పాంప్లెట్ పంపకం జరిగిపోవాలి" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"అవన్నీ నేను చూసుకొంటాను లెండి" అంటూ లేచాడు కుమారస్వామి.

పరమేశ్వరశాస్త్రి కరపత్రాల ప్రింటింగ్‌కు డబ్బులివ్వబోయాడు.

"తర్వాత తీసికొంటానులెండి" అనేసి వెళ్ళిపోయాడు కుమారస్వామి.

మధ్యాహ్నం రెండింటికల్లా పాంప్లెట్స్ తయారుచేసుకొని వచ్చాడు. అతని నేతృత్వంలోనే పాంప్లెట్స్ పంపకం గూడా జరిగిపోయింది.

కుమారస్వామి తీసికొన్న శ్రద్ధకి పరమేశ్వరశాస్త్రి సంతోషించాడు. పాంప్లెట్స్‌కి అయిన ఖర్చుకింద డబ్బులివ్వబోతే కేవలం మెటీరియల్ కాస్ట్ మాత్రమే తీసికొన్నాడు కుమారస్వామి.

'భవిష్యత్‌ను గురించి చెప్పడం ఎవరికీ సాధ్యంకాదని అందరూ అంటారు. కానీ భవిష్యత్తుని గురించి ఆలోచించని వారుండరు. జాతకాలను, జ్యోతిష్యాన్ని గురించి వ్యతిరేకంగా వాదించేవారు కూడా జీవితంలో అనుకొన్నవి కాక ఎదురు దెబ్బలు తగులుతుంటే తల బొప్పికట్టి వాచిపోయి దీనమైన స్థితిలో జాతకం తెలుసుకోవడానికి ముందుకి వస్తారు.

నిజానికి అన్నీ సవ్యంగా ఉంటే కేవలం జాతకాలను గురించే కాదు దేవుణ్ణి కూడా గుర్తించడు మనిషి. కన్నతల్లినే పట్టించుకోడు. ఎదురు దెబ్బతగిలితే 'అమ్మా' అని ఎలా అంటాడో ఆ సమయంలో అమ్మ ఎలా గుర్తుకి వస్తుందో జీవితంలో ఎదురు దెబ్బలు తగిలినప్పుడు గుర్తుకొస్తాడు దేవుడు. అప్పుడే గుర్తుకొస్తుంది 'తన జాతకంలో దోషం ఉందా, ఇంట్లో ఏవైనా వాస్తు దోషాలు ఉన్నాయా' అని.

పుట్టిన బిడ్డ భవిష్యత్తు తెలుసుకోవాలన్న తపనతో జాతకాలు రాయించడం చాలామంది తల్లిదండ్రులకు సహజం. అదీ జనన లగ్నాలనుబట్టి రాసే జాతకాలమీద మంచి నమ్మకం.

పరమేశ్వరశాస్త్రి పంచిన పాంప్లెట్ హైదరాబాదు ప్రజల్లో బాగా పని చేసింది. ఊహించని రీతిలో జనం ఆయన్ని కలవసాగారు.

పరమేశ్వరశాస్త్రి చెప్పేవిధానం వాళ్ళకి బాగా నచ్చింది. ఆయన మాటలమీద

విశ్వాసం కలుగుతోంది.

డబ్బు కూడా బాగానే సంపాయించాడు. కానీ సొంత ఊళ్ళో గుర్తింపు లేకపోయిందన్న బాధ మనసును తొలిచివేస్తోంది.

ఇప్పుడు చూస్తే బావ తప్పకుండా తన జ్యోతిష్య పాండిత్యాన్ని గుర్తిస్తాడు.

కుమారస్వామిని తోడు తీసుకొని షాపింగ్ చేశాడు. మధు చేతిలో యాభైరూపాయలు పెట్టి రూము ఖాళీ చేశాడు.

"వెళ్లేముందు ఒకసారి మా యింటిదాకా రండి" అని కుమారస్వామి ఆహ్వానించి పరమేశ్వరశాస్త్రిని వాళ్ళ ఇంటికి తీసుకొని వెళ్ళాడు.

"మీ దయవల్ల మాకు సంతానం కలిగితే మంచి బహుమతి ఇచ్చుకొంటాము" అని కుమారస్వామి భార్య పూలు, పండ్లు ఇచ్చి పరమేశ్వరశాస్త్రి పాదాలకు నమస్కరించింది.

"నా దయకీ, మీ సంతానానికీ సంబంధం లేదమ్మా. సంతానం కలుగుతుందని మీవారి జాతకంలో ఉంది"

ఆ మాటలతో ఆమెకు పట్టలేనంత ఆనందం కల్గింది.

"నేను మళ్ళీ వచ్చేముందు నీకు ఉత్తరం రాస్తాను" అని పరమేశ్వరశాస్త్రి కుమారస్వామి దగ్గర అడ్రస్ తీసికొని "నువ్వు కూడా రాస్తూ వుండు" అంటూ తన అడ్రస్ కుమారస్వామికి ఇచ్చాడు.

ఆ రాత్రికే హైదరాబాదులో బస్సెక్కి పరమేశ్వరశాస్త్రి తెల్లవారేసరికి అగ్రహారం చేరుకున్నాడు.

యాకోబు కోడిపుంజు మరణం కళ్ళారా చూచిన ఆయనకి తన జ్యోతిష్య పాండిత్యంమీద పూర్తి విశ్వాసం కల్గింది.

వాడి కోడిపుంజు చనిపోయినందుకు పరమేశ్వరశాస్త్రికి బాధగా ఉన్నా తన జ్యోతిష్యం నిజమవ్వడంతో ఎక్కడలేని సంతోషం కలిగింది.

నా మాట విన్నావు కాదు" అని యాకోబుని ఉద్దేశించి అన్నాడు.

"తప్పైపోయింది బాబయ్య" గబగబా చెంపలేసుకొని ఏడ్చేశాడు యాకోబు.

"ఎంతక్కొన్నావు"

"నాలుగొందల యాభై"

జేబులోంచి పైకం తీసి అందులోనుండి ఐదొందలు యాకోబుకిచ్చి "ఇంకెప్పుడూ కోళ్ళజోలికి పోకు" అనేశాడు పరమేశ్వరశాస్త్రి.

ఇంటిముందు ఇంతగొడవ జరుగుతున్నా రంగారావు భార్య సుశీలమ్మ తనకేమీ పట్టదన్నట్టు ఆవైపుకే రాలేదు. డాబామీద ఉన్న ఇంటి కిటికీలోంచి చూస్తూ నిలబడిపోయింది. తాళి కట్టించుకొన్నందుకు ఆమె రంగారావు భార్య. ఆమెకి అతనంటే అలర్జీ, అసహ్యం. ఆమె దృష్టిలో రంగారావు ఒక అడవిమృగం. మంచికీ, చెడుకీ తేడా తెలియని మూర్ఖుడు.

మంచి ఆస్తి ఉంది. ఊరిమధ్యలో లంకంత ఇల్లు, నాలుగు కాండ్ల సేద్యం, నలుగురు జీతగాళ్ళు, మంచి పొలాలు ఉన్నాయి. అయినా సుశీలమ్మకు సంతోషం లేదు. దేవుడు కొందర్ని సుఖపడమని, మరి కొందర్ని కష్టపడమని సృష్టిస్తాడు. అందులో ఆమె రెండవ తెగకి చెందుతుంది.

బతుకుమీద ఆమెకు ఆశలేదు.

కానీ బతకాలనుకొంటుంది.

★ ★ ★

శివాలయం.

ఆలయ మంటపంలో శివరామశాస్త్రి బాసింపీట వేసుకొని రాగాలాపన చేస్తున్నాడు.

ఆయన రాగానికి అనుగుణంగా అమృత పాదాలు కదుపుతూ ఉంది. ఆ కదలికలో ఆమె పాదాలకున్న అందెలు లయబద్ధంగా సవ్వడి చేస్తున్నాయి.

శివరామశాస్త్రి పాట స్థాయి పెరిగేకొద్దీ అమృతపాదాల కదలికలో వేగం హెచ్చింది.

ఆయన గాన మాధుర్యం, అమృత నాట్యకౌశలంతో ఆ ప్రాంగణం ఓ నర్తనశాల అయ్యింది.

అప్రయత్నంగా అమృత నాట్యం చేయడం ఆపి శిలాప్రతిమలా నిలబడి పోయింది.

"ఏమిటమ్మా ఆగిపోయావు" శివరామశాస్త్రి అడిగాడు.

"ఆంటీ వచ్చింది"

శివరామశాస్త్రికి దగ్గరలో అమృతకు ఎదురుగా సుశీలమ్మ, ఆమె కొడుకు రమేష్ నిలబడి ఉన్నారు. పాటలో లీనమై ఉన్న శివరామశాస్త్రి వాళ్ళ రాకను గమనించలేదు.

పూజ చేయించడానికి వచ్చినట్టు ఆమె చేతిలో పళ్ళు, పూలు ఉన్న ట్రే ఉంది.

"అబ్బాయి ఎప్పుడొచ్చాడు" రమేష్‌ను చూసిన పరమేశ్వరశాస్త్రి లేస్తూ అడిగాడు.

"పొద్దున్నే వచ్చాడు" చెప్పింది సుశీలమ్మ.

"ఏమయ్యా రమేష్ పరీక్షలు ఎట్లా రాశావు" అని అడిగాడు శివరామశాస్త్రి.

"బాగానే రాశానండి" వినయంగా చెప్పాడు రమేష్.

శివరామశాస్త్రి సుశీలమ్మ చేతిలో ఉన్న ట్రేని అందుకొని గర్భగుడిలోకి వెళ్ళిపోయాడు. ఆయన వెనకాలే సుశీలమ్మ నడిచి "పూజ అబ్బాయి పేరుమీద చెయ్యండి" అని చెప్పింది. రమేష్ ఆమె పక్కన నిలబడ్డాడు.

శివరామశాస్త్రికి వాళ్ళ గోత్రం తెలుసుగాబట్టి అడగలేదు. మంత్రాలు చదువుతూ పూజ ప్రారంభించాడు.

వెనకనుండి అమృత రమేష్‌ని చూస్తూ ఉంది.

నల్లటి ఫాంటు, తెల్లటి ఫుల్ హ్యాండ్ షర్టు, టక్ చేసి నీటుగా ఉన్నాడు.

"బడికి ఎగనామం పెట్టి బొంగరాల ఆటలో తేలుతూ ఉండేవాడు. ఎంతబాగా తేలాడు..."

రమేష్ వెనక్కి తిరగటంతో చూపులు పక్కకు తిప్పుకుంది.

శివరామశాస్త్రి పూజచేసి హారతి తెచ్చాడు. సుశీలమ్మ పళ్లెంలో కానుకవేసి కళ్లకి అద్దుకొంది. పళ్లెంలోని విభూదిని తీసికొని తన నుదుట అద్దుకొని, రమేష్ నుదుట బొట్టుగా పెట్టింది.

"అన్నయ్యగారూ దేవుడు వీడినన్నా చల్లంగా చూస్తాడో లేదో!" అంది.

సుశీలమ్మ అలా అంటున్నప్పుడు ఆమె కళ్లనిండా నీళ్లు ఊరి చెంపలమీదికి జారాయి.

ఆమెను చూసిన శివరామశాస్త్రి కళ్లు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి.

"నువ్వేం దిగులు పడవద్దమ్మా! అంతా ఆ దేవుడే చూసుకొంటాడు" అన్నాడు శివరామశాస్త్రి.

తరువాత సుశీలమ్మ మంటపంలో స్థంబానికి ఆనుకొని కూర్చుంది. ఆమె పక్కనే రమేష్ కూర్చున్నాడు.

అప్పుడు అమృత వాళ్లకి కాస్తదూరంగా నిలబడి ఉండడం చూసింది సుశీలమ్మ.

"ఏమిటీ దూరంగా ఉన్నావు. ఇలారా... కూర్చో" అంటూ పిలిచింది అమృతను సుశీలమ్మ.

సుశీలమ్మ పక్కన రమేష్ లేకుంటే అమృత పిలవకుండానే వచ్చి ఆమెకు ఎదురుగా కూర్చొని కబుర్లు చెప్పేది. కానీ రమేష్ ఉండడంతో సిగ్గుపడింది. బిడియంగా అడుగులు వేస్తూ వచ్చింది. ఆమె నడిచి వస్తుంటే పాదాల అందెలు రమేష్ హృదయంలో సవ్వడిచేస్తున్నాయి.

అమృత వచ్చి బుద్ధిమంతురాల్లా సుశీలమ్మ ముందు గువ్వలా ఒదిగి కూర్చుంది.

"ఎందుకీ బిడియం. వీడు రమేషేగా నీకు తెలియదా? "

తెలుసు అన్నట్టు సిగ్గుపడుతూ తల వంచుకొంది అమృత.

రమేష్ అమృతని చూసీచూడనట్టే చూస్తున్నాడు

గులాబీ రేకుల్లా ఎర్రని పెదాలు, ముచ్చటగా పొడవైన ముక్కు, అంటీ అంటనట్టుగా

దిద్దిన కాటుకతో ప్రకాశిస్తున్న కళ్లు.

రమేష్ తననే చూస్తున్నాడని గమనించింది అమృత.

"అమ్మ నాకోసం ఎదురు చూస్తూ ఉంటుందాంటీ!" ముద్దుముద్దుగా అనేసి లేచి గబగబా వెళ్లిపోయింది.

రమేష్‌ని నీరసం ఆవహించింది.

'కావాలనే వెళ్లిపోయింది' అనుకొన్నాడు.

నిజానికి వాళ్ల ఇల్లు ఎంతో దూరం లేదు. ఆలయ ప్రాంగణంలోనే ఉంది. ఇంట్లోంచి పిలిస్తే గుడిలోకి వినిపిస్తుంది.

సుశీలమ్మ, రమేష్ మరికొద్దిసేపు అక్కడే ఉండి ఇంటికి వచ్చేశారు.

★ ★ ★

ఆ రాత్రి...

రమేష్‌కి నిద్రపట్టలేదు. అమృత రూపం



కళ్లల్లో తిష్టవేసింది. ఆమె అందెల సవ్వడి హృదయాన ఆడుతూ ఉంది.

"ఐదేళ్లలో ఎంత మారిపోయింది. తనను చూస్తేనే పారిపోతోంది"

"అది సిగ్గా? బిడియమా?"

"స్కూల్లో తను చేసే చిలిపితనాన్ని

అంతా భరించేది. క్లాసులో పుస్తకాలు వది లేసి తను గోలికాయల ఆటకు వెడితే వచ్చే వరకూ వాటికి కాపలా ఉండేది. ఒక్కొక్కసారి లాంగ్‌బెల్ కొట్టినా తను తిరిగి స్కూలుకు రాకపోతే ఆ పుస్తకాలు మోసుకొచ్చి అమ్మకి ఇచ్చేది"

అలా అమృత చిన్నతనంలో తనకు సన్ని హితంగా ఉండడాన్ని గుర్తుకు తెచ్చుకొంటూ ఎప్పుడో తెల్లవారుజామున నిద్రలోకి జారు కున్నాడు.

"నాయనా రమేష్ లేవరా, తెల్లవారింది" దుప్పటి ముసుగులో ఉన్న రమేష్‌ని నిద్రలే పటానికి వచ్చింది సుశీలమ్మ.

"కొద్దిసేపాగి లేస్తానులేమ్మా" రమేష్ దుప్పటిలోంచే అన్నాడు.

"పాలు తాగి పడుకో నాన్నా!"

"ఒకేసారి టిఫిన్‌చేసి తాగుతాలేమ్మా... ప్లీజ్" మొహం దగ్గర ముసుగును తొలి గించి అమ్మని పంపించేశాడు.

అమ్మ అటు వెళ్లగానే రమేష్ తన ఊహ ల్లోకి అమృతని ఆహ్వానించాడు.

పదినిముషాల్లో లక్ష్మీదేవమ్మ వచ్చి రమే ష్‌పైనుండి దుప్పటి లాగేసింది.

"లేవరా పొద్దెక్కింది" అంది.

నాయనమ్మ మీద కోపం వచ్చింది రమే ష్‌కి.

"ఉండవే కాస్సేపు నిద్రపోనీ" అసహ నంగా కసిరాడు.

"బయట మీ నాయన ఉన్నాడురా. ఇప్ప టికే రెండుసార్లు అడిగాడు నువ్వు లేచావా లేదా అని"

లక్ష్మీదేవమ్మ నోట నాయన అనే మాట వినబడగానే రమేష్ లేచి కూర్చున్నాడు.

రమేష్‌కి నాన్న అంటే భయం.

ఆ ఇంట్లో రంగారావుకి ఏదన్నా ఎదురు చెప్పాలంటే ఎవరూ సాహసించరు. వాళ్ల అమ్మ లక్ష్మీదేవమ్మగారే ముందుకు రాగ లరు. సుశీలమ్మ రంగారావుని అసలు పట్టిం చుకోదు. ఆయనతో మాట్లాడటానికే ఇష్టప డదు.

పెళ్లికాకముందు ఆమె సాంసారిక జీవి తాన్ని గురించి ఎంత ఉన్నతంగానో ఊహిం చుకొంది. భర్త అంటే దైవమే అనుకొంది. కానీ రంగారావుతో తాళి కట్టించుకొన్న తరు వాత తెలిసింది, ఆమెకి దేవుడు తనపై పగ బట్టి ఈయన్ని భర్తగా ఇచ్చాడని.

అందుకామె భగవంతుడిని తిట్టగూడద నుకొంటూనే చడామడా తిట్టేది. తర్వాత చెంపలేసుకొని 'తప్పైపోయింది స్వామీ క్షమించు' అంటూ భోరున విలపించేది. ఆ శోకదేవత ప్రాణం అంతా రమేష్‌ని పెనవే సుకొని ఉంది. వాడి క్షేమం కోసం ఆ తల్లి ప్రాధేయపడని దేవుడు లేడు. స్కూలుకి ఎగనామం పెట్టి రమేష్ ఏటినీట్లో మునుగు తున్నాడని తెలిసి ఆ ఏట్లో ఉన్న గుండాలు ఎక్కడ వాడిని బలితీసుకుంటాయోనని తల్ల డిల్లిపోయింది.

చదువుకోసం విజయవాడ వెళ్లడంతో రమేష్ అక్కడ ఎలా ఉంటున్నాడో, సరిగ్గా తింటున్నాడో లేదోనని ఒకటే బెంగ. పరీ క్షలు అయిపోయి తిరిగి వస్తున్నాడని తెలిసి ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని ఆ రాత్రి ఆమె నిద్రపోలేదు.

రమేష్ ఇంట్లోకి రాగానే దిష్టితీసి "నా తండ్రీ" అంటూ కావలించుకొని కంటనీరు పెట్టుకుంది.

"అమ్మా ఎందుకే ఆ కన్నీరు?" అంటూ రమేష్ ఆమె కన్నీరు తుడిచాడు.

"నిన్నా దేవుడు చల్లగా చూస్తే చాలు నాయనా. ఈ లోకంలో నాకెవరున్నారు చెప్పు? నువ్వు తప్ప" తల్లి మాటల్లోని ఆవే దన అర్థం అయింది రమేష్‌కి.

అతని మనసులో మృదుల మెదిలి కళ్లు చెమ్మగిల్లాయి. అంతలోనే తండ్రి గుర్తుకు వచ్చి ఆవేశంతో ఊగిపోయాడు. కానీ తను అశక్తుడు.

నిద్రలోంచి బయటకొచ్చేసరికి తండ్రి కోడి పుంజుని చంకలో పెట్టుకొని జొన్నలు తిని

పిస్తున్నాడు. ఆయన నోట్లో వేపపుల్ల నమలగా నమలగా ఓ అంగుళం ముక్కయి మిగిలింది.

రమేష్‌ని చూస్తూనే "ఎక్కడికిరా పోతున్నావ్" అని అడిగాడు.

తండ్రి అలా అడుగుతాడని రమేష్ ఊహించలేదు. అమృతని చూడాలని ఉంది అతనికి. ఏం చెప్పాలో తోచలేదు.

"తొందరగా వచ్చెయ్"

గేటుదాటి వీధిలోకి వచ్చేశాడు రమేష్. శివాలయంవైపు వెళ్లి అమృతకోసం చూశాడు. అక్కడ ఆమె కనబడలేదు.

'ఏం చేయాలి?'

ఇంటికి వెళ్లాలంటే మనసొప్పలేదు.

ఏటివైపు నడిచాడు.

అక్కడ ఏట్లో దిగి నీళ్లతో బిందె నింపుతూ ఉంది అమృత.

ఆ క్షణంలో రమేష్ గుండె వేగంగా కొట్టుకొంది. వడివడిగా దగ్గరకి వెళ్లాడు.

వెళ్లాడేగాని అమృతని పలకరించే ధైర్యం అతనికి లేకపోయింది. కొద్దిసేపు తటపటాయించాడు. తరువాత ఎంతో ప్రయత్నం మీద ధైర్యం చేసి "అమృతా" అని పిలవగలిగాడు.

రమేష్‌ని చూడగానే అమృత గుండె ఝల్లుమంది.

తనేదో మాట్లాడాలనుకొన్నాడు రమేష్. ఆమె చూసిన చూపులకి ఒకమాటగూడా పెదవి దాటి రాలేకపోయింది.

ఇద్దరి మధ్యా మౌనం.

"నేను గుర్తున్నానా" అనడిగాడు రమేష్ తడబడుతూనే.

"ఎందుకు గుర్తులేవు"

"అయితే ఎవర్నో చెప్పు"

"సుశీలమ్మ ఆంటీ కొడుకువి. రమేష్‌వి"

"పేరుగూడా గుర్తుందన్నమాట"

రమేష్‌లో బిడియం కాస్త తగ్గింది.

"అవును... మీ గుడిలో బావి ఉంది కదా. నీళ్లకోసం ఇక్కడికి వచ్చావెందుకు"

"శివలింగానికి అభిషేకం చెయ్యాలంటే ఈ నీళ్లే వాడుతారు మా నాన్నగారు" అంటూ బిందెను ఎత్తుకొంది.

"రోజుకు ఎన్నిసార్లు అభిషేకంచేస్తారు?"

అమృత నవ్వింది.

ఆ నవ్వు రమేష్ కళ్లల్లోంచి హృదయంలోకి పాకి గిలిగింతలు పెట్టింది.

'ఎంత అందమైన నవ్వు' అనుకొన్నాడు.

అమృత నవ్వు ఆపగానే ఏదో పోగొట్టుకొన్నట్టయింది రమేష్‌కి.

"ఒకసారే! అదీ ప్రొద్దున్నే" అని చెప్పింది.

"రేపుగూడా చేస్తారా"

"ఊc"

"ఎల్లుండి"

"రోజూ... ఎందుకు నీకీ వివరాలన్నీ?"

రమేష్ తడబడ్డాడు.

"అహహ... ఏం లేదు ఊరికినే అడిగాను అంతే" అన్నాడు.

అమృత రోజూ ఈటైంకి ఏటికి వస్తే తనుకూడా రావచ్చు ఆమెతో మాట్లాడటానికి మంచి అవకాశం అనుకున్నాడు.

ఇద్దరూ ఏటిగట్టు ఎక్కేశారు.

ఇంకా అక్కడే ఉంటే బాగుండు అనిపించింది రమేష్‌కి. కానీ అమృత నిలవకుండా వెళ్లిపోయింది.

ఆమె నవ్విన నవ్వు రమేష్ కళ్లల్లో మెదిలింది.

ఆ కళ్లు... ఆ పళ్లు... ఆ మొహం... మనసులో ఏదో పరవశం.

ఆ చూపులు ఎంత తియ్యగా ఉన్నాయి.

అమృత

అడుగులేస్తూ అప్రయత్నంగా అనుకొన్నాడు.

రమేష్ ఇంటికి వచ్చేసరికి దొడ్లో సుశీలమ్మ తులసికోటకు పూజ చేస్తూ ఉంది.

"రా నాయనా... మొహం కడుక్కో స్నానానికి నీళ్లు పెడతాను" అంటూ పురమాయించింది.

★ ★ ★

పరమేశ్వర శాస్త్రి పంచలో వాలుకుర్చీలో వాలి పంచాంగం తిరగేస్తూ వీధి వాకిట్లోంచి సుశీలమ్మ రావడం చూసి ఆశ్చర్యపోయాడు.

ఆమె సాధారణంగా ఇల్లు విడిచి ఎక్కడికీ పోదు. ఒకవేళ వెళ్తే ఎపుడేనా శివాలయానికి వెళుతుంది.

"రండి రండి" అంటూ పరమేశ్వర శాస్త్రి లేచి మంచం వాల్చాడు. సుశీలమ్మ వచ్చి మంచంమీద కూర్చోగానే పరమేశ్వరశాస్త్రి వంటింట్లోకి వెళ్లి భార్యకు చెప్పాడు. వర్ధనమ్మ వెంటనే చేతులు కడుక్కొని మంచి నీళ్లు తీసుకొని వచ్చింది.

"ఏదో పనిమీద వచ్చినట్టున్నారు" అంటూ సుశీలమ్మ చేతికి మంచినీళ్ల గ్లాసు అందించింది.

"కాఫీ పెట్టి తీసుకు రావే"

పరమేశ్వరశాస్త్రి భార్యను పురమాయించాడు.

"వద్దండి. ఇప్పుడేం వద్దు" అని సుశీలమ్మ వారిస్తున్నా వినకుండా "ఇప్పుడే పెట్టుకొస్తాను" అంటూ లోపలికి వెళ్లిపోయింది వర్ధనమ్మ.

పరమేశ్వర శాస్త్రి నిలబడే ఉన్నాడు. సుశీలమ్మ ఎదుట కూర్చోవాలంటే కాస్త బిడియం. పైగా ఆమె గౌరవించ దగిన వ్యక్తి.

"మీరు నిలబడే ఉన్నారు" అన్నది సుశీలమ్మ.

"ఫరవాలేదులెండి మీరొచ్చిన పని చెప్తే..."

"ఏం లేదు, మావాడి డేట్ ఆఫ్ బర్త్ తెచ్చాను. జాతకం చూసి చెప్పగలరేమోనని"

అంటూ ఓ కాగితం పరమేశ్వరశాస్త్రికిచ్చింది.

పరమేశ్వరశాస్త్రి ఆ కాగితం అందుకొని చూశాడు. అందులో తేదీ, నెల, సంవత్సరం ఇంగ్లీషు క్యాలెండరునిబట్టి రాసి ఉంది.

"అబ్బాయి పుట్టింది పగలా? రాత్రా?" అని అడిగాడు.

చెప్పింది సుశీలమ్మ.

"టైం గుర్తుందా"

అదీ చెప్పింది.

పరమేశ్వరశాస్త్రి రమేష్ పుట్టిన సంవత్సరానికి సంబంధించిన పంచాంగం ముందేసుకొని కూర్చున్నాడు.

వర్ధనమ్మ కాఫీ తెచ్చింది.

"ఎందుకమ్మా" అంటూనే సుశీలమ్మ వర్ధనమ్మ చేతిలోంచి కాఫీ గ్లాసు అందుకొంది.

పరమేశ్వరశాస్త్రి రమేష్ జాతకచక్రం తయారుచేసి విషయం పరిశీలించసాగాడు. అప్పుడు ఆయనకేదో అనుమానం కలిగింది.

"ఈ డేటాఫ్‌బర్త్ మీ అబ్బాయిదేకదమ్మా" అని అడిగాడు.

"అవును... అంటే మీ అనుమానం ఏమిటి?" అని అంది.

"అనుమానం కాదులెండి. విషయం పరిశీలించేముందు పూర్తి అవగాహన కోసం లెండి" అని తను నిశితంగా పరిశీలించసాగాడు.

క్రమంగా పరమేశ్వరశాస్త్రి కనుబొమలు ముడివడసాగాయి. రమేష్ కష్టజాతకుడు. భవిష్యత్తులో హంతకుడిగా మారే ప్రమాదం ఉంది. మతిభ్రమణ సూచనలు కూడా కనిపిస్తున్నాయి.

ఆ విషయాలు పరమేశ్వరశాస్త్రి సుశీలమ్మకి చెప్పగలడా? చెప్తే ఆమె తట్టుకోగలదా?

ఏ జ్యోతిష్యుడూ ఎదుటివాళ్లకు కష్టం కల్గించే విషయాలు చెప్పడానికి ఇష్టపడడు. వివాహాది శుభకార్యాలు, ధన లాభం, కోర్టు వ్యవహారాల పరిష్కారం, ఉద్యోగ ప్రాప్తి, బదిలీలు వంటి విషయాలను గురించి మానసికోల్లాసం కల్గించే విధంగానే చెప్తారు. అంతేగానీ యదార్థాన్ని చెప్పి అశాంతికి గురిచెయ్యరు.

మరి తను సుశీలమ్మకు ఏం చెప్పాలి?

అప్పుడు పరమేశ్వరశాస్త్రికి తను

జ్యోతిష్యం నేర్చుకొని తప్పు చేశానా? అనిపించింది.

"మీ అబ్బాయి మంచి ప్రయోజకుడవుతాడు. పట్టుదలగల మనిషి. అప్పుడప్పుడూ ఆటంకాలు, ఇబ్బందులు ఎదురైనా మొత్తం మీద అంతా మంచే కనపడుతోంది. అతని జాతకంలో ఎక్కడా అపశృతి కనబడటం లేదు. అన్నీ సవ్యంగానే జరుగుతాయి" అని చెప్పాడు.

"ఆయుః ప్రమాణం చెప్పలేదు" అని అడిగింది సుశీలమ్మ.

"పూర్ణాయుష్కుడు. ఎనభై తొమ్మిది సంవత్సరాలు ఆయుర్దాయం"

సుశీలమ్మకి కావలసిందల్లా అదే. రమేష్ తన కళ్ల ఎదుట ఉంటేచాలు. ఇప్పుడామె మనసు కాస్త కుదుట పడింది.

"వస్తానండి" అంటూ లేచింది.

పరమేశ్వరశాస్త్రి, వర్ధనమ్మ ఆమె వెనకాలే వీధి గుమ్మందాకా వెళ్లారు. సుశీలమ్మ గుమ్మం దిగుతూ వెనక్కి తిరిగి "సాయంకాలం ఉభయం పంపిస్తాను తీసుకోండి" అంటూ చెప్పి ముందుకు నడిచింది.

ఆమెను సాగనంపి పరమేశ్వరశాస్త్రి, వర్ధనమ్మ పంచలోకి వస్తుండగా వెనకనుండి "శాస్త్రిగారూ మీకు లెటరు ఉంది" అంటూ పోస్ట్‌మాన్ వచ్చి కవరొకటి ఇచ్చి వెళ్లాడు.

పరమేశ్వరశాస్త్రి లెటరు అందుకోగానే "అబ్బాయి రాసిందేనా" అని అడిగింది వర్ధనమ్మ.

"కాదు హైదరాబాదునుండి"

పరమేశ్వరశాస్త్రి కవరు చించి అందులోంచి లెటర్ తీసి చదివాడు.

"ఎవరో వేణుగోపాలట. కుమారస్వామి దగ్గర అడ్రసు తీసుకొని రాశాడు. మూడు నెలల క్రితం వాళ్లకి బాబు పుట్టాడట. జాతకం రాసి పంపించమని డేటాఫ్ బర్త్ అదీ రాసి పంపాడు. అందుకుగాను అయిదొందలు మనియార్డర్ పంపిస్తున్నట్లు రాశాడు" అని చెప్పాడు పరమేశ్వరశాస్త్రి.

"ఇంకేం మీకు పని దొరికిందిగా. పంచాంగాలు ముందేసుకోండి" అనేసి వర్ధనమ్మ లోపలికి వెళ్లిపోయింది.

పరమేశ్వరశాస్త్రి వాలుకుర్చీలోకి వాలిపోయాడు. అతని మనసంతా సుశీలమ్మ చుట్టూ పరిభ్రమిస్తోంది.

ఆమెకి తను చెప్పిందంతా పచ్చి అబద్ధం. ముందు ముందు ఆమె ఎంత శోకం అనుభవిస్తుందో...

★ ★ ★

నిద్రలేస్తూనే రమేష్ ఏటివైపు వెళ్లాడు.

జాలుగా పారుతున్న ఆ ఏటి నీటిలో శివరామశాస్త్రి, పరమేశ్వరశాస్త్రి పక్కపక్కనే నిలబడి సూర్యనమస్కారం చేస్తూ కనబడ్డారు.

అమృత కోసం చూశాడు రమేష్. అక్కడ ఆమె కనబడలేదు. అప్పుడు తెలిసిందతనికి తను చాలా పొద్దున్నే వచ్చానని.

పరమేశ్వరశాస్త్రి, శివరామశాస్త్రి సూర్యవందనం ముగించుకొని పోయేవరకు వాళ్లకు కనబడకుండా దూరంగా చాటుకువెళ్లాడు.

వాళ్లు వెళ్లి పోగానే తిరిగివచ్చి అమృత కోసం ఎదురుచూడసాగాడు రమేష్.

క్షణక్షణానికీ సూర్యకిరణాల తీవ్రత పెరుగుతోంది.

ఖాళీ బిందెను చంకన పెట్టుకొని అమృత వస్తూ ఉంది. ఆమెను చూసిన రమేష్‌కి క్షణకాలం గుండె కొట్టుకోవడం మానేసింది.

అమర నర్తకిలా నడచి వస్తున్న అనుభూతి, అప్రయత్న పరవశం.

అమృత దగ్గరయ్యేకొద్దీ రమేష్ హృదయ స్పందన వేగం పుంజుకొంది.

అనుకోకుండా కనబడ్డ రమేష్‌ని చూసి అమృత కాళ్లకి బ్రేక్ పడ్డట్టు నిశ్చేష్టురాలయ్యింది. వెంటనే తేరుకొని చిన్న నవ్వుతో ముందుకు కదిలిపోసాగింది.

రమేష్ ఆమె పక్కనే వెనకాలగా కదిలి నాలుగడుగులు వేసి "అమృతా" అని పిలిచాడు.

అమృత పక్కకు తిరిగి చూసింది.

"నీతో కాస్త మాట్లాడాలని ఉంది" అన్నాడు.

"నాతోనా? " ఆశ్చర్యంగా చూసింది.

"ఆ..."

"ఏమిటి? "

రమేష్ నోట్లోంచి మాటలు రాలా? ఏం మాట్లాడాలో తెలియడంలేదు. అమృతను చూస్తూ ఉండిపోయాడు.

"మాట్లాడు మరి" ఆమె అడిగింది.

"అదే ఏం మాట్లాడాలో..."

రమేష్ ప్రవర్తనకి అమృత నవ్వుకుంది.

"సరేలే నే వెళ్తా. నీళ్ళు తీసుకెళ్లాలి..." అంటూ ఆమె నడవసాగింది. రమేష్ ఆమెని అనుసరించాడు.

"నాకు... నాకు... రాత్రి నిద్రపట్టలేదు" అనేశాడు.

"ఏం? రాత్రి మీ అమ్మగారు భోజనం పెట్టలేదా? "

"ఊహూ... అదికాదు రాత్రి అంతా నువ్వే గుర్తుకొస్తున్నావు"

అమృత రమేష్ మొహంలోకి చూసింది. "ఏం? ఎందుకని? నేనే ఎందుకు గుర్తుకు వచ్చాను? మీ అమ్మానాన్నా, నాన్నమ్మ వాళ్ళు గుర్తు రాలేదా? విజయవాడలో నీ ఫ్రెండ్స్ గుర్తుకురావడంలేదా? "

"ఆహా... నువ్వే... అందుకనే పొద్దున్నే వచ్చాను. నువ్వు నీళ్ళకొస్తావని నీతో మాట్లాడాలని"

"అయితే నాకోసం పొద్దుటనుండి ఇక్కడ కాపలా కాశావన్నమాట"

"ఆ అవును నిజంగా"

"మా నాన్నగారు ఎదురుచూస్తూ ఉంటారు. నే వెళ్లాలి" ఆమె కదలబో యింది.

"ప్లీజ్ నాకోసం కాసేపు ఉండవూ? "

"ఎందుకు? "

"నిన్ను చూస్తూ ఉండాలనిపిస్తుంది నాకు"

"ఏయ్... ఏమిటి నీ ఉద్దేశం. మీ నాన్నకు చెప్పాలా? నా వెంటపడుతున్నా వని" కాస్త కోపంగా అంది.

అమృత నాన్నకు చెప్తాననడంతో రమేష్‌కి షాక్ తగిలినట్లై భయం మొదలయ్యింది.

మరోమాట మాట్లాడకుండా గబగబా నడుచుకుంటూ అక్కడినుండి వెళ్ళిపో యాడు

అమృత బిందెనిండా నీళ్ళు ముంచుకొని గుడిలోకి వచ్చింది.

శివరామశాస్త్రి శివలింగంపై నీళ్ళు పోస్తుంటే అమృత మస్తిష్కంలో రమేష్ మెదిలాడు. నాన్న పేరు వినగానే రమేష్ మొహంలో కనబడ్డ భయం తాలూకు మార్పు ఆమెకి కళ్ళకి కట్టినట్లు కనబడసా గింది.

'తొందరపడి వాళ్ళ నాన్నకి చెప్తాన న్నానా? ' అమృత మనసు రమేష్‌ని గురించి ఆలోచించసాగింది. ఆ ఆలోచనల్లో రమేష్ రూపం సమ్మోహనంగా ఉంది.

తననే చూస్తున్నట్టు...

మనసారా ప్రేమిస్తున్నట్టు...

కళ్ళతో కవ్విస్తూ పిలుస్తున్నట్టు...

తను చిక్కినట్టు... చిక్కనట్టు...

దోబూచులాడుతున్నట్టు...

అలా... అలా...

అమృత మనసులో రమేష్ చిక్కిపో యాడు.

అప్పుడు ఆమెలో ఏదో మార్పు.

మరుసటిరోజు పొద్దున్నే చక్కగా ముస్తాబై బిందెతీసుకొని ఏటికి వెళ్ళింది. అక్కడ రమేష్ కనబడలేదు. దారికాసి ఎదు రుచూసింది. అతను వస్తున్న జాడలేదు. రేవుదగ్గర బిందె పట్టుకుని కూర్చుండిపో యింది. 'ఊహూ... రమేష్ రాలేదు' అమృ తని నీరసం ఆవహించింది. లేచి రేవులో దిగి బిందె ముంచింది.

"ఏయ్... అమృతా"

ఆత్రంగా తల పైకెత్తి చూసింది.

ఎదురుగా చంద్రశేఖర్ నిలబడి వున్నాడు.

ఖిన్నురాలయింది అమృత. తేరుకొని

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.
- ★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచటం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

______ మార్చి చతుర నవల జ్యోతిష్యం ______

సమీక్షకుని పేరు : ______

చిరునామా ______

______

______

"ఎప్పుడొచ్చావు బావా" అని అడిగింది.

"పొద్దున్నే వచ్చాను" చెప్పాడు చంద్రశేఖర్.

అమృత నీటిబిందెను చంకన పెట్టుకుని రేవులోంచి బయటకు వచ్చింది. చంద్రశేఖర్ ఆమెను అనుసరించాడు.

"నాట్యం నేర్చుకోవడం పూర్తయిందా అమృతా? " అని అడిగాడు.

"లేదు. ఇంకా ఉంది. అది ఎంత నేర్చుకున్నా తరిగేది కాదుగా"

"అవును నిజమే. నాట్యకళలో ఎన్నోరీతులు ఉన్నాయట. మా తెలుగు మాష్టారు చెప్తుండేవారు. అదో పెద్ద ఓషనట. భరత నాట్యం, కూచిపూడి, మణిపురి, కథక్, ఒడిస్సీ వంటి ఎన్నో రకాలున్నాయట. అవన్నీ నేర్చుకుని నాట్యకళలో నిష్ణాతులు కావాలంటే మనిషికి ఒక జన్మ చాలదు"

చంద్రశేఖర్ మాటల్లో తను చదువుకున్న వాడినన్న గర్వం ధ్వనిస్తోంది. తను అమృతను రాసుకుంటూ నడవడానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ ఆమె చంద్రశేఖర్‌కి ఆ అవకాశం ఇవ్వకూడదని కాస్త దూరంగా నడుస్తోంది. చంద్రశేఖర్ కళ్ళు అమృతపైనే ఉన్నాయి.

"అయినా నువ్వు అదృష్టవంతురాలివి అమృతా. మావయ్య శ్రద్ధగా నీకు నాట్యం నేర్పిస్తున్నాడు..."

చంద్రశేఖర్ మాటలకు అడ్డు తగులుతూ అమృత, "నీకూ వచ్చుగా నాట్యం చిన్నప్పుడు నేర్చుకున్నావుగా" అంది.

"ఆ... ఏం నేర్చుకోవడంలే. అప్పుడెప్పుడో చిన్నప్పుడు నేర్చుకుంటే ఇంకా గుర్తుంటుందా? ఎప్పుడో మర్చిపోయాను. చదువుకని కాకినాడ తరిమితిరాయె!"

"మంచిదేగా బాగా చదువుకున్నావు. మంచి ఉద్యోగం వస్తుంది"

"ఈ రోజుల్లో ఉద్యోగాలకేం విలువ ఉంది అమృతా. చాలీచాలని జీతాలు. జీవితంలో ఒక థ్రిల్ అంటూ ఉండదు. చేతిలో ఒక కళ ఉంటే చాలు. చక్రం తిప్పెయ్యొచ్చు అదృష్టం ఉంటే ప్రపంచమే చుట్టిరావచ్చు మావయ్య చూడు ఎంత గొప్ప పేరు సంపాయించుకున్నాడు. మంచి నాట్యకారుడుగా వివిధ ప్రాంతాలలో రకరకాల బహుమతులు తెచ్చుకున్నాడు. ప్రముఖుల ప్రశంసలు, సన్మానాలు పొందాడు. శివతాండవంలో ఆయన్ని కొట్టే వెయ్యిలేదు. ముందుముందు చూడు నువ్వూ గొప్ప పేరు తెచ్చుకుంటావు" చంద్రశేఖర్ చేతులు గాల్లో ఊపుతూ అలా మాట్లాడుతూ ఉంటే అమృతకి సంతోషంగా ఉంది.

కానీ ఆమెకళ్ళు రమేష్‌ని వెతికే పనిలో ఉన్నాయి. రమేష్ కనబడలేదు. ఆమెలో ఉత్సాహం సన్నగిల్లింది. యాంత్రికంగా చంద్రశేఖర్‌తో నడుస్తోంది.

ఇద్దరూ ఏటిగట్టెక్కి ఊరివైపు దిగారు.

అక్కడినుండి చంద్రశేఖర్ ఇంటికి వెళ్ళకుండా అమృతవెంట శివాలయానికి వచ్చాడు.

మేనల్లుడిని చూస్తూనే శివరామశాస్త్రి కుశలప్రశ్నలు వేశాడు. ఆయన భార్య శారదమ్మ కాకినాడ విషయాలు అడిగింది. చంద్రశేఖర్ అక్కడే మొహం కడుక్కొని కాఫీ, టిఫిన్ తీసుకున్నాడు.

అప్పుడే సునీత అక్కడికి వచ్చింది.

సునీత లోపలికి వస్తూ అక్కడ ఉన్న అన్నయ్యను చూసింది.

"నువ్విక్కడ ఉంటావని తెలుసులే. అందుకే అమ్మ నన్ను పంపింది నిన్ను పిలుచుకురమ్మని" అంది శేఖర్‌ని ఉద్దేశించి.

శారదమ్మ ప్లేట్లో టిఫిన్ పెట్టింది. సునీత తింటూ అక్కడ అమృత కనబడకపోవడంతో "అత్తయ్యా వదినేది? " అని అడిగింది.

"గుళ్ళో ఉంటుందమ్మా" అని చెప్పింది శారదమ్మ.

సునీత టిఫిన్ తిని కాఫీ తాగి గుళ్ళోకి వెళ్ళింది. అక్కడ అమృత లేదు. శివరామ

శాస్త్రి ఒక్కడే ఉన్నాడు.

"మావయ్యా వదినేది?" అని ఆయన్ని అడిగింది.

"ఇప్పటిదాకా ఇక్కడే ఉందమ్మా. పూలు కోస్తానంది. తోటలో ఉందేమో చూడు" అని చెప్పాడు శివరామశాస్త్రి.

శివాలయం ప్రహరీని ఆనుకొని విశాలమైన తోట ఉంది. అందులో రకరకాల పూలమొక్కలు, పండ్లచెట్లు ఉన్నాయి. తోట మధ్యలో దిగుడుబావి ఉంది. అమృతా, శివరామశాస్త్రి తీరిక సమయంలో తోటపని చేస్తూ ఉంటారు. ఆ తోటలోని పూలే గుడిలో పూజకు ఎప్పుడూ వాడుతుంటారు.

సునీత వెళ్ళేసరికి అమృత మందారం చెట్టుచుట్టూ తిరుగుతూ ఉంది. ఆ చెట్టుకి ఒకే ఒక పువ్వు ఉంది. అదీ అందనంత ఎత్తులో ఉంది. దాన్ని కొయ్యడానికి అమృత శ్రమపడుతూ ఉంది.

"ఎందుకు వదినా అందని దానికోసం అంత కష్టపడుతున్నావు?" అంటూ అక్కడికి వచ్చింది సునీత.

"ఇదిగో ఈ కొమ్మ పట్టుకోవే సునీతా" తన చేతిలోని కొమ్మని సునీతకి అందించి తను ఇంకో కొమ్మ పట్టుకొని వంచి ఆ పువ్వుని కోసింది అమృత.

ఆ తర్వాత ఇద్దరూ కలిసి తోటంతా తిరిగి మరికొన్ని పూలు కోసుకొని వచ్చారు.

ఆలయ మంటపంలో ఆ పూలన్నీ గుట్టగా పోసి అందులోంచి మందారపువ్వుని తీసుకొంది అమృత.

"నాన్నా సుశీలమ్మ ఆంటీకి ఈ పువ్వు అంటే మహా ఇష్టం. మొన్న అడిగింది. ఇచ్చొస్తాను" అని నాన్నగారికి చెప్పి వెళ్ళింది.

ఆ సమయంలో రమేష్ మిద్దెమీది ఇంట్లో ఉన్నాడు. అమృత వీధి వాకిట్లోంచి ఇంట్లోకి రావడం కిటికీలోంచి చూశాడు. ఆమెను చూడగానే రమేష్‌కి భయం పుట్టుకొచ్చింది.

'తనమీద నాన్నకి చెప్పడానికి వచ్చింది. నాన్న అసలే కోపిష్టివాడు. కోపంవస్తే ఏం చేస్తాడో కూడా తెలీదు. ఇప్పుడేదో ప్రళయం జరగబోతోంది'

రమేష్ నరాల్లో వణుకు బయలుదేరింది.

అమృత చుట్టూ చూస్తూ దొడ్లోకి వెళ్ళింది. అక్కడ తులసికోట ఎదురుగా ఉంది సుశీలమ్మ.

"ఏమ్మా అమృతా?" అంటూ సుశీలమ్మ అమృతని పలకరించింది.

"మందారపువ్వు ఆంటీ" అంటూ పువ్వుని సుశీలమ్మకిచ్చింది.

"నాకెందుకమ్మా తెచ్చావు" ఆ పువ్వుని అందుకొని తులసిచెట్టు మొదట్లో ఉంచింది సుశీలమ్మ.

"మొన్న అడిగావుగా ఆంటీ. ఆ చెట్టు ఒక్కపువ్వే పూసింది" అని అటు ఇటు చూడసాగింది.

"ఆ ఒక్కటీ నాకు తెచ్చావు అవునా...". అమృత ఏదో వెతుకుతున్నట్టుగా అనిపించి "ఏమిటమ్మా చూస్తున్నావు?" అని అడిగింది.

"ఇంట్లో ఎవరూ లేరా? మీరొక్కరే ఉన్నారు"

"అబ్బాయి మిద్దెమీద ఉన్నాడు. అత్తగారు పొలం వెళ్ళారు" అని చెప్పి, "రామ్మా లోపల కూర్చుందాం" అని పిలిచింది.

"లేదాంటీ వెళ్ళాలి. నాన్నగారు నాకోసం మండపంలో ఎదురుచూస్తూ ఉంటారు" అని మరోమాట మాట్లాడకుండా బయటకి వచ్చేసింది.

వీధిలోకి వస్తూ వెనక్కి తిరిగి మిద్దెమీద ఉన్న ఇంటివైపు చూసింది. రమేష్ కనబడలేదు.

"ఊహూ..."

మరో రెండడుగులువేసి మళ్ళీ చూసింది.

తన ఆశ నిరాశే అయింది.

నీరసంగా వెళ్ళిపోయింది.

★ ★ ★

పరమేశ్వరశాస్త్రి వేణుగోపాలరావు

కొడుక్కి సంబంధించిన జాతకం రాసి ఆ కాగితం కవర్‌లో పెట్టి పోస్టు చేయడానికని పోస్టాఫీస్‌కి బయలుదేరాడు.

దారిలోనే పోస్ట్‌మేన్ ఎదురయ్యాడు.

“మీకు మనియార్డరు ఉందండి” అంటూ సైకిల్ దిగి పరమేశ్వరశాస్త్రికి మనియార్డరు ఫారం తీసి ఇచ్చాడు.

అది వేణుగోపాలరావు పంపింది. ఫారమ్‌మీద సంతకం చేసి పోస్ట్‌మాన్‌కి ఇచ్చాడు.

“లెటర్ కూడా ఉందండి” అని పోస్ట్‌మాన్ అయిదువందలతో పాటు మరో ఇన్‌లాండ్ లెటర్ ఇచ్చి వెళ్ళిపోయాడు.

పరమేశ్వరశాస్త్రి డబ్బు జేబులో పెట్టుకొని లెటర్ చించి చదివాడు. అది కుమారస్వామి రాసింది.

హైదరాబాద్‌లో దేవరాజు అనే కంట్రాక్టరు తన భవిష్యత్‌కి సంబంధించిన విషయాలు తెలుసుకోదలచి పరమేశ్వరశాస్త్రిని హైదరాబాదు పిలిపించమని కుమారస్వామికి చెప్పాడు. అందుకని కుమారస్వామి పరమేశ్వరశాస్త్రిని వీలైనంత త్వరలో హైదరాబాదు రమ్మని రాశాడు.

పరమేశ్వరశాస్త్రి ఆ ఉత్తరాన్ని చదివి, మడిచి జేబులో పెట్టుకొంటూ పోస్టాఫీస్‌కు వెళ్ళాడు. పోస్టు డబ్బాలో లెటరు పడేసి ఇంటికి వచ్చేసరికి వాళ్ళ ఇంటిముందు వీధిలో జనం గుంపుగా ఉన్నారు. ఆ గుంపులోంచి తెల్లటికారు కనబడింది.

‘ఎవరొచ్చారు కార్లో?’ అనుకుంటూ పరమేశ్వరశాస్త్రి వీధి గుమ్మంలోంచి లోపలికి అడుగుపెట్టాడు.

పంచలో కుమారస్వామి కూర్చుని ఉన్నాడు. అతని పక్కన మరో వ్యక్తి ఉన్నాడు. అతను కారు డ్రైవరు అని చెప్పకనే తెలుస్తోంది. పరమేశ్వరశాస్త్రిని చూస్తూనే కుమారస్వామి చిరునవ్వుతో లేచి నమస్కరించాడు.

“ఏమిటీ లెటరుతోపాటు మీరూ ఊడిపడ్డారు. ఇప్పుడే అందింది మీ లెటర్”

“అదే! ఆ లెటరు పనిమీదనే వచ్చాను. దేవరాజుగారు మిమ్మల్ని వెంటనే తీసుకొని రమ్మని కారిచ్చి పంపారు” అంటూ వచ్చిన పని చెప్పాడు కుమారస్వామి.

వర్ధనమ్మ కాఫీలు తెచ్చింది.

కుమారస్వామి ఆమె చేతిలోంచి కాఫీ గ్లాసు అందుకుంటూ, “మీరు రెడీ అయితే...” అన్నాడు పరమేశ్వరశాస్త్రిని ఉద్దేశించి.

“పోదాం... పోదాం... ముందు మీరు స్నానం అదీ చెయ్యండి. శుభ్రంగా భోంచేసి వెళదాం” అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

“ఆలస్యం అవుతుందేమో...” డ్రైవర్ కాస్త నసిగాడు.

“ఖచ్చితంగా ఒకటీ పదికి బయలుదేరుదాం... బాగుంటుంది” చెప్పాడు పరమేశ్వరశాస్త్రి.

“మీ ఇష్టం”

స్నానానికి వేడినీళ్ళు పెట్టి తొందరగా వంటచెయ్యమని భార్యకు చెప్పాడు పరమేశ్వరశాస్త్రి.

ఎవరో బంధువులు వచ్చారని తెలిసి అమృత అక్కడికి వచ్చింది.

పరమేశ్వరశాస్త్రి అమృతని కుమారస్వామికి చూపిస్తూ, “మావాళ్ళ అన్నయ్య కూతురు” అని చెప్పాడు.

“మేనకోడలన్నమాట”

కుమారస్వామి అంటూ ఉంటే, “కాబోయే కోడలు కూడాలెండి” అంది వర్ధనమ్మ.

ఆమె అలా అనడం పరమేశ్వరశాస్త్రికి నచ్చలేదు.

ఆ సమయంలో వర్ధనమ్మకి అడ్డుచెప్పడం తెలివితక్కువతనమే అవుతుంది. అనవసరంగా వాగ్వివాదం జరిగి వాతావరణం వేడెక్కే ప్రమాదం ఉంది. అందుకని పరమేశ్వరశాస్త్రి మాటలు మారుస్తూ, “ఇప్పుడే వేణుగోపాలరావుకి లెటర్ పోస్ట్ చేశాను” అన్నాడు.

"డబ్బులు పంపించానన్నాడు. పంపించాడా"

"ఆ... పంపించాడు. అయిదువందలు మనియార్డర్ చేశాడు. అదీ ఇప్పుడే అందింది"

ఇద్దరూ మాట్లాడుకొంటుంటే వర్ధనమ్మ స్నానానికి నీళ్ళు పెట్టానని చెప్పింది.

కుమారస్వామి, కారు డ్రైవరు స్నానానికి లేచారు. పరమేశ్వరశాస్త్రి బట్టలు సర్దుకుంటున్నాడు.

వర్ధనమ్మ వంటపనిలో మునిగిపోయింది. అమృత ఆమెకి సహాయపడుతోంది.

ఇంట్లో అమృత అటూ, ఇటూ తిరుగుతూ ఉంటే చంద్రశేఖర్ కళ్ళు ఆమెనే వెంటాడుతున్నాయి.

అమృత కళ్ళూ, ముక్కూ, పెదాలు చూస్తూ ఉంటే అతనిని ఏదో మత్తు ఆవహించింది. ఒంటరిగా దొరికితే దగ్గరకు లాక్కొని గట్టిగా కౌగలించుకుని ముద్దాడాలని ఉంది.

పరమేశ్వరశాస్త్రి బట్టలు సర్దుకోవడం పూర్తిచేసి "నే వెళ్ళి మీ అన్నయ్యకి చెప్పి వస్తా" అన్నాడు వర్ధనమ్మ దగ్గరికి వచ్చి..

"త్వరగా వచ్చెయ్యండి" అంది వర్ధనమ్మ.

పరమేశ్వరశాస్త్రి శివరామశాస్త్రిగారి ఇంటికి వెళ్ళి తన హైదరాబాద్ ప్రయాణం గురించి చెప్పి వచ్చాడు.

భోజనాల అనంతరం సరిగ్గా ఒంటిగంటా పది నిముషాలకు వెళ్ళి కార్లో కూర్చున్నాడు పరమేశ్వరశాస్త్రి. తండ్రితోపాటు చంద్రశేఖర్‌కి హైదరాబాద్ పోవాలనిపించింది. కానీ అమృతని వదిలి వెళ్ళాలంటే మనసు అంగీకరించడంలేదు.

కారు కదిలి వెళ్ళిపోగానే చంద్రశేఖర్ వెనక్కు తిరుగుతున్నట్టుగా అమృత భుజం తాకాడు కావాలనే.

ఆ చర్య అమృతకి అసహ్యంగా తోచింది. ఇంక ఆమెకి అక్కడ ఉండబుద్ధి కాలేదు.

"నే వెళ్తున్నా అత్తయ్యా" అంటూ వర్ధనమ్మ భోజనం చేసి పొమ్మన్నా వినకుండా వెళ్ళిపోయింది.

చంద్రశేఖర్‌ని అసహనం ఆవహించింది. విసవిసా వెళ్తున్న అమృతకి వీధిమలుపు దగ్గర రమేష్ ఎదురయ్యాడు.

ఒకరికొకరు అలా ఎదురుపడడంతో ఇద్దరూ క్షణకాలం ఆగిపోయారు. ఇద్దరి గుండెలూ వేగంగా కొట్టుకోసాగాయి.

రమేష్ తేరుకొని మౌనంగా వెళ్లిపోసాగాడు.

అమృత అతనిని పలకరించాలనుకుంది. ధైర్యం చాలలేదు. వెనక్కి తిరిగి చూస్తాడేమోనని అతణ్ణే చూడసాగింది. కానీ రమేష్ వెనక్కి తిరగనేలేదు.

అమృత హృదయం విలవిల లాడింది.



అమృతతో బంధం పెంచుకొంటోంది చంద్రశేఖర్ మనసు. ఆమెను గురించే అతని ఆలోచనలు.

అమృత ఓ సౌందర్యదేవత. మంచి కళాకారిణి. అమ్మకి ఆమె అంటే ఎక్కడలేని ఇష్టం. చిన్నతనం నుండీ అమృతని మేనకోడలుగా కాక సొంత కోడలుగానే చెప్పుకొనేది.

నాన్నకి మాధవి అంటే ఇష్టం. అందుకనే తనని చదువునెపంతో కాకినాడలో వదిలేశాడు. రాజేశ్వరి అత్తయ్యకు కూడా తనను అల్లుడిగా చేసుకోవాలని ఉంది. కనుకనే కాకినాడలో ఏలోటూ రాకుండా చూసుకొంది. మాధవికి కూడా ఇష్టమే.

కానీ అమ్మ మాటకు నాన్న ఎదురు చెప్పడు. అమృతతో తన పెళ్లి ఖాయం.

అప్పుడు అమృత తన భార్య అవుతుంది. ఆమెతో దాంపత్య జీవితాన్ని ఊహించుకొంటుంటే చంద్రశేఖర్‌లో ఏదో మత్తు, అనిర్వచనీయమైన శారీరక పులకింత.

ఆమెను చూడాలనే కోరిక కల్గింది.

ఎలా?

ఆలయంలో నాట్యం నేర్చుకుంటూ ఉంటుంది. ఎదురుగా వాళ్ల నాన్నగారుంటారు. గంభీరంగా కనిపించే ఆయనతో మాట్లాడాలంటేనే భయం. పైగా మితభాషి.

అసహనంగా తిరగసాగాడు.

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలయింది.

పరమేశ్వరశాస్త్రి కార్లోంచి దిగాడు.

ఎదురుగా మూడంతస్తుల బంగళా. ఓ నౌకరు గబగబావచ్చి పరమేశ్వరశాస్త్రి చేతిలోంచి సూట్‌కేస్ అందుకొన్నాడు.

"సార్ లేరా" అని అడిగాడు కుమారస్వామి.

"ఇంటికి వెళ్లారు. మీరు రాగానే ఫోన్ చెయ్యమన్నారు" అని చెప్పి వాళ్లను బంగళాలోనికి తీసుకొని పోయాడు.

లోపలికి వెళ్లగానే మయసభ గుర్తుకువచ్చింది. తెల్లటి పాలరాతి ఫ్లోరింగ్ మీద నడుస్తుంటే ఆయనకి ఎక్కడ జారిపడతానోనని భయం కలిగింది.

నౌకరు వాళ్లను ఒక సూట్‌లోకి తీసుకుపోయాడు.

అందులోకి అడుగుపెట్టగానే పరమేశ్వరశాస్త్రికీ, కుమారస్వామికీ చల్లగా అనిపించింది ఎత్తయిన మెత్తటి పరుపులున్న మంచాలు, సోఫా, కుర్చీలు, ఫోను, టీవీ ముచ్చటగా అమర్చి ఉన్నాయి. గదిని ఆనుకొని లెట్రిన్, బాత్రూమ్ అన్ని వసతులూ ఉన్నాయి.

నౌకరు సూట్‌కేసు లోపలపెట్టి పరమేశ్వరశాస్త్రిగారు వచ్చినట్టు దేవరాజుగారితో అక్కడే ఉన్న ఫోన్‌లో చెప్పాడు.

"సార్ వెంటనే బయలుదేరి వస్తానన్నాడు సార్! ఈలోగా మీరు స్నానం చెయ్యండి. వేడినీళ్లు రెడీ చేస్తాను" అంటూ నౌకరు బాత్రూమ్‌లోకివెళ్లి హీటర్ ఆన్ చేశాడు.

పది నిముషాల్లో పరమేశ్వరశాస్త్రి స్నానం ముగించుకొని వచ్చాడు.

"మీరూ చెయ్యండి" అన్నాడు కుమారస్వామిని ఉద్దేశించి.

"నేను ఇంటికి వెళ్లాను గదా" అన్నాడు కుమారస్వామి.

బయట కారు ఆగిన శబ్దం విని "సార్ వచ్చారు" అంటూ నౌకరు గది బయటకు వెళ్లాడు.

"నమస్తే" అంటూ గదిలోకి వచ్చిన దేవరాజుకి నమస్కారం చేస్తూ అతణ్ణి చూసి పరమేశ్వరశాస్త్రి ఆశ్చర్యపోయాడు.

దేవరాజుగారంటే డెబ్బై, ఎనభై ఏళ్ల వయసు వాడనుకొన్నాడు. తెల్లటి హాఫ్ చేతుల షర్టు, నల్లటి ప్యాంటు సింపుల్‌గా ఉన్నాడు. నలభైకి ఒకటి రెండు తక్కువగానే ఉంటుంది అతని వయసు.

తనను తాను పరిచయం చేసుకొంటూ సోఫాలో కూర్చున్నాడు దేవరాజు. పరమేశ్వరశాస్త్రి నడి మంచం మీద బాసింపీట వేసుకొన్నాడు.

"నాకు జ్యోతిష్యాల మీద, జాతకాలమీద నమ్మకంలేదు. అయినా మీ గురించి విన్న తరువాత ఒకసారి మిమ్మల్ని సంప్రదిస్తే బాగుంటుందనిపించింది. అందుకే పిలిపించాను" అన్నాడు దేవరాజు.

"మీకు నమ్మకం ఉన్నా లేకున్నా మనిషి జీవితం ఎప్పుడూ జాతకం మీదనే నడు

స్తుంది అక్షరం గూడా పొల్లుపోదు. అది మాత్రం వాస్తవం. మరి నమ్మడం, నమ్మకపోవడం అనేది వ్యక్తిగతం" చెప్పాడు పరమేశ్వరశాస్త్రి.

"నేనింతవరకూ బయటి కాంట్రాక్టులే చేశాను. నాకు స్వంతంగా ఆదాయం వచ్చే ఏ పనీ చేయలేకపోయాను. పదిపదిహేను కోట్ల పెట్టుబడితో పెద్ద ఇండస్ట్రీ ఓపన్ చెయ్యాలని స్థలం కొన్నాను. ఇంజనీర్ల చేత దానికి సంబంధించిన ప్లాన్ కూడా రెడీ చేయించాను. ఇంక నేరుగా పనిలోకి దిగడమే ఆలస్యం. రేపు ఉదయం మీకా సైటు చూపిస్తాను. చూసిన తరువాత భవిష్యత్తు ఎలా ఉంటుందో చెప్పండి" అన్నాడు దేవరాజు.

పరమేశ్వరశాస్త్రి దేవరాజుని అడిగి అతని డేటాఫ్ బర్త్‌కి సంబంధించిన విషయాలు తెలుసుకొన్నాడు.

నౌకరు భోజనం తెచ్చాడు.

"మీరు భోజనం చేసి పడుకోండి. రేపు ఉదయం కలుస్తాను" అని లేచాడు దేవరాజు.

"నేను వెళ్లొస్తాను" కుమారస్వామి లేచాడు.

"ఏం మీరుండరా" అని అడిగాడు దేవరాజు.

"రేపు వస్తాను"

"మీకూ భోజనం తెచ్చాను" అన్నాడు నౌకరు.

"భోజనం చేసి వెళ్లండి. డ్రైవర్‌కి చెప్తాను. కార్లో డ్రాప్ చేస్తాడు" అని చెప్పాడు దేవరాజు.

కుమారస్వామి మౌనంగా ఉండిపోయాడు.

"నేను రేపు ఉదయం కలుస్తాను. మీకు తోడుగా ఇక్కడ నౌకరు ఉంటాడు" దేవరాజు చెప్పి వెళ్లిపోయాడు.

నౌకరు భోజనాలు అరేంజి చేశాడు.

కుమారస్వామి కాళ్లూచేతులూ కడుక్కొని వచ్చి పరమేశ్వరశాస్త్రితో భోజనానికి కూర్చున్నాడు.

"నా గురించి మీరు చాలా శ్రమ తీసుకొంటున్నారు" అన్నాడు పరమేశ్వరశాస్త్రి కుమారస్వామితో.

"ఇందులో శ్రమ ఏమీ లేదు సార్! మీలో దైవత్వం ఉంది. అది నన్ను మీకు దగ్గరగా చేరుస్తోంది"

"కానీ ఇద్దరిమధ్యా వందలమైళ్ల దూరం వుంది"

"అప్పుడప్పుడూ కలుసుకొనే భాగ్యం కలిగించండి"

"ఇప్పుడిలా కలుసుకోవడం నువ్వు కలిగించిన భాగ్యమేగా"

"నాదేముందండీ! అంతా మీలో ఉన్న ఆ విద్య గొప్పతనం"

భోజనం చెయ్యగానే కుమారస్వామి పరమేశ్వరశాస్త్రి దగ్గర సెలవు తీసుకొని బయటకొచ్చాడు.

కారు సిద్ధంగా ఉంది. వెళ్లి అందులో కూర్చున్నాడు. డ్రైవర్ స్టార్ట్ చేశాడు.

పరమేశ్వరశాస్త్రి దేవరాజు డేటాఫ్‌బర్త్‌కి సంబంధించిన పంచాంగం తెరిచాడు. అతని జాతక చక్రం తయారుచేసి విషయ పరిశీలనలో రెండు గంటలు గడిపి తర్వాత నిద్రపోయాడు.

తెల్లవారి కుమారస్వామి రాకతో మేల్కొన్నాడు.

పరమేశ్వరశాస్త్రి కాలకృత్యాలు ముగించుకొని వచ్చేసరికి నౌకరు టిఫిన్ తెచ్చిపెట్టాడు.

ఇద్దరూ తిన్నాక కప్పుల్లోకి కాఫీ వంచి ఇచ్చాడు నౌకరు.

ఎనిమిది గంటలవుతుండగా రెండు కార్లొచ్చి ఆగాయి. వాటిలోంచి ఎనిమిది మంది దిగి బంగళాలోకి వచ్చారు. వాళ్లల్లో దేవరాజుగారు, అతని స్నేహితులు, ఇద్దరు ఇంజనీర్లు, ఇద్దరు పురోహితులు ఉన్నారు.

వాళ్లలో నామాలు తీర్చిన పురోహితులు

చెంగావి పట్టుపంచెలు కట్టి బొజ్జలు కనబడ కుండా శాలువాలు కప్పుకొని ప్రత్యేకంగా కనబడుతున్నారు.

దేవరాజుగారు ఏ పని ప్రారంభించినా ఆ పురోహితులే ముహూర్తం నిర్ణయించేది. వాళ్లిద్దరూ వెళ్లి పరమేశ్వరశాస్త్రిని కలిసి ఒకరు సుబ్బావధానిగా, రెండో అతను పేరి శాస్త్రిగా పరిచయం చేసుకొన్నారు. తరువాత బయటకు వచ్చి ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

మనకన్నా పెద్ద పండితుడా ఏమి అన్న భావన వాళ్ల మొహాల్లో కనబడింది.

అందరూ వచ్చి కార్లల్లో కూర్చున్నారు. సిటీ దాటిన అరగంట తర్వాత దిగారు.

అక్కడ బుల్డోజర్‌లతో నేలను చదును చేస్తున్నారు.

దాదాపు రెండు గంటలసేపు పరమేశ్వర శాస్త్రిని దేవరాజు తన వెంట ఆ ప్రాంత మంతా తిప్పాడు.

ఫ్యాక్టరీ ప్లాను ప్రకారం నేలలో మేకులు బాది ఉన్నాయి. కట్టుబడికని ఇసుక, రాళ్ల గుట్టలు గుట్టలుగా తోలి ఉన్నాయి.

"ఇదీ సైటు. మీ అభిప్రాయం చెప్పండి" అన్నాడు దేవరాజు పరమేశ్వరశాస్త్రితో.

పరమేశ్వరశాస్త్రి తల వూపాడు. మౌనంగా నడిచి కారు దగ్గరకు వచ్చి ఆగాడు.

"బంగళాకి వెళదాం" అన్నాడు.

"అలాగే" అన్నాడు దేవరాజు.

బంగళాకి వచ్చి అందరూ పరమేశ్వరశాస్త్రి గారితో సమావేశమైనారు.

"దాదాపు ఆరు నెలలుగా మీరు పైసా సంపాదనలేకుండా ఉన్నారు. అవునా" అని అడిగాడు పరమేశ్వరశాస్త్రి దేవరాజుని.

"ఇదుగో ఈ ఫ్యాక్టరీ ఆలోచనలో పడి ఏ కాంట్రాక్టు తీసుకోలేదు" అని చెప్పాడు దేవ రాజు.

"ఇంకో ఆరు నెలలు ఈ ఫ్యాక్టరీ జోలికి వెళ్లవద్దు"

దేవరాజుగారి కనుబొమలు ముడిప డ్డాయి. వెంటనే తేరుకొన్నాడు. పరమేశ్వర శాస్త్రిమీద అతనికి నమ్మకం పోయింది. దేవ రాజు ఏదో అనబోతుంటే,

"మీకు జ్యోతిష్యం మీద, జాతకాలమీద నమ్మకాలు లేకపోవచ్చు కానీ మీరు నాకి చ్చిన డేటాఫ్‌బర్త్ ఖచ్చితమైనదైతే మీరు చేసే ప్రయత్నం ప్రస్తుతానికి ప్రయత్నంగానే మిగిలిపోయే ప్రమాదం ఉంది. అదీ ఆరు నెలల వరకు" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

సుబ్బావధానికి, పేరిశాస్త్రికి పరమేశ్వరశాస్త్రి మాటలు కోపం తెప్పించాయి. ఒకరి మొహం ఒకరు చూసుకొని ఇద్దరూ లేచి బయటకు వచ్చారు.

"శుభం పలకరా పెళ్లికొడకా అంటే పెళ్లి కూతురు ముండ అన్నాట్ట ఎవడో" అన్నాడు పేరిశాస్త్రి.

"వాడూ ఇట్లాంటివాడే అయివుంటాడు. తగుదునమ్మా అంటూ వచ్చి తలకొరివి పెట్టాడు" మెటికలు విరిచాడు సుబ్బావ ధాని.

"అంతా డబ్బుకోసం తిప్పలు"

"మన నోళ్లు కొట్టడానికి వచ్చాడు"

"దేవరాజుగారు తెలివితక్కువ వాడా ఏం, ఈయన గారి మాటల్లో పడిపోవడానికి. ఇంతవరకూ మనం పెట్టిన ముహూర్తాల్లో ఎప్పుడూ విఘ్నం జరగలేదు"

"ఇకమీద జరగదు"

దేవరాజుగారు తన మిత్రులతో కలిసి ఆ విషయమై మాట్లాడు కొంటున్నారు. పరమే శ్వరశాస్త్రి తన గదిలోకి వెళ్లిపోయాడు. పురోహితులిద్దరూ ఆయన వెంట వెళ్లారు.

"దేవరాజుగారికి అలా చెప్పడంలో మీ ఉద్దేశం ఏమిటి" అని అడిగాడు పేరిశాస్త్రి.

"నాకు ఒక ఉద్దేశమంటూ లేదు. యదార్థం చెప్పాను. అంతే" అన్నాడు పర మేశ్వరశాస్త్రి.

"ఏమిటి యదార్థం భయపెట్టడమా" సుబ్బావధాని కాస్తకోపం ప్రదర్శించాడు.

"ఆయన్ని భయపెట్టవలసిన అవసరం

# ఏరినముత్యాలు

★ బుద్ధిని జయించినవాడే సర్వోత్కృష్టుడైన బలవంతుడు.

–చైతన్య

★ గాయాలు మాని మచ్చలు పడతాయి. మచ్చలు మనతోపాటు పెరుగుతాయి.

–జె.రెక్

★ దారి తెలియక తప్పుదారి పట్టడంకంటె వచ్చిన దారినే వెనక్కు వెళ్లడం మంచిది.

–ఒకసామెత

★ ఇంటి శత్రువు ఒక్కరికంటె బయటి శత్రువులు వందమంది నయం.

–అరబ్బీ సామెత

★ అవసరం ముందు అన్ని ఆదర్శాలూ దుమ్ముకొట్టుకుపోతాయి.

–నషే

★ తెలివితక్కువకంటె అజాగ్రత్త ఎక్కువ హానికరం.

–ఫ్రాంక్లిన్

★ ఇతరుల దురదృష్టంలో నీ సంతోషాన్ని వెతుక్కోవద్దు.

–సైరస్

★ ఒంటరిగా నిలబడే వ్యక్తియే ప్రపంచంలో అందరికన్నా బలవంతుడు.

– హెచ్.ఇబ్సన్

★ సంతోషదాయకం కాని ప్రతి సంఘటన భగవంతునిలో మీ విశ్వాసానికి పరీక్ష వంటిది.

–స్వామి శివానంద

★ ప్రతి ఒక్కరినీ నమ్మడం ఎంత పొరపాటో ఏ ఒక్కరినీ నమ్మకపోవడమూ అంతే.

–బట్లర్

★ తిన్న ఆహారం జీర్ణం చేసుకున్నట్లే చదివినదీ తెలుసుకున్నదీ జీర్ణం చేసుకుంటేనే దాని ప్రయోజనం.

–ట్రయాన్

★ ముట్టే డబ్బుకోసం పనిచేసేవారికి అంతకి అంతే తప్ప ఇంకేమీ ముట్టదు.

–ఎబ్బర్ట్

★ శీల సంపద వుండి జ్ఞానం లోపించినవాడు కడు బలహీనుడు. గుణవంతుడు కాని జ్ఞాని ప్రమాదభరితుడు.

–శామ్యూల్ జాన్సన్

★ ఇతరుల హృదయాలను ఆకట్టుకునేందుకు ప్రతిభా సామర్థ్యాలను ప్రదర్శించాల్సి వుంటుంది.

–స్వార్ గ్

★ అతి బలహీన కాలంలోనే మన అసలు బలం నిగ్గుతేలుతుంది.

– హెచ్.కోరిందియన్స్

సేకరణ గురువిందపల్లి కృష్ణమోహన్

నాకేం వచ్చింది"

"కాస్త ఎక్కువ మోతాదులో సొమ్ము చేసుకోవచ్చు"

పరమేశ్వరశాస్త్రికి కోపం వచ్చింది.

"మీరు అనవసరంగా మాట్లాడుతున్నారు" అన్నాడు.

పేరిశాస్త్రి ఏదో మాట్లాడబోతుంటే "దయచేసి మీరు మాట్లాడవద్దు" అని సుబ్బావధాని నోరు మెదపబోతుంటే 'మాట్లాడవద్దు' అన్నట్లు చెయ్యి వూపుతూ వారించాడు పరమేశ్వరశాస్త్రి.

కుమారస్వామి లోపలికి వచ్చాడు.

"మరి నేను బయలుదేరతా" అన్నాడు పరమేశ్వరశాస్త్రి అతనితో.

"ఒకసారి మా ఇంటిదాకా రండి" అన్నాడు కుమారస్వామి.

"అలాగే"

కుమారస్వామి వెళ్లి పరమేశ్వరశాస్త్రి ప్రయాణమవుతున్నాడని చెప్పాడు దేవరాజుగారికి. దేవరాజుగారు లేచి పరమేశ్వరశాస్త్రి దగ్గరకు వచ్చి అతనికి కొంత డబ్బు ఇచ్చాడు.

"నేను విషయం దాచకుండా చెప్పాను. మీకు కష్టం కల్గించవచ్చు. నా మాట మీద నమ్మకం ఉంచగలిగితే మంచిదే. లేకుంటే మీ ఇష్టం"

"భోజనం చేసి బయలుదేరండి"

నౌకరు కారియర్ తెచ్చాడు.

దేవరాజుగారు కార్లో వెళ్లమని చెప్పాడు. కానీ పరమేశ్వరశాస్త్రి అందుకు ఇష్టపడలేదు. కుమారస్వామి ఇంటిదాకా కార్లో వచ్చి ఆ కారుని వెనక్కి పంపించేశాడు.

పరమేశ్వరశాస్త్రి రావడం కుమారస్వామి భార్యకు సంతోషం అయ్యింది. నట్టింట్లో కుర్చీ వేసింది. పరమేశ్వరశాస్త్రి అందులో కూర్చుని "దేవరాజుగారికి నా మాటలు రుచించవు" అన్నాడు కుమారస్వామితో.

"అవును మీరేమిటి అంత ఖచ్చితంగా కుండబద్దలుకొట్టినట్టు చెప్పారు"

"యదార్థం చెప్పాను అంతే. అయినా దేవరాజుగారు పని ఆపడు. అదే ఆగిపోతుంది. నువ్వే చూస్తావు కళ్లారా" అన్నాడు పరమేశ్వరశాస్త్రి

కుమారస్వామికి అంతా అయోమయంగా వుంది.

పరమేశ్వరశాస్త్రి ఆ రాత్రికి బస్సులో బయలుదేరి తెల్లవారేసరికి అగ్రహారంలో దిగాడు.

★ ★ ★

వీధిలో తప్పెట మోత వినబడుతుంటే ఏమిటా అని వీధి గుమ్మంలోకి వచ్చింది సుశీలమ్మ.

"చింతలమ్మ తోపులో ఉన్న చింతలమ్మ అమ్మవారికి పొంగళ్లు పొంగించడానికి పెద్దలు నిర్ణయించినారు. గావున అందరూ అమ్మవారికి నైవేద్యాలు సమర్పించి మొక్కులు తీర్చుకోవలసిందొహో" అంటూ చాటింపు వేస్తున్నారు.

చింతలమ్మ అమ్మవారంటే ఆ వూర్లోనేకాక చుట్టుపక్కల గ్రామాల్లోగూడా మంచి మహాత్యం ఉన్న గ్రామ దేవతగా పేరుంది. కోరుకొన్న కోరికలను తీర్చేతల్లి అని నమ్మకం.

ఆ తిరునాళ్లకు మాత్రమే అమ్మవారికి కంఠాభరణం, ముక్కుపుడక, కిరీటం వంటి ఆభరణాలు అలంకరిస్తారు. మిగతా రోజుల్లో వాటిని రంగారావుగారి ఇంట్లో దాచిపెట్టే ఆచారం ఎంత కాలంనుండో వుంది. పొంగళ్ల రోజు ఆ ఇంటి యజమాని మేళతాళాలతో ఆ ఆభరణాలు మోసుకొని పోయి అమ్మవారికి సమర్పిస్తారు.

సుశీలమ్మకు చింతలమ్మ పొంగళ్ల చాటింపు వినగానే మృదుల గుర్తుకువచ్చి దుఃఖం ముంచుకొచ్చింది.

"ఏడవకే ఆ పాపంలో నాకూ భాగం వుంది" లక్ష్మీదేవమ్మ బాధపడుతూ ఓదార్చ సాగింది సుశీలమ్మను.

"ఇప్పుడెంత పశ్చాత్తాప పడితే ఏం లాభం

అత్తయ్యా. నా బిడ్డ నాకు తిరిగి వస్తుందా" మొహానికి పైటకొంగు అడ్డుపెట్టుకుని భోరున ఏడ్చేసింది.

ఆ స్థితిలో సుశీలమ్మను చూసిన లక్ష్మీదేవమ్మ కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

అందగాడు, ఆస్తిపరుడు అయిన రంగారావుతో పెళ్లి అనేసరికి సుశీలమ్మకి తన దాంపత్య జీవితం ఆనందంగానే తోచింది. కానీ అతనితో పెళ్లయి గడిపిన మొదటి మూడు రోజులలోనే తెలిసిపోయింది తన సాంసారిక జీవితం నరకంలో చిక్కిపోయిందని.

రంగారావులో వెతికి చూద్దామన్నా మానవత్వం కనబడదు. శాడిజం అతని రక్తంలో జీర్ణించుకుపోయి ఉంది. ప్రేమ, జాలి అనే వాటికి అతనిలో స్థానంలేదు. పరమకోపం, పంతం అతనికి నేస్తాలు.

అయినా అతనితోనే కాపురం చేసి ఇద్దరు పిల్లలకి తల్లి అయ్యింది. మొదటి సంతానం మృదుల. రెండవ సంతానం రమేష్. వాళ్లిద్దరూ ఆమెకి రెండు కళ్లు. లక్ష్మీదేవమ్మకి మనవడూ, మనవరాలూ అంటే ప్రాణం. వాళ్లకి ఏలోటూ రాకుండా పెంచింది. ఆ విషయంలో అత్తగారంటే సుశీలమ్మకి కాస్త గౌరవం. అయినా లక్ష్మీదేవమ్మ సుశీలమ్మని ఎక్కిరానిచ్చేది కాదు. కొడుకు వైపే వత్తాసు పలికేది.

ఆమె కూతురు పార్వతి. రంగారావు కన్నా పెద్దది. పెళ్లయి కాపురానికి వెళ్లి పద్దెనిమిది సంవత్సరాలు దాటింది. ఆమె కొడుకు రఘురాం, కూతురు స్వాతి. రఘురాంకి మృదులనిచ్చి పెళ్లి చెయ్యాలని లక్ష్మీదేవమ్మ ఉద్దేశం. ఆ విషయంలో మృదుల విభేదించింది. నాయనమ్మ మనవరాలికి ఎన్నో ఆశలు కల్పించింది. ఎంతగానో నచ్చచెప్పింది. కానీ మృదుల తను రఘురాంని పెళ్లి చేసుకోనని మొండికేసింది.

ఆమె మొండితనం రంగారావుకి కోపం తెప్పించింది. పంతంతో పురోహితుణ్ణి పిలిపించి పెళ్లి ముహూర్తం పెట్టించాడు.

"నువ్వు ముహూర్తం పెట్టించినాసరే నేనీ పెళ్ళిచేసుకోను" అని ఖరాఖండీగా చెప్పింది మృదుల.

"నువ్వు చేసుకోనన్నా నేను చేసి తీరుతాను" అన్నాడు రంగారావు కోపంగా.

"అదే జరిగితే నేను బావిలో దూకి చస్తాను"

"నువ్వు చచ్చినాసరే పెళ్లి ఆగదు" రంగారావు మరో మాటకు అవకాశం ఇవ్వకుండా వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి తెల్లవారింది.

చింతలమ్మ పొంగళ్ళంటూ చాటింపు వేస్తున్న దలారి కోటేసు రంగారావుగారి యింటివైపు జనం పరిగెడుతూ ఉంటే తనూ అటువెళ్ళాడు.

రంగారావుగారి ఇంటి దొడ్లో ఉన్న బావి చుట్టూ జనం మూగి ఉన్నారు. సుశీలమ్మ శోకాలు తీస్తూ ఉంది. బావిలోంచి మృదుల శవాన్ని తీసి పడుకోబెట్టారు. ఆ శవంమీద పడి నెత్తీ, నోరూ బాదుకొంటూ రోదిస్తూ పూనకం వచ్చిన దానిలా లేచింది.

"ఒరేయ్... నా కూతుర్ని పొట్టన పెట్టుకొన్నావు గదరా" అంటూ పోయి రంగారావు గొంతుని రెండు చేతులతో వడిసి పట్టుకొని పిసకబోయింది. ఆ కోపంలో ఆమె ఏమైనా చెయ్యగలదని పక్కనున్న వాళ్ళు రంగారావుని విడిపించుకొని లాక్కుపోయారు. సుశీలమ్మ శోకంతో కూలిపోయింది.

ఆ శోకదేవతను చూసి చలించిపోయింది స్వాతి.

'పాపం అత్తయ్య' అనుకొంటూ అమ్మమ్మ మీద ఆగ్రహంతో ఊగిపోయింది.

"కడుపుకి కూడు తినగానే సరిపోదు. సాటిమనిషిని అర్థంచేసుకోవాలి. నీ స్వార్థానికి చెట్టంత మనిషిని ఖలితీసుకొన్నావు. పాపం అత్తయ్య కడుపులో చిచ్చు పెట్టావు.

అసలు నువ్వూ, నీ కూతురూ, నీ కొడుకూ మీ ముగ్గురే ఈ కొంపకు పట్టిన అరిష్టాలు. మీరు చచ్చినా పీడ వదిలిపోయేది..." అని అరుస్తూ ఉంటే లక్ష్మీదేవమ్మకి దుఃఖం పొంగిపొంగి వచ్చింది. తన తప్పును తెలుసుకొన్నది.

"తప్పంతా నాదేనమ్మా. నేనిట్లా అవుతుంది అని అనుకోలేదు తల్లీ" అని స్వాతిని పట్టుకొని ఏడ్చేసింది. స్వాతి శాంతించి సుశీలమ్మని ఓదార్చింది.

అది మొదలు సుశీలమ్మకి, రంగారావుకి మధ్య మాటలు లేవు. లక్ష్మీదేవమ్మలో స్త్రీ హృదయం నిద్రలేచింది. మృదుల మరణానికి తనే కారణమని పశ్చాత్తాపంతో కృంగిపోయింది. సుశీలమ్మపట్ల అభిమానం పెంచుకొంటూ ఆమెకి సన్నిహితంగా ఉండసాగింది.

ఆ సంఘటనతో ఆ యింట్లో పార్వతి పెత్తనం కొండెక్కింది.

అది జరిగి సరిగ్గా రెండు సంవత్సరాలు అయ్యింది.

చింతలమ్మ తిరునాళ్ళకు నియమించిన పనివాళ్ళు మేళతాళాలతో తప్పెట్లు మోగించుకొంటూ రంగారావుగారి ఇంటికి వచ్చారు.

రంగారావుని ఇంటిముందు స్టూలు మీద కూర్చోబెట్టి తలంటి స్నానంచేయించారు. రెండు చెంగులు వచ్చేట్లుగా పంచ కట్టారు. కుచ్చు కిరీటంలా తలగుడ్డ చుట్టి తెల్లటి పొడవాటి పైపంచ మెడచుట్టూ చుట్టి ఒక చెంగు వీపుమీదికి మరోచెంగు ముందుకీ వేశారు. పసుపుతో కలిపిన ఎరువు కుంకుమను నుదుటమీద బొట్టుగా పెట్టారు.

అప్పుడు రంగారావు లేచి పంచలో అమ్మవారి ఆభరణాలు ఉంచిన ఇత్తడి పళ్ళాన్ని చేతుల్లోకి తీసుకొన్నాడు. తప్పెట్లు, మేళాలు, సన్నాయి, కొమ్ములు లయబద్ధంగా వాయించడం ప్రారంభించారు. కొందరు పూనకంతో ఊగుతున్నారు. వాళ్ళమధ్యలో యిద్దరు వ్యక్తులు బొల్లావులతో నృత్యం చెయ్యసాగారు. సుమారు రెండున్నర అడుగులు ఎత్తున్నాయి ఆ బొల్లావులు. వాటి తొడలమీద ఆంజనేయ, గరుత్మంతుల డొక్కలకు సింహ తలాటాలు, వీపున నాగబంధం, మూపురానికి రెండు వైపులా శంఖు చక్రాలు, నొసట గంగ, నెత్తిన ఒంటి కొమ్ము ఉన్న ఆ బొల్లావులను నెత్తిన పెట్టుకొని ఆ యిద్దరు వ్యక్తులు చేస్తున్న నృత్యావిన్యాసాలు బాగా ఆకర్షించాయి. వాళ్ళ వెనక రంగారావు చింతలమ్మ గుడికి ఊరేగింపుగా బయలుదేరాడు.

వీధిలో ఆ సందడి విని చంద్రశేఖర్ ఇంట్లోంచి బయటికి వచ్చాడు. ఆ ఊరేగింపులో తనూ కలిసి గుడిదగ్గరికి వెళ్ళాడు.

అప్పుడప్పుడే గుడిదగ్గరికి భక్తులు చేరుతున్నారు. తల స్నానాలు చేసి వచ్చి చింతలమ్మకి మొక్కులు తీర్చుకొంటున్నారు. వడపప్పూ, పానకాలు పంచేవారు, పసుపు, కుంకుమలు పంచేవాళ్ళు, పూలూ, పళ్ళూ పంచేవారు. బెల్లం బొరుగులు పంచేవారు. సందడి సందడిగా ఉంది. అందరి నుదుటా పసుపు కుంకుమ కలిపిన బొట్టు చింతలమ్మపట్ల ఉన్న భక్తిని తెలుపుతోంది. భజన బృందాల గానాలు, కోలన్నల కోలాహలు గుంపులు గుంపులుగా జనం.

ఆ జనంలో అమృత కనబడుతుందేమోనని చంద్రశేఖర్ కళ్ళు వెతుకుతున్నాయి.

★ ★ ★

చీకటి పడింది.

చింతలమ్మ సన్నిధి తిరునాళ్ళ జనంతో గోలగోలగా ఉంది.

అమృత రమేష్‌కోసం తిరగసాగింది. పండరీభజన దగ్గర చంద్రశేఖర్ కనబడ్డాడు. అతనికి కనబడకుండా ఉండాలని జనంలో తప్పుకొని తిరుగుతూ ఒకచోట ఆగింది. అక్కడ రమేష్ భజన చూస్తూ నిలబడి ఉన్నాడు. అమృతని చూడలేదు. అతన్ని చూసిన అమృత క్షణం ఖంగుతి



న్నది. తేరుకొన్న తరువాత రమేష్‌కి దగ్గ రగా జరిగి నిలబడింది.

రమేష్ భజన చూడడంలో లీనమై ఉన్నాడు. రెండో కంటికి కనబడకుండా అమృత రమేష్ చేతిని మెల్లగా గిల్లింది. తల తిప్పిన రమేష్‌కి అమృత మొహం విద్యుద్దీపాల వెలుగులో మెరిసింది.



రమేష్‌కి షాక్ తగిలినట్టయ్యింది. జనం లోంచి బయటకి వచ్చి దూరంగా వెళ్ళిపోసాగాడు. అమృత అతన్నే చూస్తూ ఉండిపోయింది.

రమేష్ దూరంగా వెళ్ళిపోతున్నాడు. మసకమసకగా కనిపిస్తున్నాడు ఆ చీకటి వెలుగులో. అమృతలో ఆవేశం ప్రవేశించింది. వడివడిగా వెళ్ళి రమేష్ చేతిని పట్టుకొంది.

రమేష్ వెనక్కి తిరిగాడు.

అమృత కళ్ళల్లో నీళ్ళు మెరుస్తున్నాయి.

అలాగే పట్టుకొని రమేష్‌ని ముందుకు లాక్కుపోయింది.

అక్కడ జనసంచారం లేదు.

రమేష్ ఎటో చూస్తున్నాడు.

అమృత రమేష్ మొహంలోకి చూస్తూ

ఉంది.

ఇద్దరిమధ్యా మాటలు లేవు.

"పలకవా" ఆమె పెదాలు అదురుతున్నాయి. రమేష్ నోట మాటరాలేదు.

"నువ్వు పలక్కపోతే నేను చచ్చిపోతా" తన్నుకొస్తున్న దుఃఖంతో అనేసింది.

అమృత మొహంలోకి చూశాడు రమేష్. ఆమె అతని కళ్ళల్లోకి చూస్తూ ఉంది. అమాంతం తన చేతులతో ఆమెను చుట్టి హృదయానికి హత్తుకున్నాడు. అమృత రమేష్‌కి అల్లుకుపోయింది.

వేగంగా కొట్టుకొంటున్న గుండెలు రెండూ సాధారణ స్థితికి వచ్చేవరకూ అలాగే ఉండిపోయారు.

అప్పుడు ఒకరినొకరు విడిపించుకొంటూ రెండడుగులు నడిచి కూర్చుండిపోయారు.

"నామీద కోపం వచ్చింది కదూ" అడిగింది అమృత.

"కోపం కాదు భయం. నువ్వు మా నాన్నకు చెప్తానన్నావుగా"

"ఏం, మీ నాన్నగారంటే నీకు భయమా"

"నాకేగాదు యింట్లో అందరికీ"

"మీ అమ్మగారంటే భయం లేదా

"అమ్మ దేవత. నాకోసం ప్రాణం ఇస్తుంది"

"మరి మీనాన్న

"ఓ పెద్ద శాడిస్టు. తనకోసం ప్రాణాలు తీస్తాడు. మా అమ్మ అసలు ఆయనతో పలకదు. అక్క చనిపోవడానికి కారణం ఆయనేగా" రమేష్ మాటల్లో కాస్త విచారం చోటు చేసుకొంది.

"నేను నీకోసం మీ యింటికి వచ్చాను" అంది అమృత.

"నేను చూశాను"

"అప్పుడు నువ్వు మిద్దిమీదున్నావు కదూ. మీ అమ్మగారు చెప్పారు. నాకు కనబడలేదేం"

"నువ్వు నామీద మా నాన్నకి చెప్పడానికి వచ్చావని భయపడ్డాను. అందుకని నీకు కనబడకుండా పడుకొన్నాను"

"ఛ! నేనెందుకు చెప్తాను మీ నాన్నకి. ఆరోజు ఏదో అలా అన్నాను అంతే! ఈరోజు ఇక్కడికి నేను వచ్చింది తిరనాళ్ళు చూడడానికికాదు, నీకోసం. నిన్ను చూడాలని. అమ్మవారికి మొక్కుకొన్నాను నువ్వు కనబడితే రేపు ఉదయం కొబ్బరికాయ కొడ్తానని"

అమృత అలా చెప్తూ ఉంటే రమేష్ ఆమె మొహాన్ని రెండు చేతులతో తీసుకొని తన మొహంమీదికి లాక్కున్నాడు.

"నా కోరిక తీర్చింది అమ్మవారు. రేపు ఉదయం వచ్చి మొక్కు తీర్చుకొంటాను" రెండు నిముషాల తర్వాత అంది అమృత.

"అయితే రేపు పొద్దున్నే ఇక్కడికి వస్తావన్నమాట"

"ఏం నువ్వు రావా. అమ్మవార్ని నువ్వేం కోరుకోలేదా?"

"ఇంతవరకూ నేనేం కోరుకోలేదు అమృతా. ఇప్పుడు కోరుకుంటాను" అన్నాడు రమేష్.

"ఏం కోరుకొంటావు?" అడిగింది అమృత.

"మన ఇద్దర్నీ విడదీయకుండా ఉండమని"

"అలాకాదు, మన ఇద్దరికీ పెళ్ళి చెయ్యమని కోరుకో... సరేనా"

"ఓ! యస్! అలాగే కోరుకొంటాను"

"అయితే నేవెళ్ళనా. అమ్మ నాకోసం ఎదురుచూస్తూ ఉంటుంది"

"ప్లీజ్"

"నేనొచ్చి చాలా సేపయింది. ఇంకా ఇంటికి వెళ్ళకపోతే నన్ను వెతుక్కొంటూ మా నాన్న వస్తాడు" అంటూ అమృత లేచి నిలబడింది. వెంటనే రమేష్ లేచాడు.

"నువ్వు వెళ్ళి అమ్మవారికి మొక్కుకో. నేనిటు వెళ్ళుతున్నా?" అనేసి చకచకా

అమృత అక్కడినుండి కదిలివెళ్ళింది.



అమృత ఇంటికి వచ్చేసరికి పంచలో శివరామశాస్త్రి, పరమేశ్వరశాస్త్రీ కబుర్లు చెప్పు కుంటూ ఉన్నారు. అమృత రావడం చూసి "నీకోసం రావాలని బయలుదేరానమ్మా. ఇంతలో మీ మావయ్య వచ్చాడు" అన్నాడు శివరామశాస్త్రి.

"నాకస్సలు అక్కడినుండి రాబుద్ధికాలేదు నాన్నా. అమ్మ నిన్ను పంపుతుందని వచ్చే శాను. లేకుంటే ఇంకాసేపు అక్కడే ఉండే దాన్ని" అంది అమృత.

"అంత బావుందా ఏమ్మా తిరునాళ్ళు" అని అడిగాడు పరమేశ్వరశాస్త్రి.

"అవును మావయ్యా. పండరీభజన భలే బావుంది. నువ్వుగానీ, మా నాన్నగానీ చూశారంటే అక్కడనుండి కదలరు. అందరూ ఆడవాళ్ళే. పదిహేను ఏళ్ళలోపు వాళ్ళే. రాగయుక్తంగా వాళ్ళు అడుగులే స్తుంటే ఎంత బావుంది. ఒక్కసారి నువ్వూ, నాన్న పోయి చూసిరండి మావయ్యా"

"అలాంటివి నేను చాలాసార్లు చూశా నమ్మా. నా మనసులో ఒకే ఒక్క కోరిక ఉందమ్మా" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"ఏమిటి మావయ్యా అంతటి కోరిక? "

"ఏంలేదమ్మా, మీ నాన్న శివతాండవం చేస్తే చూడాలని ఉంది"

"ఆ అదృష్టం నీకు లేదురా" వెంటనే శివ రామశాస్త్రి అన్నాడు పరమేశ్వరశాస్త్రితో.

"అదేంబావా అలా అంటావు"

"అవునురా... శివతాండవం చెయ్యాలంటే దానికి వెనకాల ఎంతో ప్రేరణకావాలి. నన్ను నేను మరిచిపోగలగాలి. శివుడిలో లీనమవ్వాలి. అప్పుడే శివతాండవం రక్తికడు తుంది. లేకుంటే ఎంత ప్రయత్నం చేసినా అది పేలవంగానే ఉంటుంది" అని చెప్పాడు.

"సరే దేనికైనా అదృష్టం ఉండాలిగా. నాకెందుకో ఆ అదృష్టం ఉందనిపిస్తోంది బావా" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

అమృతని వాళ్ళ అమ్మ శారదమ్మ భోజ నానికి పిలిచింది.

"ఇప్పుడొద్దమ్మా" అంటూ ఇంట్లోకి వెళ్ళింది అమృత.

"ఎల్లుండి నేను ఉత్తరప్రదేశ్‌కి పోతు న్నాను బావా" అని చెప్పాడు పరమేశ్వర శాస్త్రి శివరామశాస్త్రితో.

"ఏమిటి విశేషం? " అడిగాడు శివరామ శాస్త్రి.

"మీరట్ దగ్గర నైనిటాల్‌లో జ్యోతిష్య శాస్త్ర... అధ్యయన కేంద్రం ఏదో ఉందట. అక్కడనుండి ఆహ్వానం వచ్చింది. నాలుగు రోజులపాటు జ్యోతిష్యశాస్త్ర పండితుల సమావేశాలు జరుగుతాయట" చెప్పాడు పర మేశ్వరశాస్త్రి.

"నీకు జ్యోతిష్యం పిచ్చి ముదిరిపోయింది. వైద్యాన్ని మర్చిపోతున్నావు" అన్నాడు శివరా మశాస్త్రి.

"లేదు బావా, నువ్వన్నట్టు జ్యోతిష్యంమీద శ్రద్ధ ఎక్కువైనమాట నిజమే కానీ వైద్యం చేయడంలో అశ్రద్ధ చేయటంలేదు"

ఇంట్లోవున్న శారదమ్మకి పంచలోంచి మాటలు వినపడటంతో పరమేశ్వరశాస్త్రి

ప్రయాణం గురించి అమృతకి చెప్పింది.

"ఏంమావయ్యా, ఉత్తరప్రదేశ్ వెళ్తున్నావా?" అంటూ వాకిట్లోకి వచ్చింది అమృత.

"అవునమ్మా"

"మరి నాకేం తెస్తావు?"

"నాకాప్రదేశం కొత్తకదమ్మా. నాకు నచ్చినవీ నువ్వు మెచ్చేవీ ఏమి వుంటే అవి తెస్తాను"

"మంచిది మావయ్యా" అనేసి అమృత ఇంట్లోకి వెళ్ళిపోయింది.

శారదమ్మ కంచంలో అన్నం పెట్టింది.

"ఆకలి లేదమ్మా" అంటూనే భోంచేసింది.

ఆ రాత్రి-

మసకచీకట్లో రమేష్ చూసిన చూపులు తన కళ్ళల్లో మెదులుతున్నాయి. అతని చేతులు రెండూ తన వీపుని చుట్టి దగ్గరికి లాక్కొన్నప్పుడు కలిగిన పరవశత్వం మళ్ళీ మళ్ళీ గుర్తుకొచ్చి నిద్రపట్టలేదు.

పొద్దుపోయింది.

పక్కమీద అటూఇటూ పొర్లింది. అమ్మా నాన్న ప్రశాంతంగా నిద్రపోతున్నారు. ఎవరో పిలుస్తున్నట్టనిపించి లేచి చూసింది. ఎవరూ కనబడలేదు.

మళ్ళీ అదే పిలుపు.

వాకిట్లో రమేష్ రమ్మన్నట్లు చేతులు చాచి నిలబడి ఉన్నాడు. ఆ చేతుల్లో ఇమిడిపోవాలని లేచింది.

చల్లటి వాతావరణం ప్రశాంతంగా, ఆహ్లాదకరంగా ఉంది. మబ్బును మబ్బు ముద్దాడాలని పరుగులు తీస్తున్నాయి ఆకాశంలో మేఘాలు. ఆ మేఘాల మాటున చేరిన చంద్రుడు తొంగితొంగి చూస్తున్నాడు. ఆయన చూపుల కిరణాల తాకిడికి జాలుగా పారుతున్న ఏటినీరు పరవశించి తళతళా మెరుపులతో సాగుతూవుంది.

రమేష్, అమృత ఇద్దరూ ఒకర్ని ఒకరు చూసుకొంటున్నారు.

ఆ చూపుల్లో అనురాగం.

అందంలో ఆకర్షణ.

మాటల్లో మౌనం.

మనసుల్లో తమకం.

అమృత కళ్ళు తుమ్మెద రెక్కల్లోంచి మత్తుగా చూస్తూ చుంబించ మంటున్నాయి. విచ్చుకోటానికి సిద్ధంగావున్న పద్మంలా ఆమె పెదాలు ఊరిస్తున్నాయి. ముద్దులకోసమే అన్నట్టు చెక్కిళ్ళు కెంపుల్ని మెరిపిస్తున్నాయి.

రమేష్ చేతులు అప్రయత్నంగా కదిలాయి. మరుక్షణం అమృత అధరాలు రెండూ రమేష్ పెదాల్ని తాకాయి.

ఇద్దరిలో...

ఎక్కడో, ఏదో కోరిక

సిగ్గు, బిడియం ఉనికిని మర్చిపోయారు.

ప్రేమాగ్నిచెరలో శరీరాలు దహించబడసాగాయి.

ఆలింగన చుంబనాలు అవధులు దాటి పరిసరాలను మరచి పరవశమవుతున్నాయి.

ఆ సమయంలో,

అమృత తన చేతిని ఎవరో పట్టుకొని లాగినట్టు ఉలిక్కిపడి వెనక్కి చూసింది.

చంద్రశేఖర్!

అప్పటికే అమృతని రమేష్ బాహుబంధాలలోంచి బటబటా లాక్కొనిపోతున్నాడు. అతని పట్టునుండి తప్పించుకొనడానికి అమృత విఫల ప్రయత్నం చేసింది. కొద్దిసేపటికి శక్తినంతా కూడదీసుకుని ఒక్క ఉదుటున చంద్రశేఖర్‌ని వెల్లకిలా పడదోసి రమేష్ దగ్గరకి పరిగెత్తసాగింది. చంద్రశేఖర్ లేచి వేగంగా వచ్చి ఆమెని పట్టుకోబోయాడు. ఇంతలో రమేష్ వచ్చి చంద్రశేఖర్‌కి ఎదురు నిలబడ్డాడు. చంద్రశేఖర్‌కి కోపం వచ్చింది. రమేష్‌ని పక్కకి తోసెయ్యబోయాడు. అతను కదలలేదు. ఇద్దరూ కలియబడ్డారు. పెనుగులాడారు. ఆ పెనుగులాటలో రమేష్ కిందపడిపోయ్యాడు. అప్పుడు చంద్రశేఖర్ అక్కడే ఉన్న పెద్దబండను ఎత్తి

రమేష్ తలమీద కొట్టాడు. తల పగిలి రక్తం చిందింది. అది చూసి అమృత పెద్దగా అరిచింది.

ఆ అరుపుకి పక్కనే నిద్రపోతున్న శారదమ్మకి మెలుకువ వచ్చి అమృతని తట్టిలేపింది.

★ ★ ★

పరమేశ్వరశాస్త్రి నైనిటాల్ వెళ్ళి నాలుగు రోజులు అయ్యింది. అతను పోతూపోతూ వర్ధనమ్మను గూడా తనతో రమ్మన్నాడు. అందుకు ఆమె "ఆహఁ నేను రాను" అనేసింది.

పరమేశ్వరశాస్త్రి వంటరిగానే వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిపోయిన మూడోరోజు కాకినాడనుండి రాజేశ్వరీ, మాధవి వచ్చారు.

వాళ్ళ రాక వర్ధనమ్మకి చిరాకు కలిగించింది. అయినా ఇంతకాలం చంద్రశేఖర్ కాకినాడలో వాళ్ళ ఇంట్లోనే ఉన్నాడు. ఇంకా కొంతకాలం వాళ్ళతో అవసరం ఉంది అనే ఉద్దేశంతో వాళ్ళకి మర్యాదలు చెయ్యక తప్పలేదు వర్ధనమ్మకి.

ఆమెకి ఇంటిపనుల్లో పూర్తిగా సహకరించ సాగింది మాధవి.

పాచిపని దగ్గరనుండీ బావిలో నీళ్ళు తోడటం, వంటచెయ్యడం, స్నానాలకు నీళ్ళు పట్టడం, చివరికి బట్టలుతకడం వంటి ప్రతీ పనీ చెయ్యడానికి ముందుకొచ్చేది. ఆమెలో చదువుకున్నానన్న గర్వంలేదు. అందంలో ఒకరికి తీసిపోదు. పచ్చని పసిమిరంగు కాకపోయినా కన్నూముక్కూ తీరు చూస్తే మొహంలో కళ, ఆకర్షణ, ప్రవర్తనలో అణుకువ, మాటల్లో సున్నితత్వం స్పష్టంగా కనిపిస్తాయి.

అయినా మాధవి ఆడబిడ్డ కూతురు కావడం అమృతని కోడలిగా చేసుకోవాలన్న బలమైన కోరిక ఉండడంతో వర్ధనమ్మకి మాధవి అంటరానిదిగానే తోచింది.

మెరుపుతీగలా ప్రత్యక్షమై మాధవి చలాకీగా తిరుగుతూ మాయమవుతుంటే చంద్రశేఖర్‌లో ఆవేశం పొంగుకొచ్చేది. మనసుని ఎంత అదుపులో ఉంచుకుందామనుకున్నా అది తాత్కాలికమే అవుతోంది.

నిండు యవ్వనంతో పుష్టిగా ఉన్న ఆమె అవయవ సౌష్టవాలను చూడకుండా ఉండలేకపోతున్నాడు.

మాధవి మాత్రం ఇదివరకటిలాగే బిడియం లేకుండా చంద్రశేఖర్‌తో కలుపుగోలుగానే ఉంది. అతనికి సపర్యలు చెయ్యాలంటే మాధవికి మహాసంతోషం. ఆమెకి మేనమామ పరమేశ్వరశాస్త్రిగారంటే గౌరవం, ఆయన మాటలంటే గురి.

ఎప్పుడో చిన్నతనంలో మాధవి, చంద్రశేఖర్ జాతకాలు బాగా కలిశాయి అని అమ్మతో పరమేశ్వరశాస్త్రి అన్నాడు. ఆ మాటలను బాగా గుర్తుంచుకొంది మాధవి.

అప్పటినుండీ మాధవి చంద్రశేఖర్‌ని బావగా కాకుండా కాబోయే భర్తగా ఊహించుకుంది. పైగా ఆమెకి చంద్రశేఖర్ అంటే ఇష్టం కూడా.

స్నానం చెయ్యడానికని చంద్రశేఖర్ బావిలో నీళ్ళు తోడుకోబోతుంటే "నేను తోడిపెడతాన్లే బావా" అంటూ వచ్చింది మాధవి.

"నీకెందుకులే మాధవీ శ్రమ. నేను తోడుకుంటాన్లే" అన్నాడు చంద్రశేఖర్.

"ఇందులో శ్రమ ఏముంది బావా. ముందు నువ్వు తప్పుకో" దాదాపు చంద్రశేఖర్‌ని నెట్టిపారేసినట్టు అతని చేతిలోంచి చేద లాక్కొంది.

"మీ యింట్లో ఎలాగూ నాకు సపర్యలు చేశావు ఇక్కడ కూడా..."

చంద్రశేఖర్ అంటూ వుంటే, "ఏం చేయకూడదా?" అంది మాధవి అతని మొహంలోకి చూస్తూ.

"నువ్విప్పుడు మా ఇంటికి వచ్చావు. చుట్టానివి. చుట్టంచేత పనులు చేయించకూడదు"

మాధవి ఆశ్చర్యపోయింది.

"ఏమిటే! ఇది మీ యిల్లా? నేను చుట్టాన్నా? అని ఎవరన్నారు? అదేంకాదు. ఈ యిల్లు నీకెంతో నాకూ అంతే. అమ్మ మామయ్యతో మన పెళ్ళి విషయం మాట్లాడడానికి వచ్చింది" అనేసి గబగబా నాలుగు చేదలు నీళ్ళు తోడి బకెట్లో పోసింది.

ఆ నీళ్ళ బకెట్టు బాత్రూములోకి తీసుకొని పోవడానికి చంద్రశేఖర్ ప్రయత్నిస్తుంటే "నేనే పెట్టి వస్తాన్లే. మనం కాబోయే భా, భలం" అంటూ మాధవి మరోమాటకి అవకాశం ఇవ్వకుండా ఒక్కతే తీసుకొని బాత్రూమ్‌లోకి వెళ్ళింది.

మాధవి బాత్రూమ్‌లో బకెట్ పెట్టి తిరిగి వస్తుంటే చంద్రశేఖర్ ఎదురుగా నిలబడి ఆమెనే చూస్తున్నాడు.

అంతకుముందెన్నడూ చంద్రశేఖర్ మాధవిని అంత పరిశీలనగా చూడలేదు.

చమర్చిన నుదుట గాలికి చెదరిన రెండు మూడు ముంగురులు అతుక్కుపోయి ఉన్నాయి. ఆ ముంగురులమధ్య పెద్ద తిలకంబొట్టు, నల్ల కలువల్లా విశాలంగా కళ్ళు, అందమైన ముక్కు, గులాబీరేకుల్లా బుల్లిపెదాల నోరు, వంటిపేట బంగారు గొలుసుతో కవ్విస్తున్న కంఠభాగం పొట్టలో లోతుకు కన్పిస్తున్న నాభి.

'నడుంమీద చేతులు వేసి అక్కడ చుంబిస్తే...'

"బావగారూ బాత్రూమ్‌లో నీళ్ళు పెట్టాను. వెళ్ళి స్నానం చెయ్యండి. మనం ఇంకా భా, భలం కాలేదు" అనేసి అక్కడి నుండి బరబరా ఇంట్లోకి వచ్చేసింది.

నట్టింట్లో చాపలు వేసుకొని వర్ధనమ్మా, రాజేశ్వరి, అమృతా కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"ఓ అమృతా! ఎంతసేపయ్యింది వచ్చి" అంటూ మాధవి అమృత పక్కనే కూర్చుంది.

"ఇప్పుడే అక్కా"

"ఏమిటి సంగతులు?" అమృత భుజం మీద చేతులువేసి ఆప్యాయంగా దగ్గరకు తీసుకొంది మాధవి.

"అమ్మ నిన్నూ, పెద్దమ్మనూ పిల్చుకురమ్మంది"

"ఏమిటీ విశేషం?"

"ఈరోజు అక్కడే మీకు భోజనాలు"

"బట్టలు కూడా తెప్పించిందేమిటి మీ అమ్మ" అని అడిగింది వర్ధనమ్మ.

"ఏమో అత్తయ్యా"

చంద్రశేఖర్ స్నానంచేసి అక్కడకి వచ్చాడు. అతన్ని చూడగానే అమృత "మీరు త్వరగా వచ్చెయ్యండి. పెద్దమ్మా నేవెళుతున్నాను" అనేసి బిరబిరా వెళ్ళిపోయింది.

"పిచ్చిముండ. దానికి వాణ్ణి చూస్తేనే సిగ్గు" అంది వర్ధనమ్మ.

ఆ మాటల్లో అమృతపట్ల వర్ధనమ్మకిగల ఆలోచన ఏమిటో రాజేశ్వరికి, మాధవికీ అర్థంకాకుండా పోలేదు.

పదిగంటలవుతుండగా వాళ్ళు శివరామశాస్త్రిగారింటికి వెళ్ళారు. శారదమ్మ వాళ్ళను ఆప్యాయంగా ఆహ్వానించింది.

మాధవి, అమృతా కలిసి తోటలోకి వెళ్ళారు పూలు కోసుకురావడానికి.

రాజేశ్వరి, శారదమ్మ కబుర్లు చెప్పుకుంటూ వంటింట్లో ఉండిపోయారు. వాళ్ళ కబుర్లలో రాజేశ్వరి కాకినాడనుండి ఎందుకు వచ్చిందో శారదమ్మకు అర్థమైపోయింది.

"ఈ రాత్రికి మా అన్నయ్య వస్తే రేపు ఉదయం మేం వెళ్ళిపోతాం" అని చెప్పింది రాజేశ్వరి.

"అయితే మాకు తొందరలో పప్పన్నం పెట్టబోతున్నారన్న మాట" అంది శారదమ్మ.

"అనుకుంటున్నాం దేవుడు సహకరించాలి కదా. అవునూ అమృత పెళ్ళిగురించి మీరేమీ అనుకోవడంలేదా?" అని అడిగింది రాజేశ్వరి.

"నాదేముంది, అంతా వాళ్ళ నాన్నగారే"

అమృతా, మాధవి వచ్చి వాళ్ళు కోసుకొని వచ్చిన పూలన్నీ చాపమీద పోసి దండ లుగా కట్టసాగారు.

ఒంటిగంటకల్లా శారదమ్మ వంటపని పూర్తిచేసి రాజేశ్వరికి, మాధవికీ భోజనాలు పెట్టింది. వాళ్ళు భోంచేసి చేతులు కడు క్కొంటుండగా సునీత వచ్చి "నాన్న వచ్చాడు" అని చెప్పింది.

అది శుభవార్తలా ఉంది రాజేశ్వరికి. కొద్ది సేపు ఉండి బయలుదేరుతుంటే "సాయంకాలం వెళ్ళవచ్చు" అని శారదమ్మ వాళ్లను ఆపుచేసింది.

నాలుగు గంటలప్పుడు పకోడీలు తయా రుచేసి టిఫిన్ పెట్టింది.

"తిన్న భోజనం అరగలేదు. మళ్ళీ పకో డీలా" అంటూనే తినేశారు.

శారదమ్మ రాజేశ్వరికీ, మాధవికీ నుదుట కుంకుమబొట్టు పెట్టి వాళ్ళు వద్దంటున్నా వినకుండా చెరి రెండు జాకెట్ ముక్కలు, తాంబూలంతో ఇచ్చి సాగనంపింది.

★ ★ ★

ఆ రాత్రి భోజనాలు అయిన తర్వాత పర మేశ్వరశాస్త్రి పంచలో ఉన్న మంచంమీద కూర్చున్నాడు.

అదే మంచిసమయం అనుకుంది రాజే శ్వరి. పరమేశ్వరశాస్త్రికి దగ్గరగా చాపమీద కూర్చుంది.

"వదినా, ఒకసారి ఇలా వస్తావా? " అని ఇంట్లో ఉన్న వర్ధనమ్మను పిలిచింది.

పది నిముషాల తర్వాత వర్ధనమ్మ అయి ష్టంగా వచ్చి రాజేశ్వరికి ఎదురుగా కూర్చుంది.

"అన్నయ్యా మా అమ్మాయి మాధవిని మీ అబ్బాయి చంద్రశేఖర్‌కి ఇవ్వాలని అను కుంటున్నాం" అంది రాజేశ్వరి పరమేశ్వరశా స్త్రితో.

వర్ధనమ్మకు మనసులో దేవినట్టుంది.

పరమేశ్వరశాస్త్రి క్షణకాలం భార్య మొహం లోకి చూశాడు. ఆమె అసహనంతో ఉన్నట్టు చెప్పకనే తెలుస్తోంది.

ఓ అయిదు నిముషాలు ఆలోచిస్తూ కూర్చున్నాడు. తర్వాత అన్నాడు.

"నేనూ ఆలోచించుకోవాలి గదా. అబ్బా యిని అడగాలి. మీ వదిన మనసులో ఏముందో..."

"మధ్యలో నాదేముందిలెండి" వర్ధనమ్మ సాగదీస్తూ అంది.

"అదేంమాటలే వదినా. నువ్వూ, అన్నయ్యా, అబ్బాయి ముగ్గురూ కూడబలు క్కునే చెప్పండి" అంటూ రాజేశ్వరి పరమే శ్వరశాస్త్రివైపు చూసింది.

ఆయనేం మాట్లాడలేదు. తనే అంది.

"మాధవికి చంద్ర అంటే యిష్టం. నాకూ యిష్టం. మీ బావగారికి కూడా ఇష్టమే. రక్తంలో రక్తం కలిసిపోతుందని నా ఆశ. వదినగానీ, చంద్రగానీ, నీమాట కాదంటా రంటే నేను నమ్మను. కట్నకానుకల్లో నేను ఏలోటూ రానివ్వను"

"కట్నాలు, కానుకలే కాదమ్మా ముఖ్యం"

"చంద్రశేఖర్ ఇక్కడే ఉన్నాడు కదా పిలిచి అడగండి. వాడి అభిప్రాయం కూడా తెలిసిపోతుంది" ఇప్పుడే విషయం తేలిపో తుందన్నట్టు అంది రాజేశ్వరి.

వర్ధనమ్మకి కాస్త కోపం వచ్చింది. అయినా ఆమె మాట్లాడలేదు.

పక్క గదిలోనే ఉన్న చంద్రశేఖర్‌ని, సునీ తను పంపి పిలిపించాడు పరమేశ్వరశాస్త్రి.

చంద్రశేఖర్ వచ్చి పరమేశ్వరశాస్త్రి పక్కనే కూర్చున్నాడు.

"ఏరా చంద్రా! మీ అత్తయ్య కూతురు మాధవిని పెళ్ళి చేసుకోవడంలో నీ ఉద్దేశం ఏమిటి? " అని అడిగాడు పరమేశ్వరశాస్త్రి.

చంద్రశేఖర్ ఏమీ మాట్లాడలేదు.

రెండు నిముషాలు మౌనం.

"నీకు ఇష్టమా కాదా? " పరమేశ్వరశాస్త్రి మళ్ళీ అడిగాడు.

"మీకూ, అమ్మకూ ఇష్టమయితే నాకూ ఇష్టమే నాన్నా" అని చెప్పి చంద్రశేఖర్ లేచి

వెళ్ళిపోయాడు.

వెంటనే వర్ధనమ్మ లేచి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఆమెకి మాధవిని చంద్రశేఖర్‌కి చేసుకోవడం ఇష్టంలేదని పరమేశ్వరశాస్త్రికి తెలుసు. ఆ విషయం రాజేశ్వరికి కూడా తెలుసు.

అన్నయ్య ఏంచెప్తాడోనని ఆయన మొహంలోకి చూస్తుండిపోయింది.

అప్పుడు పరమేశ్వరశాస్త్రి నడిమంచంమీద బాసింపీట వేసుకుని కూర్చుని ఉన్నాడు. రెండుచేతుల్నీ కలిపి కుడిమోకాలు పట్టుకొని వెనక్కీ, ముందుకీ ఊగుతున్నాడు.

"ఏం అన్నయ్యా, మాట్లాడవు" అంది రాజేశ్వరి.

"తొందరపడకమ్మా. దేన్నికైనా సమయం రావాలి. కళ్యాణం వచ్చినా, కక్కొచ్చినా ఆగదని తెలుసు. అలాంటప్పుడు తొందరపడడం అనర్థాన్ని తెస్తుంది. నా జ్యోతిష్య పాండిత్యాలమీద నాకు నమ్మకం ఉంది. నీకు నామీద నమ్మకం ఉంటే చెప్తాను విను. చంద్రశేఖర్‌కి, మాధవికి పెళ్ళి అవుతుంది" అన్నాడు.

రాజేశ్వరికి ఆనందం వేసింది.

ఇంట్లో కిటికీ దగ్గర చేరి చూస్తున్న మాధవి చెవులకు మావయ్య మాటలు అమృతంలా సోకాయి.

తల్లో సన్నజాజుల్ని ఎవరో వాసన చూస్తున్న సవ్వడి.

వెనక్కి తిరిగి చూసింది మాధవి.

చంద్రశేఖర్ సన్నగా నవ్వుతున్నాడు. నడుంచుట్టూ చేతులువేసి గట్టిగా తనవైపు లాక్కుని మొహంమీదికి వంగి నుదుట ముద్దుపెట్టాడు.

మాధవిని ఏదో మత్తు ఆవహించింది. అమాంతం ఆమెని ఎత్తుకుని గదిలోకి వెళ్ళిపోయాడు. ఎత్తైన మెత్తటి పరుపుమీద మాధవిని హత్తుకొంటూ "మాధవీ" అన్నాడు.

"ఊఁ..."

"మనం ఇప్పుడు భా, భలం"

చంద్రశేఖర్ మెడచుట్టూ చేతులు పెనవేసి తనవైపు లాక్కుంది. అతని ముద్దుల వానలో తడిసిపోతూ ఎవరో కొట్టినట్లు ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది.

"తెల్లవారింది. లేవే ఊరికిపోవాలి" అంటూ ఎదురుగా రాజేశ్వరి నిలబడి ఉంది.

"ఊరికా?" నిరుత్సాహంగా అంది మాధవి.

"ఏం రావా ఏం?"

మాధవి లేచి కూర్చుంది.

టిఫిన్ తిని ఊరికి బయలుదేరారు రాజేశ్వరీ, మాధవి. బస్టాండు దాకా వెళ్ళి వాళ్ళని బస్సెక్కించి వచ్చారు పరమేశ్వరశాస్త్రీ, వర్ధనమ్మ.

★ ★ ★

బస్టాండునుండి తిరిగివచ్చిన తరువాత పరమేశ్వరశాస్త్రి వాలుకుర్చీలో వాలిపోయాడు.

వర్ధనమ్మ మాటా, పలుకూ లేకుండా గంభీరంగా ఉండిపోయింది. ఆమెను చూస్తూ ఉంటే ఏదో తుపాను రాబోతోందని పరమేశ్వరశాస్త్రికి అర్థమయ్యింది. రాత్రి తను మాధవికీ, చంద్రశేఖర్‌కి పెళ్ళి జరుగుతుందని చెప్పటమే అందుకు కారణం అని కూడా తెలుసు. ప్రళయం రాకుండా ఉండటానికని మౌనంగా ఉండిపోయాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" కాస్త కోపంగా అడిగింది వర్ధనమ్మ.

పరమేశ్వరశాస్త్రి ఆమె ముఖంలోకి చూశాడు. ఏం మాట్లాడలేదు.

"మిమ్మల్నే"

"అదే అదృష్టాన్ని గురించి ఆలోచిస్తున్నాను"

"మీ అదృష్టం నాకెక్కడనుండి వస్తుందిలెండి" వెటకారంగా అంది వర్ధనమ్మ.

పరమేశ్వరశాస్త్రికి అసహనాన్ని కలిగిం

చాయి ఆమె మాటలు.

"నీకు నీలోకం తప్ప ఇంకేం పట్టదు. పక్కవాళ్ళనుగానీ, పరిస్థితుల్నిగానీ అర్థం చేసుకొనే మనస్తత్వం నీకులేదు. అదృష్టం కాళ్ళముందుకి వచ్చినా తెలుసుకోలేక కాళ్ళతో తన్నేసేదానివి. నీకెలా ఉంటుంది అదృష్టం"

"అవునులే మీకూ మీ చెల్లెలికీ తెలిసినంత నాకేం తెలుసు లోకం. మీరయితే తెలివైన వాళ్ళు. అందర్నీ అన్ని పరిస్థితుల్ని అర్థం చేసుకోగలరు. మీ చెల్లెలు కూతుర్ని చంద్రకి చేసుకోవటమే అదృష్టం అయితే అట్లాగే చేసుకోండి. మీ ఇష్టం. మీ యిష్టమొచ్చి నట్లు చేసుకోండి" కోపంగా లేచి వర్ధనమ్మ విసురుగా లోపలికి వెళ్ళిపోయింది.

ఆమె వెనకాలే పరమేశ్వరశాస్త్రి ఇంట్లోకి వెళ్ళాడు.

"నేను అనడం ఇప్పుడు పెళ్ళివిషయం గురించి కాదు. అయినా పెళ్ళిళ్ళు అనేవి స్వర్గంలో జరుగుతాయి. వాళ్ళవాళ్ళ జాతకా లను బట్టి ఈ లోకంలో స్త్రీపురుషులు కలిసి భార్యాభర్తలుగా చలామణి అవుతారు. అయినా ఎప్పుడన్నా నేను నీమాట కాద న్నానా నీ అభిప్రాయానికి భిన్నంగా నడు చుకున్నానా. నీ యిష్టం లేకుండా చంద్రకి పెళ్ళి జరుగుతుందా. నువ్వు అమృతని చేసుకోవాలంటే నేను కాదంటానా" పరమే శ్వరశాస్త్రి అలా అంటుంటే వర్ధనమ్మ ఆయన ముఖంలోకి చూసింది.

ఆమె కళ్ళు పెద్దవిగా విచ్చుకొంటు న్నాయి. కళ్ళల్లోంచి నీళ్ళు రాలడం ఆగిపో యింది. మళ్ళీ పరమేశ్వరశాస్త్రి అన్నాడు.

"ఇన్నేళ్ళనుండీ నాతో కాపురం చేస్తు న్నావు. ఎప్పుడన్నా నన్ను అర్థంచేసుకోడా నికి ప్రయత్నించావా. మొండితనం, మొండి పట్టుదల తప్ప ఎప్పుడన్నా సామరస్యంగా ప్రవర్తించావా. నాతో నైనిటాల్‌కి రావే అన్నప్పుడు రాను అని మొండిగా తిరస్క రించావేగానీ నేనెందుకు లెండి మీరు వెళ్ళి రండి అని అనునయంగా అన్నావా. కనీసం సున్నితంగా ప్రవర్తిద్దామన్న ఆలోచనే లేక పోయె నీకు. అయినా నేను నిన్నెప్పుడన్నా బాధించానా చెప్పు"

వర్ధనమ్మ తలవంచుకొని నేలచూపులు చూస్తూ ఉండిపోయింది.

పరమేశ్వరశాస్త్రి వర్ధనమ్మకి ఎదురుగా వెళ్ళి దాదాపు ఆమెని ఆనుకొన్నట్లుగా నిల బడ్డాడు.

"నిజం చెప్పాలంటే నీకసలు ఏమీ తెలి యదే" అంటూ ఆమె గడ్డాన్ని తన చేతిలోకి తీసుకొని పైకెత్తాడు. భర్తచేతి స్పర్శతో వర్ధ నమ్మ పూర్తిగా మూగదైపోయింది.

"నేను అన్న అదృష్టం చంద్ర పెళ్ళికి సంబంధించింది కాదు. నీకు సంబంధిం చింది" అన్నాడు.

"నాకు సంబంధించిందా? "

"అవును... నీకు సంబంధించిందే. మనో హరమైన మంచు ప్రపంచంతో సొగసులు దిద్దుకొన్న నైనిటాల్ నువ్వు చూడలేకపో యినందుకే అలా అన్నాను. దక్షయజ్ఞానికి సంబంధించి పురాణాలలో ఉన్న కథ నీకు తెలిసిందేగా. శివుణ్ణి పిలవకుండా దక్షుడు యజ్ఞం చేయడం, పిలవకపోయినా సతీదేవి వెళ్ళడం, అక్కడ దక్షుడిచేత అవమానింప బడి ఆమె ఆ యజ్ఞ గుండంలో ఆత్మార్పణం చేసుకోవడం, అందుకు శివుడు ఉగ్రుడై సతీ దేవి శవాన్ని భుజానవేసుకొని తాండవం చేయడం, అప్పుడు ఆమె నయనాలు రాలి పడ్డ చోట బుసబుసమంటూ నీరు పొంగిం దంట. అందుకని ఆ ప్రాంతానికి నైనిటాల్ అని పేరు వచ్చిందని చెప్తారు. అది ఎంత వరకు నిజమో తెలియదుగాని ఆ నైనిటాల్ ఒక మంచి యాత్రాస్థలం. యాత్రికులతో సందడిసందడిగా ఉంటుంది. ఆకాశంలో చంద్రుడు మన చేతికి అందుతున్నట్టు, సూర్యాస్తమ సమయంలో సూర్యుడు మనకు అతిదగ్గరగా ఉన్నట్టూ, మేఘాలు తెరలుతెరలుగా మనమధ్యలో తిరుగుతు

న్నట్టూ కనబడే దృశ్యాలు చూస్తుంటే అక్కడినుండి తిరిగి రాబుద్ధికాదు. అక్కడ హనుమంతుడి గుడి ఉంది. దానికి దగ్గరలో వేద శాల ఉంది. అందులో జ్యోతిష్యాధ్యయనం జరుగుతుంది. అందులో ఉన్న పండితులు నన్నెంత గౌరవంగా చూశారో తెలుసా! స్వయంగా 'చాహ్నాపీక్' శిఖరం నుంచి హిమాలయాలలో ఉన్న 'నయనాభిరామ' శిఖరం చూపించారు. నువ్వు రాకపోతివి" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"పోనీలెండి మీరన్నట్లు నాకా అదృష్టం లేదు" పశ్చాత్తాపధోరణిలో అన్నది వర్ధనమ్మ.

"కాళ్ళదగ్గరికి వచ్చింది, తన్నేశావు"

"ఇంక మీరెక్కడికి రమ్మన్నా వస్తానండి... సరేనా" భర్త ఛాతీమీద చేయివేసి నిమురుతూ ఆయనమీద తలవాల్చింది.

వర్ధనమ్మని అలాగే పట్టుకొని పక్కనే ఉన్న ఉయ్యాల బల్లమీద కూర్చున్నాడు.

"నిన్ను మోసం చేయడం చాలా సులభం తెలుసా. కానీ నా రక్తంలో కల్మషాన్ని దాచుకోవడం నాకు ఇష్టంలేదు. బతికేది నాలుగు రోజులు. దేవుడు ఇచ్చిన ఈ జన్మని సరైన మార్గంలో నడిపించగలిగితే చాలు. ప్రత్యేకించి పుణ్యాలకోసం ఏమీ చెయ్యనక్కరలేదు. అందుకనే నేను ఎప్పుడూ తటస్థంగా ఉంటాను. జరిగేది జరక్కమానదు. జాతకాన్ని దాటి ఎవరూ అడుగువెయ్యలేరు. నేను నీకు చెప్పేదల్లా ఒక్కటే, నా మాటల్లోని ఆంతర్యం తెలుసుకో చాలు" అన్నాడు.

వర్ధనమ్మకి ఏం మాట్లాడాలో తెలియడం లేదు. భర్తని ఆనుకొని ఆయన మొహంలోకి చూస్తుండిపోయింది.

★ ★ ★

కొండలవెనక్కి దిగిపోతున్న సూర్యుడు ఎర్రగా మెరుస్తున్నాడు.

క్షణక్షణానికీ ఆ ఎరుపు మాయమై చీకటి ఛాయ్యల్లు ముసురుకొంటుంటే రమేష్‌లో నిరుత్సాహం మొలకెత్తసాగింది. పడమటి కొండలకి సూర్యుడు మూడు బారల దూరంలో ఉన్నప్పుడు వచ్చాడు తను.

జాలుగా పారుతున్న నీటివడ్డున కూర్చుని అమృతకోసం నిరీక్షిస్తున్నాడు. ఏ చిన్న శబ్దం అయినా వెనక్కి తిరిగి చూస్తున్నాడు.

వస్తుందో రాదో!

రాకపోతే!

తప్పకుండా వస్తుంది.

తనని చూడకుండా అమృత ఉండలేదు.

అమృత కనబడకుంటే తను బతకలేడు.

ఆకాశంలో సూర్యుడు కొండల వెనక్కి పోవడానికి సిద్ధంగా ఉన్నాడు. తన పసిమి రంగుమొహాన్ని ఎర్ర దుప్పట్లోకి దురుస్తూ మాయమవుతున్నాడు.

చీకటి ముసురుకొంటోంది.

నిరీక్షణలోనే కాలం దొర్లుతోంది. అయినా ఆశ చావలేదు.

అమృత వస్తుంది... తప్పక వస్తుంది.

చీకటి ముసుగులో తను ఒక్కడే ఉన్నాడు.

ఊహు- ఆమె రాదా

కోపంగా లేచాడు. పిడికిలినిండా ఇసుక తీసుకొని నీటిలోకి విసిరి వెనుదిరిగాడు.

నీరసంగా అడుగులు వేస్తూ నడుస్తున్నాడు.

ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని చీల్చుకొంటూ ఇసుకలో అడుగుల సవ్వడి.

రమేష్ కళ్ళు విప్పారాయి.

మనసు పరవశించింది.

అమృత వస్తూ ఉంది. పరుగులాంటి నడకతో.

"అమృతా"

ఆమె వచ్చి అమాంతం రమేష్‌ని సుడిగాలిలా చుట్టేసింది. పరిగెత్తుకొంటూ రావడం వలన ఆయాసంతో హృదయం వేగంగా కొట్టుకొంటోంది.

"నువ్వు రావనుకున్నాను"

"రాకుండా ఉండలేను"

"అయితే ఇప్పుడా వచ్చేది. నేనొచ్చి ఎంత సేపయిందో తెలుసా"

"నేను రావడానికి ఎంత ప్రయత్నించాననుకున్నావు. పరమేశ్వరశాస్త్రి మావయ్య వచ్చాడు. ఆయన నైనిటాల్ విషయాలు చెప్తూ నన్ను కదలనీయలే. నేను మధ్యలో లేచి రావడానికి అమ్మ ఉంది. ఎక్కడికే వెళ్తున్నావు చీకట్లో అంటుంది. ఏం చెప్పాలి? నేను చీకటి పడి ఇటువైపు రావడం ఇదే మొదటిసారి తెలుసా. నేను రాకుంటే నాకోసం నువ్వు ఇక్కడ ఉండిపోతావని వచ్చాను"

"నిన్ను చూడకుండా నేను ఉండలేను అమృతా"

"నేనుమటుకు ఉండగల్గుతున్నానా... నిన్ను చూడకుండా. ఒక పని చేస్తావా"

"ఏమిటి? "

"నువ్వూ నాట్యం నేర్చుకో"

"నాట్యమా!" రమేష్ ఆశ్చర్యపోయాడు.

"మా నాన్నని అడుగు నాట్యం నేర్పుతాడు. అప్పుడు ఇద్దరం ఒకేచోట ఉండొచ్చు"

"మీనాన్న నాకు నేర్పుతాడా"

"తప్పకుండా నేర్పుతాడు. మీ అమ్మగారంటే ఆయనకి గౌరవం"

"అయితే నాకీ వయసులో నాట్యం ఎలా వస్తుంది"

"నువ్వొచ్చేది నాట్యం నేర్చుకోవడానికా ఏమిటి"

"ఓ యస్"

అమృతని అమాంతం గాల్లోకెత్తి గిరగిరా తిరిగాడు.

"అయితే రేపే ఆ ప్రయత్నం చేస్తా"

"ఇంక వెళదాం"

"అప్పుడేనా"

"నాకోసం మానాన్న వెతుకుతాడు"

ఇంటికి రాగానే రమేష్ ఆలోచనలో పడ్డాడు. లక్ష్మీదేవమ్మ దగ్గరకు వెళ్ళి ఆమె పక్కలో కూర్చున్నాడు.

"నాయనమ్మా నాయనమ్మా నాట్యం నేర్చుకోవాలని ఉందే" అన్నాడు.

లక్ష్మీదేవమ్మ రమేష్ మొహంలోకి తేరిపారచూసి "నువ్వు ఆడపిల్లవా ఏమిట్రా" అంది.

"ఆడపిల్లలేనా ఏమిటి నాట్యం నేర్చుకొనేది. మగవాళ్ళు నేర్చుకోవడం లేదా నాయనమ్మా, నాయనమ్మా, ప్లీజ్ నాకీ సాయం చేసిపెట్టవే చచ్చి నీ కడుపున పుడతాను"

"ఛ ఛ ఏమిట్రా ఆ మాటలు. నువ్వు చావడం ఏమిట్రా పిచ్చి సన్నాసి. నేను చచ్చి నీ కడుపున పుట్టాలగాని" లక్ష్మీదేవమ్మ రమేష్ గడ్డం పుచ్చుకొని నిమిరింది.

"అయితే నాట్యం నేర్చుకొంటానంటుంటే నువ్వు..."

"మీ నాన్నకు తెలిస్తే కోప్పడుతాడురా... వాడు అసలే వెర్రిమొర్రోడు. ఎందుకైనా మంచిది ఒకసారి మీ నాన్నని అడిగి చూడు"

"నేనా! నాకు ఆయనతో మాట్లాడే ధైర్యం ఉంటే నీదాకా వస్తానంటే. ఆ పనేదో నువ్వే చేసిపెట్టు. ప్లీజ్... నాయనమ్మా. ఇంత బతిమాలించుకొంటావా" రమేష్ గోముగా అడుగుతుంటే లక్ష్మీదేవమ్మ మనసు కరిగిపోయింది.

"అయితే ఉండు. మీ అమ్మతో మాట్లాడుత" అంటూ లేచి సుశీలమ్మదగ్గరికి వెళ్ళింది.

★ ★ ★

సుశీలమ్మ మంటపంలో అడుగు పెడుతూనే శివరామశాస్త్రికి నమస్కరించింది.

అప్పుడు శివరామశాస్త్రి అమృతకి నాట్యభంగిమలు నేర్పుతున్నాడు. సుశీలమ్మకి ప్రతినమస్కారం చేస్తూ "రామ్మా" అంటూ పిలిచాడు.

ఆమె వెనక రమేష్ ఉన్నాడు. అమృతని చూశాడు. అమృత కళ్ళెగరేసి చిరునవ్వు నవ్వింది.

సుశీలమ్మ చేతిలో పళ్ళూ, పూలు ఉన్న బుట్టను చూశాడు శివరామశాస్త్రి. పూజచేయించడానికి వచ్చారనుకొని ఆయన గుడిలోకి వెళ్ళబోతుంటే "అన్నయ్యగారు" అని పిలిచింది సుశీలమ్మ.

శివరామశాస్త్రి ఆగి "పూజ అబ్బాయి పేరుతోనేగా" అన్నాడు.

"పూజకాదు" అంది సుశీలమ్మ.

"మరి? "

"పూజలాంటిదే"

శివరామశాస్త్రికి అర్థంకాలేదు.

సుశీలమ్మ బుట్టలోంచి పూలూ, పళ్ళూ తీసి శివరామశాస్త్రి పాదాలముందు ఉంచింది. అయోమయంగా ఉంది ఆయనకి.

"ఏమిటమ్మా? "

"అబ్బాయికి నాట్యం నేర్చుకోవాలని ఉందట" అలా సుశీలమ్మ అంటుండగా రమేష్ వచ్చి శివరామశాస్త్రి పాదాలకి నమస్కరించాడు.

శివరామశాస్త్రికి సంతోషం అయింది.

"ఏమయ్యా రమేష్ ఇప్పుడు కలిగిందా నీకీఆలోచన" అని అడిగాడు రమేష్‌ని.

రమేష్ మౌనంగా ఉండిపోయాడు.

"ఈ వయసులో నాట్యం నేర్చుకోగలవా"

"నేర్చుకొంటాను అంకుల్"

"వళ్ళంతా డస్సిపోతుంది. తట్టుకోగలవా"

రమేష్ తల ఊపాడు. 'ఆc' అన్నట్టు.

"అయితే ఇలారా" అంటూ రమేష్‌ని పిలిచి తను కూర్చున్నాడు.

"పాతిక గుంజిళ్ళు తియ్యి"

రమేష్ బుద్ధిమంతుడిలా పాతిక గుంజిళ్ళు తీశాడు.

"ఎలా ఉందిప్పుడు" అడిగాడు శివరామశాస్త్రి.

"మోకాళ్ళ దగ్గర నరాలు జివ్వుమంటున్నాయి. అయినా ఫరవాలేదంకుల్. రోజూ ప్రాక్టీస్ చేస్తే అలవాటైపోతుంది. నొప్పులుండవు"

"ఇప్పుడిట్లాగే అంటావు. రెండురోజులు వస్తావు. మూడోరోజు కనబడ్డం మానేస్తావు"

"లేదంకుల్ తప్పకుండా వస్తాను"

"అయితే పాఠం ప్రారంభిస్తా" అంటూ శివరామశాస్త్రి లేచాడు. హస్త విన్యాసం చేస్తూ పాదాలు కదపసాగాడు.

ఆ వయసులో శివరామశాస్త్రి ఆ విధంగా భంగిమలు ప్రదర్శిస్తుంటే సుశీలమ్మకి వింతగా ఉంది.



"నాయనమ్మోయ్ నాయనమ్మా" అంటూ వచ్చి ఎగిరి గంతేసి లక్ష్మీదేవమ్మను పట్టుకొని గిరగిరా తిప్పసాగాడు రమేష్.

"ఏమిట్రా! ఏమయింది. నేను పడిపోతాను" లక్ష్మీదేవమ్మకి రమేష్ అలా ఎందుకన్నాడో అర్థంకాలేదు.

ఆమెను వదిలేశాడు.

వెంటనే-

"తై- తద్దిత్ తై

తద్దిత్- తద్దిత్- తద్దిత్ తై

తైతైతైతై- తద్దిత్‌తై

తకధిమి- తకధిమి- తద్దిమితక్

తైతైతైతై- తద్దిత్ తై"

చేతులు తిప్పుతూ లయబద్ధంగా అడుగులు కదుపుతూ నాట్యం ప్రారంభించాడు.

రమేష్ నాట్యం చేస్తుంటే లక్ష్మీదేవమ్మ బుగ్గన వేలేసుకొని వింతగా చూడసాగింది. ఆమె అలా చూసేకొద్దీ రమేష్‌లో ఉత్సాహం పొంగిపోయింది.

"తకధిమి- తకధిమి
నాయనమ్మ తకధిమి
తకధిమి ధిమితక
నాయనమ్మ నాయనమ్మ" అంటూ లక్ష్మీదేవమ్మ చుట్టూ నాట్యం చేస్తూ ఉంటే ఆమెకి ఆశ్చర్యంవేసింది.

"ఒరేయ్ రమేష్ అప్పుడే పట్టేశావు గదురా. శివరామశాస్త్రి కూతురు అమృత లాగే చేస్తున్నావుగా"

"అవునే... ఇంకా ముందుముందు చూడు ఎట్లా చేస్తానో"

"శివరామశాస్త్రికి నాట్యంలో మంచి పేరుందిరా. ఎక్కడెక్కడో ప్రదర్శనలు ఇచ్చాడు. శివతాండవంలో ఆయనకి పోటీ పడేవారు లేరు తెలుసా. ఎన్నో బహుమతులు గెలుచుకొన్నాడు"

"నాయనమ్మా! వర్ధనమ్మకి గూడా నాట్యం తెలుసటగా"

"తెలుసంటావేమిట్రా. శివరామశాస్త్రికి ఏమాత్రం తీసిపోదు. ఆ అన్నా చెల్లెళ్లు ఒకే గురువు దగ్గర నాట్యం నేర్చుకున్నారు. పరమేశ్వరశాస్త్రితో పెళ్ళి కావడంతో సంసారంలోపడి నాట్యంపట్ల మోజు తగ్గిపోయింది. లేకుంటే వర్ధనమ్మ వాళ్ళ అన్నయ్యకి మంచి పోటీ ఇచ్చేది"

"అయితే నాయనమ్మా నాకు నాట్యం వస్తుందంటావా"

"ఓ! బ్రహ్మాండంగా. ఒక్కరోజుకే ఇలా చేస్తున్నావంటే, ముందుముందు శివరామశాస్త్రిని మించిపోవూ"

"మా నాయనమ్మ మంచిది. బంగారు నాయనమ్మ" రమేష్ పొగిడేస్తుంటే లక్ష్మీదేవమ్మ పరవశించిపోసాగింది.

★ ★ ★

అమృత తోటలో పూలుకోస్తూ రమేష్ కోసం ఎదురుచూస్తూ ఉంది.

ఈమధ్య రమేష్, అమృత తోటలో కలుసుకుంటున్నారు. నాట్యం నేర్చుకొంటున్న కారణంగా రమేష్ రోజులో ఎక్కువ సేపు శివరామశాస్త్రి దగ్గరే ఉంటున్నాడు. ఒక్కోసారి శివరామశాస్త్రి నాట్యం పాఠం ప్రారంభిస్తే అమృత ఆ కొరవ పాఠాన్ని పూర్తిచేసేది. అప్పుడు రమేష్‌కి ఎక్కడలేని హుషారు వచ్చేది. ఒకరినొకరు ప్రేమగా ముద్దుముద్దుగా కవ్వించుకొంటూ నాట్యసాధన చేస్తూఉంటే కాలం ఎలా గడిచిపోయేదో తెలిసేది కాదు.

నాట్యసాధన ముగిసిన తరువాత ఒకర్ని విడిచి ఒకరు ఉండాలంటే వాళ్ళకి చాలా కష్టంగా ఉంది. అందుకని అప్పుడప్పుడు తోటలో కలుసుకొంటున్నారు. మత్తుగా, మధురంగా తమకంతో వకరివళ్ళో ఒకరు కబుర్లు చెప్పుకొంటూ కాలం గడపటం గమ్మత్తుగా ఉంది.

రమేష్ రాగానే ఇద్దరూ వెళ్ళి దూరంగా మందారం చెట్టుపక్కన కూర్చున్నారు.

అమృత రమేష్‌ని చూస్తూ ఉంది.

"చిన్నప్పుడు కూడా మనం కలిసి ఉండే వాళ్ళం" అంది.

"మధ్యలో విడిపోయాంగా"

"ఇప్పుడు మళ్ళీ దగ్గరయ్యాంగా"

"ఇలాగే ఉండిపోవాలి మనం"

"అంటే ఒకర్ని ఒకరు చూసుకొంటూనా? "

"కాదు... ఒకరిలో ఒకరై కలిసిపోవాలి"

"చింతలమ్మకి మొక్కుకొన్నాంగా"

"ఆ తల్లికి ఎప్పుడు దయగల్గుతుందో"

రమేష్ వళ్ళో వాలిపోయింది అమృత. ఆమె మీదికి వంగి పచ్చటి పొట్టమీద పెదాలను ఆనించి నాభిచుట్టూ అటూ ఇటూ రాస్తున్నాడు రమేష్.

కాలం కరిగిపోతూ ఉంది.

"అమృతా..."

పిడుగుపడ్డట్టు ఉలిక్కిపడ్డారు.

ఎదురుగా శివరామశాస్త్రి నిలబడి ఉన్నాడు. అమృతా, రమేష్ లేచి నేరస్తుల్లా తలవంచుకొని నిలబడ్డారు.

"వెళ్ళండి" అన్నాడు శివరామశాస్త్రి గంభీరంగా.

భయభయంగా దొరికిన దొంగల్లా కదిలి వెళ్ళిపోయారు.

★ ★ ★

పరమేశ్వరశాస్త్రిగారి ఇంట్లో వాతావరణం గంభీరంగా మారిపోయి ఉంది.

నట్టింట్లో ఉన్న ఉయ్యాల బల్లమీద మధ్యలో బాసింపీట వేసుకొని ఉన్నాడు పరమేశ్వరశాస్త్రి. వాకిట్లో చాపవేసుకొని వర్ధనమ్మ గోడకి ఆనుకొని కూర్చొని ఉంది. ఆమె మొహంలో దిగులు, ఆందోళనా బాగా కనిపిస్తున్నాయి. ఆమె వళ్ళో సునీత తల వాల్చుకొని ఉంది.

ఉయ్యాల బల్లమీదనుండి దిగి రెండడుగులు వేశాడు పరమేశ్వరశాస్త్రి.

"ఎక్కడికండీ" అని అడిగింది వర్ధనమ్మ కాస్త తలపైకెత్తి.

"ఏట్లోకి" కోపంగా అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"ఎందుకండీ అంతకోపం"

"కోపంకాదే, బాధ. మా అన్నయ్యా మా అన్నయ్యా అని తెగ గొప్పలు చెప్పుకొంటున్నావుగా. ఇప్పుడు ఏడువు. తెలిసిందా మీ అన్నయ్య ఎంతమంచివాడో"

వర్ధనమ్మ కళ్ళలో నీళ్ళు తిరిగి బుగ్గలమీదికి జారాయి. పరమేశ్వరశాస్త్రి కోపం చల్లారింది.

"ఛ! ఎందుకే ఏడుస్తావు. ఇప్పుడు ఏం జరిగిందని. చూడు మీ అన్నయ్య అనుకొన్నట్టు ఏమీ జరగదు. అంతా నువ్వు అనుకొన్నట్టే జరుగుతుంది"

వర్ధనమ్మ మొహంలో వెలుగు రేఖ మెరిసింది. కన్నీళ్ళు తుడుచుకొని "నిజంగానా" అని అంది.

"అవును నిజంగానే. నువ్వు అనుకొన్నట్టే జరిగి తీరుతుంది"

ఆమెలో ఆనందం ఉబికింది. వళ్లో ఉన్న సునీత తలని పైకి తీసేసి వంటింట్లోకి వెళ్ళింది.

ఆ సమయంలో-

చంద్రశేఖర్ లేడు. కాకినాడ వెళ్ళి ఉన్నాడు. ఉంటే అతని మనసెంత అవమానంతో కృంగిపోయేదో.

★ ★ ★

రమేష్...

ఏటి ఒడ్డున ఉన్న తాటిచెట్టు మొదట్లో కూర్చుని దీనంగా ఆలోచిస్తున్నాడు. తన్ను తాను తిట్టుకున్నాడు. శివరామశాస్త్రి మీద పళ్ళు నూరుతున్నాడు.

ఏదో ఆవేశం

ఏమో చేయాలని

పిడికిలి నిండా ఇసుక తీసుకొని నేలకేసి బాదాడు. అక్కడ ఉండబుద్ధికాలేదు. లేచి ఏటికి అవతల ఉన్న కొండల్లోకి వెళ్ళాడు. ఏటవాలు బండమీద పడుకొని ఆలోచిస్తున్నాడు. అప్రయత్నంగా చేతిలోకి రాయిని తీసుకొని కొండకేసి విసురుగా విసిరాడు. రాయి ముక్కలయింది.

నేరుగా ఇంటికి వచ్చి డాబామీద ఉన్న గదిలోకి వెళ్ళాడు. లక్ష్మీదేవమ్మ వచ్చి రమేష్ పక్కన కూర్చొంది.

"ఏరా రమేష్ శివరామశాస్త్రి కూతురు అమృతమ్మకి పెళ్ళిచూపులట. నిజమేనా" అని అడిగింది.

"నాకేం తెలుసు పెళ్ళిచూపులో గిళ్ళిచూపులో" విసురుగా అన్నాడు రమేష్.

"అదేంరా! నీకు తెలియదా వాళ్ళు చెప్పలా? ఎప్పుడూ అక్కడే ఉంటుంటివిగా"

"ఉంటుంటే నాకు చెప్తారా ఏంటి! వాళ్ళె





వరు మనం ఎవరు? మనకీ వాళ్ళకీ సంబంధం ఏంటి? "

"అదికాదులేరా. ఊళ్ళో అంటుంటేను నీకే మన్నా తెలిసి ఉంటుందేమోనని అడిగానులే. హైదరాబాదు సంబంధమట. అబ్బాయి ఉద్యోగం చేస్తున్నాడుట"

రమేష్‌కి గొంతు పిసుకుతున్నట్టుంది. లక్ష్మీదేవమ్మ లేచి వెళ్ళబోతుంటే రమేష్ కళ్ళలో నీళ్ళు పెల్లుబికి వచ్చేశాయి.

చెవుల్లో సన్నాయిమేళం.

పెళ్ళిమంటపంలో శివరామశాస్త్రి, శారదమ్మల మధ్య అమృత.

ఆమె నుదుట కళ్యాణతిలకం, బుగ్గన చుక్క.

పెళ్ళికొడుకు అమృత మెడలో తాళి కడుతుంటే 'ఆగు' అని అరవబోయి ఆగిపోయాడు.

"ఏమిట్రా ఏమయింది" అని అడిగింది లక్ష్మీదేవమ్మ.

"ఏమీకాలేదులేవే"

"అయితే నీకో శుభవార్త చెప్పనా"

శుభవార్తా. ఏమిటే? "

# ఏరిన ముత్యాలు

* తన జ్ఞాపకాలతో జీవించే వ్యక్తి వృద్ధుడవుతాడు. భవిష్యత్ ప్రణాళికలతో జీవించే వ్యక్తి యువకుడుగా ఉంటాడు.

–డా. బి.ఆర్. అంబేద్కర్

* మాట్లాడేటప్పుడు ప్రజల భాషలో మాట్లాడాలి. ఆలోచిస్తున్నప్పుడు మాత్రం మేధావుల ఒరవడిని అనుసరించాలి.

–అరిస్టాటిల్

* నిజమైన స్నేహితుడు మనసు విప్పి మాట్లాడుతాడు. చక్కని సలహానిస్తాడు. కష్టాల్లో ఆదుకుంటాడు.

–విలియన్ పెన్

* పాతలో ఉన్న మంచిని ఆధారం చేసుకొని చెడును విసర్జిస్తూ ముందుకు సాగి పోవడం ఉత్తమ మానవుని లక్ష్యం.

–కారల్‌మార్క్స్

* సరిదిద్దకుండా వదిలేసిన తప్పును మించిన ఆపద ఇంకొకటి లేదు.

–స్వామి వివేకానంద

* పుస్తకాలు దీపాలవంటివి. వాటి వెలుతురు మనలోని మాలిన్యం అనే చీకటిని తొలగిస్తుంది.

డా॥ బి.ఆర్. అంబేద్కర్

* ప్రతీ ఒక్కరూ మానవాళిని మార్చాలనే ఆలోచిస్తారుగానీ తమను తాము మార్చుకోవడం ,గురించి ఆలోచించరు.

–లియోటాల్‌స్టాయి

* జీవితం అంటే ఒక సమస్యనుంచి మరొక సమస్యకు ప్రయాణం మాత్రమే! ఏ సమస్యాలేని జీవితం అంటూ ఉండదు.

–గౌతమబుద్ధుడు

* నీ ప్రతీమాటను, చర్యను పొగిడేవారినికాక నీ పొరపాట్లను హెచ్చరించే వారి గురించి ఆలోచించు.

–సోక్రటీస్

* వివేకశూన్యుడైన మిత్రుడు వివేకవంతుడైన శత్రువుకంటే ప్రమాదం.

– షేక్స్‌పియర్

* ఆవేశాన్ని, అహంభావాన్నీ, వంచనా దృష్టిని జయించలేనివాడే కట్టుబానిస.

–మహావీరుడు

* నా మతం సైన్సు. జీవితాంతం నేను దానినే ఆరాధిస్తాను. పూజిస్తాను.

–సి.వి. రామన్

సేకరణ : కూనపల్లి మల్లేశ్వరరావు

"నీకు పెళ్ళి"

"ఆ...!"

"అవునురా. మీ నాన్న చెప్పాడు. సీతారాంపురం మునసబుగారి అమ్మాయితో. అన్నీ మాట్లాడుకున్నారట. తొందర్లో వచ్చి వాళ్ళు ముహూర్తాలు పెట్టుకుంటారట..... ఒరేయ్ రమేష్ నువ్వు అమ్మాయిని చూడకుండా ఒప్పేసుకోకు. అందంగా ఉంటేనే చేసుకో లేకుంటే వద్దు. సరేనా... ఎందుకైనా మంచిది. ఒకసారి మీ అత్తయ్య కూతురు స్వాతిని కూడా చూడు. అంటే దాన్ని చేసుకోమని నేను చెప్పడంలేదు. ఏదైనా నీ ఇష్టమే. నీ యిష్టం లేకుండా మాత్రం పెళ్ళి చేసుకోవద్దు"

రమేష్‌కి ఆమె ఏం చెప్తోందో బుర్రలోకెక్కడంలేదు.

★ ★ ★

"నమస్కారమండీ పరమేశ్వరశాస్త్రిగారూ"

వాలుకుర్చీలో పంచాంగాలు తిరగేస్తున్న పరమేశ్వరశాస్త్రి 'ఈ గొంతు ఎప్పుడో విన్నట్టుందే' అనుకుని తలపైకెత్తి చూశాడు.

ఎదురుగా పట్టుపంచ కట్టుకొని, లాల్చీ తొడుక్కుని ఉన్నాడు ఓ వ్యక్తి. భుజాన పేటంచు పైపంచ వేలాడుతోంది. నుదుట తెల్లటిబొట్టు.

'ఎవరా' అన్నట్టు ఆ వచ్చిన వ్యక్తిని చూడసాగాడు పరమేశ్వరశాస్త్రి.

"మర్చిపోయారా. నేనండీ. పేరిశాస్త్రిని. హైదరాబాదులో దేవరాజు గారితో మిమ్మల్ని కలిశాను"

అప్పుడు గుర్తుకు వచ్చాడు పరమేశ్వరశాస్త్రికి పేరిశాస్త్రి.

"ఓ... మీరా! రండి. కూర్చోండి. హైదరాబాదులో మీ వేషధారణకీ, ఇప్పుడు మీరున్న తీరుకీ చాలా తేడా ఉంది. అందుకనే గుర్తించలేకపోయాను. ఏమీ అనుకోకండి. అవునూ ఏమిటీ మావూరొచ్చారు? " అని అడిగాడు పరమేశ్వరశాస్త్రి.

బయట ఎవరిదో కొత్తగొంతు వినబడడంతో ఇంట్లోంచి వర్ధనమ్మ అక్కడికి వచ్చింది.

"ఇది మీ వూరేకాదండోయ్. మాకూ ఈ ఊరితో బంధం కలవబోతోంది. మీ బావమరిది గారింటికి వచ్చాను. వాళ్ళ అమ్మాయి అమృతని మా అబ్బాయికి మాట్లాడుదామని వచ్చాను" అని చెప్పాడు పేరిశాస్త్రి.

"మీ అబ్బాయి ఏం చేస్తుంటాడండి? " అని వర్ధనమ్మ అడిగింది.

"బ్యాంక్ ఉద్యోగం. నెలకు ఆరువేలపైన వస్తుంది" గర్వంగా చెప్పాడు.

"అమ్మాయి నచ్చిందాండీ? "

"అమ్మాయికేం... ఏ వన్"

"అబ్బాయికి అమ్మాయి నచ్చిందా? "

"అబ్బాయిని తీసుకురాలేదండీ. నేను ఒక్కడినే వచ్చాను. నేను చూసి ఓకే అంటే అబ్బాయి, వాళ్ళ అమ్మ వచ్చి చూస్తారు"

"కట్నకానుకలు మాట్లాడుకున్నారా? "

"లేదండీ. వాటికేమీ లోటు ఉండదనుకుంటాను. అయినా శివరామశాస్త్రిగారికి ఒక్కర్తే కూతురుగదా"

వర్ధనమ్మలో అసహనం తన్నుకొచ్చింది.

"అవున్లెండి. అన్నీ సవ్యంగానే జరుగుతాయి" ఆమె మాటల్లో వ్యంగ్యం ఉంది.

పరమేశ్వరశాస్త్రి పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. వర్ధనమ్మ లేచి విసురుగా ఇంట్లోకి వెళ్ళిపోయింది. పేరిశాస్త్రికి మంచినీళ్ళయినా ఇవ్వాలని ఆమెకి అనిపించలేదు.

"దేవరాజుగారి ఇండస్ట్రీ పనులు ఎంతవరకు వచ్చాయి? " అని అడిగాడు పరమేశ్వరశాస్త్రి.

"ఆరోజు మీరు చెప్పారుగా అట్లాగే జరగింది. పునాదులతోటే ఆగిపోయింది"

పరమేశ్వరశాస్త్రి ముఖం విప్పారింది. ఏదో గర్వం కూడా ఆయనలో కాస్త తలెత్తింది.

"ఏమయిందేమిటి? " అని అడిగాడు.

"ఆ స్థలం ఒకరిదైతే మరొకడు డబ్బు

తీసుకుని రిజిష్టర్ చేశాడు. స్వంతదారుడు వచ్చి అడ్డు తగిలాడు. డబ్బు తీసుకున్న వాడు పత్తాలేకుండా పోయాడు" అని చెప్పాడు పేరిశాస్త్రి.

"దేవరాజుగారి జాతకంలోనే ఉంది ఈ సంవత్సరం ఆయనకి ఏదీ కలిసిరాదు. పైగా అధికవ్యయం అవుతుంది కూడా"

"అట్లాగే జరిగింది. లక్షలు పెట్టుబడి పెట్టాడు. పని ఆగిపోయింది. జ్యోతిష్యశాస్త్రంలో మీ పరిజ్ఞానం ప్రశంశనీయమైనది. మొదట్లో మిమ్మల్ని మేం చాలా తక్కువగా అంచనా వేశాం. నైనిటాల్ లో మిమ్మల్ని గురించి చాలా గొప్పగా చెప్పుకున్నారటగదా"

"మీకు ఎవరు చెప్పారు"

"వరదాచార్యులని మా బావగారి మేనమావగారులేండి. ఆయన మంచి పంచాంగకర్త. నైనిటాల్ లో మిమ్మల్ని కలిశాడట"

"ఓ! వారా...! విశాఖపట్నంగదా వాళ్ళది"

"అవునండీ ఆయనే"

పరమేశ్వరశాస్త్రి పేరిశాస్త్రి గారితో మాట్లాడుతూనే ఇంట్లో వర్ధనమ్మని గురించి ఆలోచిస్తున్నాడు. అమృత పెళ్ళి విషయంలో శివరామశాస్త్రి తీసుకున్న నిర్ణయం వర్ధనమ్మకి గొడ్డలిపెట్టయ్యింది.

తన కొడుక్కి భార్య కావలసిన అమృత మరొకడికి భార్య కాబోతోందని తెలిసి ఆమె ప్రాణం విలవిలలాడుతోంది.

పేరిశాస్త్రి వెళ్ళిపోగానే పరమేశ్వరశాస్త్రి లేచి ఇంట్లోకి వెళ్ళి వర్ధనమ్మ పక్కన కూర్చున్నాడు. భర్త రావడంతో ఆమె గంభీరంగా మారిపోయింది. పరమేశ్వరశాస్త్రి వర్ధనమ్మ భుజంమీద చెయ్యివేసి దగ్గరగా తీసుకున్నాడు.

ఆమె గంభీరం ఏమయ్యిందో కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఏమండీ. మా అన్నయ్య మంచివాడు కాదండి" అంది.

"అలా ఎందుకు అనుకోవాలి. మీ అన్నయ్య ఏ ఉద్దేశంతో ఇలా చేస్తున్నాడో"

"మీకు జ్యోతిష్యం తెలుసుగదా" భర్తముఖంలోకి చూస్తూ అడిగింది వర్ధనమ్మ.

"ఆ... తెలుసు"

"అయితే ఈ పెళ్ళి జరుగుతుందా?"

"జరగదు"

వర్ధనమ్మకి ఆనందం కలిగింది.

"నిజంగానా?"

"నిజంగానే చెప్తున్నా. పేరిశాస్త్రిగారి అబ్బాయితో అమృతకి పెళ్ళి జరగదు"

"చాలు. ఆ మాట చాలు. నేనిప్పుడే ఆ తిరుపతి వెంకటేశ్వరస్వామికి మొక్కుకున్నా. ఒకసారి తిరుపతి పోయి వద్దామండీ"

"తొందరపడకు. అన్నిటికీ సమయం, సందర్భం వస్తుంది" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

★ ★ ★

ఆ రాత్రి పరమేశ్వరశాస్త్రికి నిద్రపట్టలేదు. శివరామశాస్త్రిని గురించి ఆలోచిస్తున్నాడు.

మాటవరసకైనా అమృత పెళ్ళిచూపుల విషయం చెప్పకపోవడంలో ఆయన ఉద్దేశ్యం ఏమై ఉంటుంది.

అన్నీ తెలిసినవాడు, అందరికీ సలహాలిచ్చేవాడూ, సభ్యత, సంస్కారం కలవాడు ఇలా ఎందుకు చేశాడు.

తను నైనిటాల్ వెళ్ళి వచ్చిన దగ్గరనుంచీ అమృత ఇంటికి రావడం తగ్గించేసింది కూడా.

"నాకు నిద్రరావడం లేదండీ" ఎప్పుడు వచ్చిందో వర్ధనమ్మ పరమేశ్వరశాస్త్రి పక్కమీద కూర్చుని ఉంది.

ఆమె భుజంమీద చెయ్యివేసి దగ్గరగా తీసుకున్నాడు పరమేశ్వరశాస్త్రి. చిన్నపిల్లలా వర్ధనమ్మ ఆయన గుండెలమీద తలవాల్చింది.

"జరిగేది ఎప్పుడూ జరక్కమానదు. మన పని అల్లా చూస్తూ ధైర్యంగా ఉండటమే" అన్నాడు.

"నాకు పిచ్చి పట్టేట్టుగా ఉంది"

"మనసుని ప్రశాంత పరచుకుంటే ఏమీ కాదు"

"మీలా నేను ఉండలేనండీ"

"ఉండక చెయ్యగలిగిందేమన్నా ఉందా?"

"అమృత అంటే నాకు ప్రాణమండీ"

"నాకు మాత్రం లేదా దానిమీద ప్రేమ. చిన్నప్పటినుండీ నా గుండెలమీద పెంచాను. వాళ్ళ అమ్మానాన్న దగ్గర కన్నా నా దగ్గరే దానికి చనువు ఎక్కువ. ఎక్కడ కన్నా వెళితే దానికి ఏదన్నా తేవాలనుకుంటాను"

"అయితే అమృత జాతకంలో ఏం ఉంది. మన చంద్రానికీ, దానికీ పెళ్ళి అవుతుందా?"

పరమేశ్వరశాస్త్రి నోట మాట రాలేదు.

"ఏం... మాట్లాడరు"

"నీకు జాతకాలమీద నమ్మకంలేదుగా"

"ఉంది చెప్పండి..."

"అయితే అవుతుందిలే"

"మీ మాటల్లో ఆంతర్యం నాకు అర్థంకావడంలేదు. సూటిగా చెప్పండి?"

"సూటిగానే చెప్తున్నా పెళ్ళి అవుతుంది సరేనా"

వర్ధనమ్మ కాస్త ముందుకు జరిగి పరమేశ్వరశాస్త్రికి చెంపమీద తన చెంపని ఆనించింది. పరమేశ్వరశాస్త్రి ఆమె చెంపపై చెయ్యివేసి నిమిరాడు.

★ ★ ★

ఏటిఒడ్డున చింతతోపు కోడిపుంజుల పందేలతో కోలాహలంగా ఉంది.

అగ్రహారంలో కోడిపందాలు అంటే ఒక తిరునాళ్ళంత సంబరంగా ఉంటుంది. కేవలం ఆ వూరివాళ్ళే కాక చుట్టుపక్కల ఊళ్ళవాళ్ళు కూడా ఆ పందాలలో పాల్గొంటారు. ఆ సమయంలో వాళ్ళకి అంతస్తుల తేడాలు గుర్తుకురావు. పందెం వేయడానికి పుంజుల్ని తెచ్చేవాళ్ళు, పై పందాలు కాసే వాళ్ళు అందరూ అక్కడ చేరతారు.

రంగారావు తన కోడిపుంజుని తీసుకొచ్చి అక్కడ చెట్టుమొదట్లో కట్టేశాడు. ఆయన పుంజుమీద పందెం వేయడానికి ఎవ్వరూ ముందుకు రారు. తన పుంజు ఓడిపోతుందని అనుకుంటే ఆయన ఏదో గొడవ లేవదీస్తాడు. ఆ గొడవ పెద్దదై కొట్లాటకు కూడా దారితీస్తుంది.

అందుకనే లక్ష్మీదేవమ్మ రంగారావుని కోడి పందాలకి దూరంగా ఉంచడానికి ఎంతగానో ప్రయత్నించింది. కానీ ఆమె ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరే.

మృదుల మరణంతో రంగారావు తన భర్త అనే విషయం మర్చిపోయింది సుశీలమ్మ. దైవం తనకు అన్యాయం చేశాడని ఏడ్చి అంతా తన పూర్వజన్మ ఫలితం అనుకునేది. మనశ్శాంతికోసం శివాలయం వెళ్ళి మంటపంలో కూర్చుని గర్భగుడిలోకి చూస్తూ ఉండిపోయేది. శివరామశాస్త్రిని అన్నయ్యగా భావించి తన మనసులోని బాధను చెప్పుకునేది. ఆమెలో గూడు కట్టుకుని ఉన్న దుఃఖాన్ని చూసి శివరామశాస్త్రి చలించిపోయేవాడు. రంగారావు చేతిలో సుశీలమ్మ జీవితం ఎప్పుడో అర్థాంతరంగా ముగిసిపోతుంది అనే ఆలోచన కలిగి ఆమెకి ధైర్యం చెప్పేవాడు శివరామశాస్త్రి. ఆయన మాటలు సుశీలమ్మకి మనశ్శాంతిని చ్చేవి.

రంగారావు కళ్ళముందు తిరుగుతుంటే ఆమెకి మానవమృగం గుర్తుకువస్తుంది.

ఆయనకి ఓటమిని అంగీకరించడం అంటే మహాచికాకు. తనకు ఎదురు చెప్పిన వాడు బతికి ఉండటం సహించలేడు.

★ ★ ★

శివరామశాస్త్రి పంచలో కూర్చొని ఉన్నాడు.

"ముహూర్తాలు కూడా దగ్గరపడుతున్నాయి" అంటూ వచ్చి శారదమ్మ గుమ్మంలో కూర్చుంది.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. పేరిశాస్త్రి

గారి నుండి ఉత్తరం రావాలి" చెప్పాడు శివరామశాస్త్రి.

"ఆయన వచ్చిపోయి కూడా పదిరోజులు దాటింది. వెళ్ళగానే రాస్తానన్నాడు"

"అవును. రాస్తానన్నాడు. ఎందుకు ఆలస్యం అయిందో. ఆయన కూడా వచ్చే ముహూర్తానికి పెళ్ళి చెయ్యాలనే ఉన్నాడు"

"ఎందుకైనా మంచిది మీరే ఓ ఉత్తరం రాసెయ్యండి"

"తొందరపడటం మంచిదికాదు. ఒకేసారి భార్యనీ, కొడుకునీ వెంటబెట్టుకుని వచ్చేస్తాడేమో"

"అలా అయితే మంచిదే. ఇంట్లో ఏమన్నా ఆటంకాలు కలిగాయేమో"

"ఆ విషయం అయినా తెలియచెయ్యవచ్చుగా"

"పొద్దున్నే కాకి వాకిట్లో అరిచిపోయిందండీ"

"కాకులు అరవందెపుడు? అవి ఎప్పుడూ అరుస్తూనే ఉంటాయి. అరిచినప్పుడల్లా చుట్టాలు వస్తారనుకోకు..."

"నాకెందుకో ఈరోజు ఏదో ఒక కబురు వస్తుందని అనిపిస్తోందండి. చుట్టాలు రావచ్చు లెటరు రావచ్చు"

"వస్తే మంచిదే... ముందు నువ్వు ఏటికి వెళ్ళి నీళ్ళు తీసుకురా. అభిషేకానికి వేళవుతోంది" చెప్పాడు శివరామశాస్త్రి.

శారదమ్మ లేచి బిందె తీసుకొని ఏటికి వెళ్ళింది.

ఆమె తిరిగి వచ్చేసరికి శివరామశాస్త్రి గుడిలో ఉన్నాడు. "కాకి కబురు తెచ్చింది" అన్నాడు.

"ఏమిటీ. ఉత్తరం వచ్చిందా? " శారదమ్మలో ఉత్సాహం, ఆతృత.

"నువ్వటు వెళ్ళగానే వచ్చింది"

"ఏమిటి సంగతులు"

"దక్షిణం తిరిగి దణ్ణం పెట్టాడు"

"అదేం. ఏం జరిగిందేమిటి"

"వాళ్ళబ్బాయి బాగా చదువుకున్న అమ్మాయిని చేసుకోవాలని అనుకుంటున్నాడట"

శారదమ్మని నీరసం ఆవహించింది.

శివరామశాస్త్రి ఆలోచనలో పడిపోయాడు.

★ ★ ★

"అసలు విషయం అదికాదమ్మా" చెప్పాడు రమేష్.

"మరి? "

"అమృతకి ఈ పెళ్ళి ఇష్టంలేదు"

"ఎందుకని" సుశీలమ్మ ఆశ్చర్యంగా అడిగింది.

"అమృతకి నేనంటే ఇష్టం. నాకూ అమృత అంటే ఇష్టం. మేమిద్దరం ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకుందామని అనుకున్నాం. అందుకని..."

"అందుకని..."

"హైదరాబాదు పేరిశాస్త్రిగారికి నేనే లెటర్ రాశాను"

"లెటర్ రాశావా? "

"అవునమ్మా. ఆకాశరామన్న పేరుతో రాశాను. ఇక్కడ అమృత ఒక అబ్బాయిని ప్రేమించింది. వాళ్ళిద్దరూ పెళ్లి చేసుకోబోతున్నారు. మీరు వేరే సంబంధం చూసుకోవడం మంచిది అని రాశాను"

సుశీలమ్మకి బాధనిపించింది.

"తప్పు చేశావయ్యా" అంది.

"లేదమ్మా. ఈ పెళ్ళి జరగకూడదు. జరిగితే అమృత బతకదు. ఆమె లేకపోతే నేనూ బతకను"

"అదేమిట్రా"

"అవునమ్మా. నీకు నిజం చెప్తున్నాను. నన్ను గురించి ఆలోచించేది, నా సుఖం కోరుకునేది నువ్వు ఒక్కదానివే. అందుకే చెప్తున్నానమ్మా. అమృతకీ నాకూ పెళ్ళిచేసే బాధ్యత నీది" అన్నాడు రమేష్.

సుశీలమ్మ రమేష్ ముఖంలోకి చూస్తూ అతనిని దగ్గరకు తీసుకొని, హృదయానికి హత్తుకుంది.

"అలాగే తండ్రీ! నీకూ, అమృతకీ తప్పక

పెళ్ళిచేస్తాను" ధైర్యంగా చెప్పింది.
రమేష్ సంతోషంగా వెళ్ళిపోయాడు.
సుశీలమ్మ ఆలోచించసాగింది.
ఆలోచించేకొద్దీ ఆమెలో ఆందోళన... భయం...!
కాలం ఎటువైపు నడిపిస్తుందో? అని!
మృదుల గుర్తుకు వచ్చింది.
రమేష్ పెళ్ళి విషయంలో రంగారావు సీతారాంపురం మునసబుగారి సంబంధాన్ని ఖాయపరిచాడు. ఇప్పుడు తను అమృతతో పెళ్ళి జరిపించడం జరుగుతుందా.
పైశాచిక ప్రవృత్తిగల ఆయనకి ప్రేమ అంటే తెలుసా?
తన ప్రయత్నం ఫలిస్తుందా...?
పెళ్లి విషయంలోనే మృదుల జీవితం అర్థాంతరంగా ముగిసింది. రమేష్ పెళ్లి సమస్యగా మారేట్టుగా ఉంది.
రమేష్ పూర్ణాయుష్కుడని పరమేశ్వర శాస్త్రి చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి.
ఆమెలో ఏదో ధైర్యం ప్రవేశించింది.
లక్ష్మీదేవమ్మ దగ్గరకు వెళ్లి ఆమెకి ఎదురుగా కూర్చుంది.
"అత్తయ్యా" అని పిల్చింది.
లక్ష్మీదేవమ్మకు ఆశ్చర్యం కలిగింది. సుశీలమ్మ ఆ ఇంటికి కోడలుగా వచ్చిన తరువాత ఆమె లక్ష్మీదేవమ్మకు అలా ఎదురుగా కూర్చోవడం అదే మొదటిసారి.
"ఏమ్మా" అని అడిగింది లక్ష్మీదేవమ్మ సంతోషంగా.
"నాదో కోరిక. తీరుస్తావా"
"చెప్పు తల్లీ"
రమేష్, అమృతల ప్రేమ విషయంచెప్పి "కూతుర్ని పోగొట్టుకున్నాను. కొడుకునన్నా బతికించుకొంటాను అత్తయ్యా" అంది.
ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి.
ఆమెను చూసిన లక్ష్మీదేవమ్మ హృదయం చలించింది.
అంతలోనే ఆలోచనలో పడిపోయింది. లక్ష్మీదేవమ్మ ఏం మాట్లాడుతుందోనని ఎదురుచూడసాగింది సుశీలమ్మ. ఆమె ఏం మాట్లాడాలో తెలియక మౌనంగా ఉండిపోయింది.
"ఏం అత్తయ్యా మాట్లాడవు" అని అడిగింది.
"రమేష్ పెళ్లి విషయంలో వాడు సీతారాంపురం సంబంధం ఖాయపరిచాడు గదమ్మా" అంది లక్ష్మీదేవమ్మ.
"ఆ సంబంధం రమేష్ చేసుకొనేట్టులేదు"
"అయితే ఏదో ప్రళయం జరగబోతోందన్నమాట"
"అందుకే అత్తయ్యా నిన్ను అర్థిస్తున్నాను"
"నన్ను ఏం చేయమంటావో చెప్పు తల్లీ"
"రమేష్ పెళ్లి అమృతతో జరిగేట్టు చూడు"
"నాకేదో భయంగా ఉందే. వాడు మొండివాడు. కోపిష్టివాడు. ఆలోచించేకొద్దీ నా మనసు కీడు శంకిస్తోంది"
"నన్ను అర్థం చేసుకో అత్తయ్యా"
"నాకూ హృదయం ఉందమ్మా! రమేష్ సుఖంకంటే నాకేం కావాలి"
"అయితే మీరు కాస్త నాకు అండగా ఉండండి అత్తయ్యా! అమృతతో రమేష్ పెళ్లి నేను చేస్తాను" అని లేచింది సుశీలమ్మ.
ఒక ఇత్తడి పళ్లెంలో పట్టు చీరె, రెండు రవిక ముక్కలు, ఆకు, వక్కలు, పసుపు, కుంకుమ ఉంచుకొని శివాలయానికి బయలుదేరింది.
వీధి గుమ్మంలో రంగారావు ఎదురైనాడు.
పందెంలో తన కోడిపుంజు ఓడిపోయి కోపంతో వున్నాడు. అతనిని చూసిన సుశీలమ్మకి క్షణకాలం గుండె ఝల్లుమన్నది. వెంటనే తేరుకొని వీధిలోకి నడిచింది.
అసలే కోపంతో ఉన్న రంగారావుకి ఆమె ప్రవర్తన భరింపరానిదయ్యింది. ఆవేశం తన్నుకొచ్చి ఇంట్లోకి ఉరికాడు.

* * *

సుశీలమ్మ శివాలయంలోకి అడుగుపెట్టింది.

మంటపంలో ఒక అంచున కూర్చుని ఉన్నాడు శివరామశాస్త్రి. ఆయనకి దగ్గరలో స్తంభానికి ఆనుకొని విచారంగా భర్త మొహంలోకి చూస్తూ ఉంది శారదమ్మ.

అమృత అదృష్టవంతురాలు. పెళ్లి అయి హైదరాబాదు వెళ్లిపోతుందని శివరామశాస్త్రి సంబరపడిపోయి దేవుడికి మనసులో ఎన్ని సార్లు దణ్ణం పెట్టుకొన్నాడో.

కానీ పేరిశాస్త్రి రాసిన ఉత్తరం మనస్తాపానికి గురిచేసింది.

అన్యమనస్కంగా గుళ్లో పూజ ముగించి వచ్చి కూర్చున్నాడు. మాటాపలుకూ లేకుండా మౌనంగా ఏదో ఆలోచిస్తూ గంభీరంగా ఉండిపోయాడు.

నిశ్శబ్దంగా ఉంది అక్కడి వాతావరణం.

"అన్నయ్యగారూ"

సుశీలమ్మ పిలుపుతో శారదమ్మ, శివరామశాస్త్రి ఈ లోకానికి వచ్చారు.

అప్పుడు సుశీలమ్మ వాళ్లకి ఎదురుగా మంటపం కింద పళ్లెం పట్టుకొని నిలబడి వుంది. ఏదో మాట్లాడడానికి ప్రయత్నిస్తున్నట్టు ఉంది. కానీ మాట్లాడలేకపోతోంది. శివరామశాస్త్రీ, శారదమ్మా ఒకరి మొహం ఒకరు చూసుకొన్నారు. తర్వాత ఇద్దరూలేచి మంటపందిగి ఆమె దగ్గరికి వచ్చారు.

అంతే... సుశీలమ్మ చేతిలోని పళ్లెం గాల్లోకి ఎగిరిపోయింది.

ఏమయిందో ఎవరికీ అర్థం కాలేదు. తేరుకొనేసరికి ఎదురుగా రంగారావు కోపంతో ఊగిపోతున్నాడు. సుశీలమ్మ జుట్టుపట్టుకొని అక్కడినుండి బటబటా ఇంటికి లాక్కొచ్చాడు.

అడ్డువచ్చిన లక్ష్మీదేవమ్మనీ, రమేష్‌నీ నెట్టిపారేశాడు.

సుశీలమ్మని ఇంట్లోపడేసి తలుపుగొళ్లెం పెట్టి గొడ్డుని బాదినట్టు కొట్టాడు. అయినా సుశీలమ్మ నోరుమెదపలేదు. అన్ని దెబ్బలూ మౌనంగానే భరించింది. ఆమె మౌనం రంగారావుని రెచ్చగొట్టింది. అలిసిపోయి తలుపు తీసుకొని బైటికి వచ్చాడు.

అప్పుడు లోపలికి వెళ్లిన లక్ష్మీదేవమ్మ ఒళ్లో తలవుంచి కొడుకుని దగ్గరకు తీసుకొని తల నిమిరింది సుశీలమ్మ.

ఆ రాత్రి...

తెల్లవారేసరికి ఆ వూరి జనమంతా ఆ ఇంటివైపు పరుగులు తీయసాగారు.

లక్ష్మీదేవమ్మ శోకండాలు తీస్తూ ఉంది.

అందరి హృదయాల్లో విషాదం.

రంగారావు పట్ల అసహనం, శాపనార్థాలు.

తల్లీబిడ్డని పొట్టన పెట్టుకొన్నాడు. పాపం ఊరికే పోదు.

సీలింగ్ ఫ్యాన్‌కి వేలాడుతున్న సుశీలమ్మ శవాన్ని దించుతుంటే అందరికీ ఏడుపొచ్చింది.



గర్భగుడిలో శివలింగానికి ఎదురుగా కూర్చొని ఉన్నాడు శివరామశాస్త్రి.

ఆయన చేతిలో రుద్రాక్షమాల ఉంది. కళ్లు మూసుకొని జపం చేస్తూ రుద్రాక్షల్ని ఒక్కొక్కటీ కదుపుతున్నాడు.

అప్రయత్నంగా ఆయన మస్తిష్కంలోకి ఏదో ఆలోచన ప్రవేశించినట్టు కనురెప్పలు కాస్త విచ్చుకొన్నాయి. శివలింగంలోంచి మెరుపు రేఖలు ఆయన మనోనేత్రాన్ని తాకుతున్నాయి.

భృకుటి ముడివడింది.

మంత్రోచ్చారణ ఆగిపోయింది.

చేతిలోని రుద్రాక్ష మాలలో చలనంలేదు.

ఫ్యాన్‌కి వేలాడుతూ ఉంది సుశీలమ్మ శవం.

ఆమె జీవితం అర్థాంతరంగా ముగుస్తుందని శివరామశాస్త్రి ఎప్పుడో వూహించాడు. రాక్షస అంశతో ఉన్న రంగారావు ఎదుట సాత్వికురాలైన సుశీలమ్మ ఇంతకాలం మనగలిగిందంటే అందుకు కారణం ఆమెలో ఉన్న దైవత్వమే.

భగవంతుడు ఎవరెవరికి ఎప్పుడు ఎక్కడ ఎలా బంధం కలుపుతాడో ఎలా విడదీస్తాడో ఎవరికీ అర్థంకాని విషయం. అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తే అంతా మన చేతులలోనే ఉందనిపిస్తుంది. అదంతా పాపపుణ్యాల ఫలితమే అనిపిస్తుంది.

సర్వం కర్మానుసారమే జరుగుతుందని మహాభారతంలో ధర్మవ్యాధుడు కౌశికునితో చెప్పడం గుర్తుకు వస్తుంది. ఈ దేహంగానీ దేహవర్ణనంగానీ కర్మననుసరించే ప్రవర్తిల్లుతాయి. చివరకు జీవుడుకూడా కర్మ నిర్దేశించిన చోటికి వెళ్లిపోవలసిందే.

ఆ జీవుడు దేహంకంటే భిన్నమైన వాడు. చావులేనివాడు. నిత్యుడు. మనిషి మరణించినపుడు స్థూల శరీరం మాత్రమే నశిస్తుంది. జీర్ణ వస్త్రాలనువిడిచి మానవుడు కొత్త వస్త్రాలను ధరించినట్లే జీవుడు ఒక శరీరాన్ని వదిలి మరొక శరీరాన్ని ధరిస్తాడు.

ఆయా శరీరాలు కూడా పూర్వ కర్మానుసారమే కల్పించబడతాయి.

ఏ బీజం నాటితే ఆ ఫలాన్నే అనుభవిస్తామన్నట్టు పుణ్యకర్మలు చేసినవాడు సుఖాలను, పాప కర్మలను చేసినవాడు దుఃఖాలను అనుభవిస్తాడు.

అలా అలా ఆలోచిస్తున్న శివరామశాస్త్రి నెమ్మదిగా నిద్రలోకి జారిపోయాడు.

నిద్రలో... అస్థిపంజరాలు, బూడిదకుప్పలు రకరకాలుగా కట్టిన సమాధులు, శవాలు కాలుతున్న వాతావరణం, హాహాకారాలతో స్మశానం.

అక్కడ లయకారుడైన శివుడు సంచరిస్తున్నాడు.

శివరామశాస్త్రి అటు రావడం చూసి "ఏమిటి భక్తా నా నివాసం వైపు వస్తున్నావు" అని అడిగాడు.

"సుశీలమ్మగారు ఇటు వచ్చారుగదా చూసివెళ్లడానికి వచ్చాను స్వామి"

"ఇక్కడికి వచ్చిన వాళ్లు తిరిగి వెళ్లడానికి వీలు లేదుకదా! ఆ విషయం నీకు తెలుసు కదా! ఏల వచ్చావు"

"ఆమెకి అన్యాయం జరిగింది స్వామీ"

పరమశివుడు ఫక్కున నవ్వాడు.

"న్యాయాన్యాయ విచక్షణ మాకు తెలియదా! సర్వం మాకు విదితమే భక్తా! నువ్వు అజ్ఞానంలో ఉన్నావు. ఎవరికీ అన్యాయం జరగదు"

"ఆమె జీవితం అర్థాంతరంగా ముగియడం అన్యాయం కాదా స్వామీ"

"కాదు... అంతా ఆమె జాతకం ప్రకారమే జరిగింది"

"ఆ జాతకం రాసింది ఎవరు స్వామి"

"విధి" రీవీగా చెప్పాడు శివుడు.

"మరి విధికి ఎందుకు స్వామీ అంత పక్షపాతం"

"నీవు పొరబడుతున్నావు భక్తా. విధికి పక్షపాతం తెలియదు. నీ-నా-తన శబ్దంబులకచ్చట స్థానమేలేదు.

అంతా కర్మానుసారమే జరుగుతుంది"

"అయితే సుశీలమ్మగారు చేసిన దుష్కర్మ ఏమిటో సెలవియ్యగలరా స్వామీ"

"అది దైవానికే విదితం"

"ఆ దైవం ఎక్కడ ఉంది స్వామీ. ఎలా ఉంటుంది"

"ఏమిటి భక్తా నాతో పరిహాసమాడుతున్నావు. దైవం గురించి నీకు తెలియదా. అడిగావు కనుక చెప్తున్నాను విను. దైవం ఒకచోట ఉండేదికాదు. సర్వాంతర్యామి. మాంస చక్షువులతో చూడలేనిది. సృష్టి, స్థితి, లయలకు మూలమైన మహత్తర శక్తి అది. ఆ శక్తే భగవంతుడు. నాశరహితుడుగా, జ్ఞానమయుడుగా, చైతన్య మూర్తిగా, పరమానంద స్వరూపుడుగా తనకుతాను ప్రకాశిస్తాడు. నిష్కామియై కర్తవ్యకర్మను ఆచరించే పరిశుద్ధుడు మాత్రమే తన జ్ఞాన నేత్రంతో ఆ దివ్య మంగళ స్వరూపాన్ని చూడగలుగుతాడు"

శివరామశాస్త్రి నోట మాటలు రాలేదు. శివుడి మాటలకు ఆకర్షితుడై ఆయనకేసి తీక్షణంగా చూడసాగాడు.

"ఏమిటి భక్తా మౌనం వహించావు" అని అడిగాడు.

"నా జాతకం ఏమిటో తెలుసుకోవాలని ఉంది స్వామి"

"అది నీ కర్మానుసారిణి"

నిద్రచెదిరి, అంతలోనే ఎవరో వచ్చినట్టు అలికిడి అయి వెనక్కి తిరిగి చూశాడు శివరామశాస్త్రి.

ద్వారం దగ్గర లక్ష్మీదేవమ్మ నిలబడి ఉంది.

ఆమె అలా శివాలయానికి ఆ రోజు అప్పటికి ఏ పదిసార్లో వచ్చింది.

సుశీలమ్మ ఆత్మహత్య చేసుకోవడంతో రమేష్ ఇంట్లోంచి వెళ్లిపోయాడు. వాడి కోసం లక్ష్మీదేవమ్మ వెదకనిచోటు లేదు. రంగారావుని శాపనార్థాలు పెట్టింది. బంధువుల వాళ్లకి మనుషుల్ని పంపింది. ఎక్కడా రమేష్ జాడలేదు. అయినా ఆమెలో ఆశ చావలేదు. రమేష్ శివరామశాస్త్రి గారింటికి తప్పక వస్తాడని ఆమెకు నమ్మకం. మనవడికోసం లక్ష్మీదేవమ్మ పడుతున్న బాధ చూస్తుంటే శివరామశాస్త్రికి జాలేసింది.

ఆమెను చూడగానే "రమేష్‌ని గురించి మీరు బెంగపెట్టుకోకండి. తప్పక వస్తాడు. ఇక్కడకు వస్తే నేనే వాణ్ణి మీ ఇంటికి తీసుకొస్తాను" అని చెప్పాడు.

లక్ష్మీదేవమ్మకి నీరసం వచ్చేసింది. కాళ్లు ఈడ్చుకొంటూ ఇంటికి వెళ్లిపోయింది. రంగారావుని చూసి కోపంగా తిట్టి ఏడ్చేసింది.

★ ★ ★

తిరిగి తిరిగి అలిసిపోయిన లక్ష్మీదేవమ్మకి బాగా నిద్ర పట్టేసింది.

పొద్దుపోయిన తరువాత నాయనమ్మా అన్న పిలుపు విని లేచికూర్చుంది.

ఎదురుగా రమేష్ నిలబడి ఉండటంతో ఎక్కడ లేని ఆనందంతో లేచి "ఓ నా తండ్రీ, ఎక్కడికి పోయావురా" అంటూ రమేష్‌ని దగ్గరకు తీసుకొంది.

"నాయనమ్మా! ఆకలిగా ఉందే"

"రా నాయనా. అన్నం పెడతాను. గడ్డపెరుగు ఉంది. ఆవకాయ వేసి పెడతాను"

రమేష్‌ని వంటింట్లోకి తీసుకొనిపోయి పెరుగన్నం కలిపి ఆవకాయముక్కలు వేసింది. రమేష్ గబగబా ముద్దలు తింటుంటే "ఎక్కడికి పోయావురా" అని అడిగింది లక్ష్మీదేవమ్మ.

"ఎక్కడికీ పోలేదు లేవే. ఊళ్లోనే ఉన్నాను"

"ఊళ్లోనా"

"అవునే... శివరామశాస్త్రిగారి తోటలో ఉన్నాను"

"అవునా. నీకోసం ఎంతలెక్క వెతికానురా. కాళ్లు నొప్పులు పుట్టాయి కదరా తండ్రీ"

"సారీ నాయనమ్మా. నిన్ను శ్రమ పెట్టాను. ఇంట్లో ఉండాలంటే నాకు భయంగా ఉంది"

"ఎందుకురా పిచ్చి తండ్రీ భయం. నేను న్నానుగా"

"నువ్వుండేం చేస్తావు. అక్క చచ్చినప్పుడు నువ్వు లేవా? అమ్మ చచ్చినప్పుడు నువ్వు లేవా? ఏం చేశావు? అందుకే నేనీ ఇంట్లో ఉండను. వెళ్లిపోతాను" చెయ్యి కడుక్కొని "నాయనమ్మా వెళుతున్నా" అంటూ లేచి వెళ్లిపోయాడు.

రమేష్ వెళ్తుంటే "ఒరేయ్... ఒరేయ్ రమేష్. నాయనా, ఉండరా. వెళ్లొద్దు. ఉండరా" అంటూ లక్ష్మీదేవమ్మ బయటకు వచ్చింది.

ఎవరూ లేరు.

తలుపులు వేసి ఉన్నాయి.

అప్పుడు అర్థమయ్యింది. రమేష్ రాలేదని.

అది కల అని.

తలుపులు తీసి చూసింది.

చీకటి, చల్లటిగాలి

★ ★ ★

కళ్ల ముందున్న రూపాన్ని చూసి క్షణం నిశ్చేష్టుడయ్యాడు రంగారావు.

నుదుట చిన్నసైజు అర్థరూపాయి బిళ్లంత తిలకంబొట్టు. కాటుకదిద్దిన వెడల్పాటి కళ్లు. మెడలో హారం. తల్లో మల్లె పూల గుభాళింపు. పట్టుచీరెతో మెరిసిపోతోంది.

"సుశీలా" అన్నాడు మత్తుగా.

ఆమెబుగ్గలపై సిగ్గు దొంతరలు. పెదాలపై చిన్న నవ్వు.

సుడిగాలిలా లేచి ఆమెని చుట్టేశాడు.

అంతే!

ఆమె అతన్ని విసురుగా తోసేసింది. ఎగిరిపడిపోయాడు.

తేరుకొని లేచి కూర్చునేసరికి లక్ష్మీదేవమ్మ అక్కడికి వచ్చింది.

"ఒరే రంగా రమేష్ శివరామశాస్త్రిగారి తోటలో ఉన్నాడురా" అని చెప్పింది.

"ఎవరు చెప్పారు నీకు"

"ఎవరోకాదు. ఇప్పుడే కలొచ్చింది. ఆ కల్లో వాడే కనబడి చెప్పాడు. వేకువజామున వచ్చే కలలు నిజమవుతాయి. తెల్లవారొచ్చింది వెళ్లివాణ్ణి తీసుకొని రా. అసలే వాడికి నువ్వంటే భయం. పారిపోవచ్చు మంచి మాటలు చెప్పి తీసుకురా" అని పురమాయించింది.

రంగారావు లేచి శివరామశాస్త్రిగారి తోటవైపు బయలుదేరాడు.

తెలతెలవారుతోంది.

మసకమసక చీకటిలో మనుషులు తిరుగుతున్నారు.

రంగారావు తోటంతా కలియతిరిగాడు. ఎక్కడా రమేష్ కనబడలేదు. సూర్యోదయం అయింది.

తిరిగి వస్తుంటే రమేష్ చింతలమ్మ గుడి దగ్గర ఉన్నాడని ఎవరో చెప్పారు.

రంగారావు చింతలమ్మ గుడి దగ్గరకి వెళ్లాడు.

రమేష్ గుడి వాకిట్లో కూర్చొని ఉన్నాడు. అతని నుదుట కుంకుమ బొట్టు ఉంది. రంగారావు రావడం చూసి గంభీరంగా మారిపోయాడు.

"ఏరా ఇక్కడ ఉన్నావు" దగ్గరగా వస్తూ అడిగాడు రంగారావు.

రమేష్ మాట్లాడలేదు.

"నిన్నే"

"నాయిష్టం"

రమేష్ సమాధానంతో రంగారావు ఖంగు తిన్నాడు.

"ఇంటికి రావా ఏంది"

"నాయిష్టం"

రంగారావుకు కోపం వచ్చింది.

"ఏంది నీ ఇష్టం. రా పోదాం"

"నువ్వుపో"

"రేపు విజయవాడ పోవాలి"

"నేను పోను"

"ఏం చదువుకోవా"

"చదువుకోను"

చింతలమ్మ గుడి దగ్గర రమేష్ ఉన్నాడని తెలిసి లక్ష్మీదేవమ్మ అక్కడికి వచ్చింది.

అప్పుడు తండ్రీ కొడుకులమధ్య జరుగుతున్న వివాదం విని రంగారావుకి ఎక్కడ కోపం వస్తుందో వాడు రమేష్‌ని ఏం చేస్తాడోనని భయపడింది.

"నువ్వు వెళ్లిపోరా!" అని రంగారావుని బలవంతంగా అక్కడినుండి పంపించి రమేష్‌ని గట్టిగా పట్టుకొని ఏడ్చేసింది.

"ఎక్కడికి పోయావురా తండ్రీ. నేనేం కావాలని. నీకోసం తిరిగి తిరిగి అలసిపోయానుకదరా! రారా ఇంటికి పోదాం... నా మాట వినవా... నువ్వు తప్పితే ఇంకెవరున్నార్రా నాకు. వాడు పశువు. మనిషి జన్మ ఎత్తలేదు. పరమమూర్ఖుడు, రాక్షసుడు. వాడితో నీకేం పనిరా. నేనున్నానురా. నా మాట విను. నీకు ఏలోటూ రానివ్వను. నన్ను నమ్మరా" అంటూ లక్ష్మీదేవమ్మ రకరకాలుగా బతిమిలాడి రమేష్‌ని ఇంటికి తీసుకొని వచ్చింది.

★ ★ ★

శారదమ్మలో అసహనం మొదలైంది.

ఆమె మనసునిండా ఆలోచనలు. అవన్నీ అమృతను గురించే.

అమృతకి పెళ్ళి చెయ్యాలన్న ఆలోచన ఏ ముహూర్తంలో కలిగిందోగాని, పేరిశాస్త్రి కొడుకుతో నిశ్చయమైందన్న సంతోషం నిరాశకు గురైంది.

ఎన్నో సందేహాలు. ఆమెలో ఆలోచనలు ఒక కొలిక్కి రావడంలేదు. గమ్యం కనబడటంలేదు.

భవిష్యత్తు గురించి ఆందోళన.

ఏదో భయం.

'అసలు అమృతకు పెళ్ళి అవుతుందా?'

అలాంటి ఊహ రాగానే ఆమె గుండె ఝల్లుమంది.

'భగవంతుడా నా తల్లిని చల్లగా చూడు. ఏ కష్టమూ రానీయకు' అని మనసులో దేవుణ్ణి వేడుకొంది.

వంటరిగా యింట్లో ఉంటే తనకు పిచ్చి పట్టేట్టుగా ఉందని గుడిలోకి వచ్చింది.

మంటపంలో శివరామశాస్త్రి పంచాంగంలో గోచార ఫలితాలు చూస్తూ ఉన్నాడు. శారదమ్మ రావడం ఆయన గమనించలేదు.

"ఏమిటీ పంచాంగం చూస్తున్నారు?" అంటూ ఆయనకి ఎదురుగా కూర్చుంది.

శివరామశాస్త్రి తలపైకెత్తి శారదమ్మను చూసి మళ్ళీ పంచాంగంలోకి చూడసాగాడు.

నిజానికి గోచార ఫలితాలు అంటే శివరామశాస్త్రికి ఆసక్తిలేదు. ఆయనకి వాటిమీద నమ్మకంలేదు. అయినా అంత శ్రద్ధగా చూస్తున్నాడంటే వింతగా ఉంది.

అనుకున్నవి అవకుండా జీవితంలో ఎదురు దెబ్బలు తగిలినప్పుడే మనిషి కాస్త ఆలోచించడం మొదలుపెడతాడన్నది నిజం. ఆర్థిక పరిస్థితులు ఛిన్నాభిన్నం కావడమో, అనూహ్యంగా అవాంతరాలు ఎదురై అతలాకుతలం కావడమో, చివరకు బంగారమే పట్టుకున్నా అది మట్టికావడమో వంటి అపజయాల కారణంగా మనిషి నలిగిపోయి తల పట్టుకొంటాడు.

అప్పుడు దిక్కుతోచక ముందుముందు జీవితం ఎలా ఉంటుందో తెలుసుకోవాలన్న తపన జ్యోతిష్యుడి దగ్గరకి చేరుస్తుంది.

అందుకనే 'సోది చెబుతానమ్మో' అంటూ వచ్చిన ఎరుకలసాని చుట్టూ ఈనాడు కూడా అమ్మలక్కలు చేరడం. పంజరంలో చిలకను పెట్టుకొని చెట్లకింద కూర్చుని చిలకజోస్యం చెప్పేవాడిచుట్టూ చేరిన జనం జేబులు ఖాళీ చేసుకోవడం.

హస్తసాముద్రికం తెలిసినవాడు అందుబాటులో ఉంటే చెయ్యి చూపించుకోకుండా ఉండలేం. కారణం మన జాతకం మన అరిచేతిలోనే ఉందన్న నమ్మకం. అరి చేతుల్లో ఉన్న రేఖలు ఒక్కొక్కటీ ఒక్కొక్క విష

యాన్ని తెలుపుతాయి. ఆ రేఖల విన్యాసాలనుబట్టి మనుషుల స్వభావం, సామర్థ్యం, వివాహం, అదృష్టం, ఆయుఃప్రమాణం వంటి సకల విషయాలూ తెలుసుకోవచ్చు.

జనన లగ్నాన్నిబట్టి చెప్పే జాతకాలమీద మంచి విశ్వాసం. బిడ్డ పుట్టగానే తిథి, వార, నక్షత్రాలను రాసి జ్యోతిష్య పండితులచేత జాతకం రాయించడం సాధారణం అయింది.

ఒకవేళ జనన సమయానికి సంబంధించిన సమాచారం తెలియకపోతే పేరునిబట్టి రాశి ఫలాలను చూస్తారు. జ్యోతిష్యంమీద నమ్మకం లేదని చెప్పేవాళ్ళే ఏదో ఒక సమయంలో భవిష్యత్తు భయంకరంగా కనపడి దిక్కుతోచక జ్యోతిష్యాన్ని ఆశ్రయిస్తారన్నది నిజం.

పంచాంగం మూసేస్తూ మెల్లగా తలపైకెత్తాడు శివరామశాస్త్రి. ఆయన కళ్ళకి ఎదురుగా ఉన్న ధ్వజస్థంభం కింది భాగం కనబడుతోంది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అడిగింది శారదమ్మ.

శివరామశాస్త్రి ఏంమాట్లాడలేదు.

"అమృతను గురించేనా?"

"కాదు... సుశీలమ్మను గురించి"

శారదమ్మకి భర్త సమాధానం కాస్త షాక్‌లా తగిలింది. ఇంతసేపూ ఆయన పంచాంగంలో రాశి ఫలాలు చూస్తుంటే అమృతకు సంబంధించేమో అనుకొన్నది. అయినా కాలం చేసిపోయిన ఆమె జాతకంతో ఏంపని.

"మన చేతుల్లో ఏమీలేదు" అన్నాడు నిర్లిప్తంగా శివరామశాస్త్రి నిట్టూర్చి

"అందులో అమృత విషయం గూడా చూడండి" అంది శారదమ్మ.

"ఎందుకూ, ఏం ఉంది ఇందులో. మన తృప్తి కోసం చూసుకోవడమే. లలాట లిఖితం ఎవరూ చెప్పలేరు"

"అయినా ఒకసారి చూడండి"

శారదమ్మ అలా అడుగుతుంటే కాదనలేక పంచాంగం తెరిచి అమృతకు సంబంధించిన గోచార ఫలం చూశాడు.

ధన లాభం, అనారోగ్యం, అధైర్యం, సౌభాగ్యసిద్ధి, కీర్తి, ప్రజలలో పలుకుబడి, అనుకూల వాతావరణం. ఈ రాశి స్త్రీలకు నూతనవస్త్రప్రాప్తి, అనూహ్యకష్టాలు, అయినా అభీష్టసిద్ధి అని ఉంది.

అందులో చివరిమాట శివరామశాస్త్రికి సంతోషాన్ని కలిగించింది.

"మనం దేవుణ్ణి నమ్ముకున్నవాళ్ళం. మనకే కష్టాలూ రానివ్వడు. అమృతకి అన్నీ సవ్యంగానే జరుగుతాయి" అన్నాడు.

శారదమ్మ మనసు స్థిమితపడింది. ఆమెలో ఆందోళన సద్దుమణిగింది.

ఆ రాత్రి-

నిద్రపోతున్న అమృత ఉఛ్వాస, నిశ్వాసలు శారదమ్మని నిద్రపోనీలేదు.

ఆమెలో ఆలోచనలు ఊపిరి పోసుకొన్నాయి. అప్పుడు చంద్రశేఖర్ రూపం కనబడింది.

చంద్ర బాగా చదువుకొన్నవాడు. ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నాడు. వాడికి వాళ్ళ మేనత్త తన కూతురు మాధవిని ఇవ్వాలని అనుకొంటోంది. అందుకు పరమేశ్వరశాస్త్రి గూడా సుముఖంగానే ఉన్నట్టు తెలిసింది. అయితే వర్ధనమ్మకి మాత్రం చంద్రకి అమృతని చేసుకోవాలని ఉంది. చంద్రకి గూడా అమృత అంటేనే ఇష్టం.

కానీ శివరామశాస్త్రికి అమృతని చంద్రకి ఇవ్వడం ఇష్టంలేదు. ఆ విషయంలో శారదమ్మ భర్తకి నచ్చజెప్పి ఆయన మనసు మార్చలేదు. అందుకు వర్ధనమ్మే సమర్థురాలు. ఆమె వాళ్ళ అన్నయ్యతో స్వతంత్రించి ధైర్యంగా మాట్లాడగలదు. పరమేశ్వరశాస్త్రి గూడా ఆమెకి ఎదురు చెప్పలేడు. అప్పుడు అమృత, చంద్రశేఖర్‌ల పెళ్ళి సులభంగా జరిగిపోతుంది.

అలా ఆలోచన రావడంతో శారదమ్మకి

మనసు తేలికపడి నిద్రలోకి జారింది.

★ ★ ★

ఆ తెల్లవారే చంద్రశేఖర్ కాకినాడనుండి వచ్చాడు. రెండు వారాలకు పైగా చంద్రశేఖర్ ఊళ్ళో లేకపోవడంవల్ల అతనికి ఆ వూరి విషయాలేమీ తెలియవు. తల్లి వర్ధనమ్మ అమృత పెళ్ళిచూపుల విషయం చెప్పడంతో ఆలోచనలో పడిపోయాడు.

రెండు వారాల్లో ఎంత జరిగిపోయింది.

ఎప్పుడు, ఎక్కడ, ఏం జరుగుతుందో ఊహకి అందేది కాదని అప్పుడు తెలిసింది చంద్రశేఖర్‌కి.

కాకినాడలో తను ఉన్న ఆ రెండు వారాలలోనే మాధవికి రెండు పెళ్ళి సంబంధాలు వచ్చాయి. పెళ్ళి చూపులకని వాళ్ళముందు కూర్చోవడం మాధవికి ఇష్టంలేదు. మాధవిని చూపించడం రాజేశ్వరికి గూడా ఇష్టం లేదు. కానీ మంచి సంబంధాలు, మంచి ఉద్యోగాలు చేస్తున్నారు. వచ్చినవాటిని కాదనుకొని రానివాటికోసం ఎదురుచూడడం అవివేకమే అవుతుంది అని రాజారావు చెప్పడంతో కాదనలేకపోయారు.

తను వంటరిగా ఉన్నప్పుడు మాధవి వచ్చి, "బావా నేను పట్టుచీరెతో ముస్తాబై పరాయి మగవాళ్ళముందు కూర్చుంటుంటే నీకేమీ అనిపించలేదా? " అని అడిగింది.

చంద్రశేఖర్ ఖంగుతిన్నాడు.

మాధవి అలా అడుగుతుందని ఊహించలేదు. అతనికి తెలుసు మాధవికి తను అంటే ఇష్టం అని. కనుకనే అలా అడగగలిగింది. కానీ చంద్రశేఖర్ దగ్గర మాధవికి చెప్పడానికి సమాధానం లేదు. పెదాల పైకి రాని నవ్వుని తెచ్చుకొని తల పైకీ, కిందికీ ఊపాడు.

ఊరికి బయలుదేరి వస్తుంటే వీధిమలుపులో ఉన్న బస్టాప్ దాకా వచ్చింది రాజేశ్వరి.

"ఇక్కడ జరిగిన విషయాలన్నీ అమ్మానాన్నకి చెప్పు చంద్రా. మాధవి పెళ్ళివిషయంలో మీ మావయ్య తొందరపడుతున్నారు. మంచి సంబంధాలే వస్తున్నాయి. దాని మనసేమిటో నీకు అర్థమై ఉంటుంది. అయినవాళ్ళం అలాగే కలిసిపోదామని నా ఉద్దేశం" అని చెప్పింది రాజేశ్వరి చంద్రశేఖర్‌తో.

"అలాగే అత్తయ్యా, అమ్మా, నాన్నకి చెప్తాను" అన్నాడు.

"మీ నాన్నని ఆలోచించి లెటర్ రాయమని చెప్పు"

బస్సు రాగానే ఎక్కి అందులో కూర్చున్నాడు చంద్రశేఖర్.

పెళ్ళిచూపులకు ముస్తాబైన మాధవి కళ్ళ ముందు మెదిలింది. ఆమెలో అంతకుముందెప్పుడూ చూడని కొత్త అందం ఏదో కనబడింది. మగసిరిని రెచ్చగొట్టే అవయవాల సోయగం. చూసేకొద్దీ చూడాలనిపించే ఆకర్షణ.

ఆ అందం పరాయివాళ్ళ సొంతం అవుతోందంటే భరింపరాని బాధ.

అందెల సవ్వడితో అమృత నాట్యరాణిలా కదలి వస్తుంటే మేను పులకరించింది. ఆపాదమస్తకం వివిధ భంగిమలతో వయ్యారం వలకబోస్తుంటే వంపువంపుకీ గుండె గుబాళించి ఏదో చెయ్యాలనిపిస్తుంది.

కాకినాడనుండి అగ్రహారం వచ్చేదాకా చంద్రశేఖర్ మస్తిష్కంతో అమృత, మాధవీ దోబూచులాడుకొన్నారు.

అమ్మా నాన్నలకి కాకినాడ విషయాలన్నీ చెప్పాడు చంద్రశేఖర్.

పది గంటలు దాటుతుండగా శారదమ్మ వచ్చింది.

"రా వదినా" అంటూ వర్ధనమ్మ నట్టింట్లో చాప పరిచింది.




అక్కడే ఉయ్యాల బల్లమీద దిండుని ఆసరాగా చేసుకొని కూర్చుని ఉన్న చంద్రశేఖర్‌ని చూసింది శారదమ్మ.

"చంద్రా నువ్వెప్పుడొచ్చావు వూరునుండి" అని అడిగింది.

"ఇవ్వాళే అత్తయ్యా పొద్దున్నే వచ్చాను" అని చెప్పాడు చంద్రశేఖర్.

"ఉద్యోగ ప్రయత్నం ఎంతవరకు వచ్చిందేమిటి? "

"ఇంటర్వ్యూ అయిపోయిందత్తయ్యా. ఎట్లా ఉంటుందో? "

వర్ధనమ్మ మంచినీళ్ళు తెచ్చి శారదమ్మకిస్తూ ఆమెకి ఎదురుగా కూర్చుని, "అమృతని కూడా తీసుకొని రాకపోయావా వదినా" అంది.

"దానికి వాళ్ళ నాన్నే లోకం. నావెంట రావడానికి తీరికెక్కడ ఉంది" అంటూ చంద్రశేఖర్‌వైపు తిరిగి "కాకినాడ విషయాలేమిటి చంద్రా?" అని అడిగింది.

"ఏముంటాయి. మాధవికి సంబంధాలు చూస్తున్నారట్లే" వర్ధనమ్మ రాగాలు తీస్తూ

చెప్పింది.

"అదేమిటీ మాధవికి సంబంధాలు చూడ్డం ఏమిటి? మొన్న రాజేశ్వరి వచ్చినప్పుడు చంద్రకి ఖాయం చేసుకున్నట్టు చెప్పిందిగా"

చంద్రశేఖర్‌కి అక్కడ ఉండబుద్ధికాలేదు. లేచి వెళ్ళిపోయాడు. అప్పుడు వర్ధనమ్మ అంది.

"అదంతా నాటకం. ఇది ఆఫర్‌లో పెట్టుకొని వాళ్ళు వేరే సంబంధాలు చూస్తున్నారు. మంచి సంబంధాలు వస్తే మా మొహం గూడా చూడరు"

శారదమ్మకి ఆశ్చర్యంగా ఉంది. కుతూహలంగా గూడా ఉంది.

"ఈ విషయంలో అన్నయ్యగారు ఏమంటారు? "

"చెల్లెలిమీద ప్రేమగదా. అది చెప్పే కల్లబొల్లి మాటలు బాగా నమ్ముతారు"

"ఎన్నన్నా అన్నాచెల్లెళ్లుకదా. వద్దనుకొన్నా ఒకరిమీద ఒకరికి ప్రేమ ఉంటుందిలే"

"మా అన్నయ్యా ఉన్నాడు ఎందుకు? ఒక్కమాటా చెప్పడు. అదేమిటో ఎప్పుడూ గాంభీర్యం, కాలక్షేపానికైనా కాసేపు మాట్లాడడు గద" వర్ధనమ్మ మాటల్లో ఏదో బాధ ధ్వనించింది.

"నీకు తెలియందేముంది. ఆయన తరహాయే అంత. ఎప్పుడూ దేవుడూ, పూజ, తీరిక దొరికితే అమృతకి నాట్యసాధనతో సరిపోతుంది. అయినా నువ్వెప్పుడన్నా మీ అన్నయ్యకి ఎదురు నిలబడి మాట్లాడావా చెప్పు. పైగా ఆయన మితభాషి. అవునా? "

"అవుననుకో..."

"అంత మాత్రానికి నీమీద మీ అన్నయ్యకి ప్రేమ లేదనుకోవడం పొరపాటు. నీకేదన్నా లోటు చేశాడా. నువ్వే ఆయనతో ఎక్కువ మాట్లాడవు. అందుకు కారణం ఆయనంటే నీకు అభిమానం"

వర్ధనమ్మ నోట మాటరాలేదు. కొద్దిసేపు మౌనంగా ఉండిపోయింది. తర్వాత అంది.

"అమృతకి పెళ్ళి ప్రయత్నం చేస్తున్నట్టు నువ్వు గూడా చెప్పలేదు"

"నాదేముంది చెప్పు అంతా మీ అన్నయ్య మాటమీదే పోతుందిగా. నీకు తెలియందేముంది"

"పేరి శాస్త్రిగారు మా యింటికి వచ్చి చెప్తేగాని మాకు తెలియలేదు"

"నాకూ అంతే! ఆయన మా యింట్లో దిగేవరకూ తెలియదు అమృతని చూడడానికి వచ్చాడని. మీ అన్నయ్య మనస్తత్వం ఏమిటో ఏదీ చెప్పరు" అంది శారదమ్మ.

"అంతా నీ మెతకతనం లే వదినా"

"కావచ్చు... ఆలోచించకుండా ఆయన ఏపనీ చెయ్యరు. అది మాత్రం వాస్తవం"

"అమృతకి పెళ్ళిచూపులు అంత రహస్యంగా ఏర్పాటుచేసే అవసరం ఏమొచ్చింది. మాకు చెప్తే ఏమౌతుంది? "

"ఆయన మనసులో ఏముందో..."

శారదమ్మ మాట పూర్తికానివ్వలేదు వర్ధనమ్మ.

"ఏమీ ఉండదు. దాన్ని మావాడికి చేసుకోవాలనుకొంటున్నాంగా. ఆయనకి ఇష్టం ఉండదు. అంతే" అని అంది.

"అలా ఎందుకు అనుకోవాలి. చంద్రకి ఏంతక్కువ? అంతకన్నా మంచివాణ్ణి తెస్తారా ఏమిటి. అయితే ఒకటయి ఉంటుంది. నువ్వు లమృతని చంద్రకి చేసుకోవాలనుకొన్నట్టుగా రాజేశ్వరి మాధవిని చంద్రకి ఇవ్వాలని అనుకొంటుంది. ఆ ఉద్దేశంతోనే వాళ్ళు చంద్రని అక్కడ ఉంచుకొని చదివించారు. ఇప్పుడు మేం అమృతని చేసుకొమ్మంటే మీలో మీకు కలతలు వస్తాయనుకొన్నారేమో మీ అన్నయ్య" అంది శారదమ్మ.

ఆమె మాటలతో జ్ఞానోదయం అయినట్టుగా ఉంది వర్ధనమ్మకి.

"అయితే అన్నయ్య చాలాదూరం ఆలోచించాడన్నమాట"

"అని నేననుకుంటున్నాను"

"మరి అమృత ఉద్దేశం ఏమిటి"

"దానిదేముంది అంతా వాళ్ళ నాన్న ఇష్టం"

వర్ధనమ్మలో ఏదో ఉత్సాహం తొంగిచూసింది.

"అయితే వదినా నట్టింట్లో కూర్చుని అడుగుతున్నాను. నిజం చెప్పు నీ ఉద్దేశం ఏమిటి" అని అడిగింది.

"నా ఉద్దేశ్యంకన్నా ముందు నీ ఉద్దేశ్యం ముఖ్యం. అబ్బాయిగల దానివి నువ్వు. నేను అమ్మాయి కలదాన్ని" అని అంది శారదమ్మ.

"అమృత అంటే నాకేకాదు. చంద్రకి కూడా ఇష్టం"

"అయితే నాకూ ఇష్టమే. మన పిల్లలు మనకళ్ళముందే ఉంటారు. వాళ్ళకు ఏలోటూ ఉండదు. మరి మీ అన్నయ్య విషయం. ఆయన కూడా ఇష్టపడాలిగా" అంది శారదమ్మ.

"ఆ విషయం నాకు వదిలెయ్యి వదినా. నేను చూసుకుంటాను. అన్నయ్యను నేను అడుగుతాను, ఒప్పిస్తాను. సరేనా"

శారదమ్మ మనసు పరమానందంతో ఉప్పొంగిపోయింది. ఏం మాట్లాడాలో తెలియడంలేదు. రాత్రి ఆలోచించిన విషయం కార్యరూపం దాల్చబోతోందని సంబరపడిపోయింది. ఇంక అక్కడ ఉండబుద్ధికాలేదు. లేచి వీధిగుమ్మం దిగి వెళ్ళిపోతుంటే అప్పుడే పక్కవీధిలోంచి వస్తున్న పరమేశ్వరశాస్త్రి ఆమెని వెనకనుండి చూచి క్షణం ఆగిపోయాడు.

వెంటనే ఆయన మనసులోకి ఏదో ఆలోచన దూరి వేగాన్ని పుంజుకొంది.

క్షణకాలం కళ్ళు మూసుకుని "భగవంతుడా నా ఆలోచన నిజం కాకుండా చెయ్యి" అని మనసులోనే మొక్కుకున్నాడు.

★ ★ ★

లక్ష్మీదేవమ్మకి ఆందోళనగా ఉంది.

ఈమధ్య రంగారావుకీ రమేష్‌కీ మధ్య తరచు వాగ్వివాదం జరుగుతోంది.

కనీసం తండ్రికి ఎదురుగా నిలబడడానికే భయపడే రమేష్ ఇప్పుడు ఎదురుతిరిగి మాట్లాడుతున్నాడు. అతనిని లెక్కచేయడం లేదు. తండ్రిపట్ల అసహ్యంగా ఉన్నాడని తెలిసిపోయింది లక్ష్మీదేవమ్మకి.

రమేష్ ప్రవర్తన రంగారావుకి కోపాన్ని తెప్పిస్తోంది. ఆయన మనసు ఎదురుచెప్తే ఓర్చుకోలేదు.

ఎప్పుడెప్పుడు ఎదురు తిరుగుదామా అని అవకాశంకోసం ఎదురు చూస్తున్నట్టు ఉన్నాడు రమేష్.

తండ్రీకొడుకుల మధ్య ఇలాంటి వాతావరణం నెలకొని ఉండడం లక్ష్మీదేవమ్మ భరించలేకుండా ఉంది. ఇద్దరిమధ్యా మాటామాటా పెరిగి ఏం ప్రమాదం ముంచుకొస్తుందోనని భయం. అందుకని ఆమె ఇంటిపట్టునే ఉంటూ కొడుక్కీ, మనవడికి ఎవరికి చెప్పవలసిన మాటలు వాళ్లకు చెప్తూ పరిస్థితి చక్కబెట్టుకుని వస్తూ ఉంది. అయినా ఇద్దరూ కత్తికట్టిన కోడిపుంజుల్లా పోటీపడడానికి సిద్ధంగా ఉన్నారు.

అసలే కోపిష్టివాడు రంగారావు. వాడి కోపానికి రమేష్ ఎక్కడ బలైపోతాడోనని లక్ష్మీదేవమ్మ భయం. చదువుకోసమని చెప్పి రమేష్‌ని విజయవాడ పంపిస్తే తండ్రీ కొడుకులమధ్య శత్రుత్వం పోతుందనుకుని ఆ ప్రయత్నం చేసింది. కానీ రమేష్ ఎక్కడికీ పోనని మొండిపట్టు పట్టాడు. ఆమె మాట వినకపోవడంతో రంగారావుకి కోపం

వచ్చింది.

"గుడ్డలు సర్దుకో. రేపు విజయవాడ పోవాలి" అన్నాడు రంగారావు కోపంతో.

"నేను పోను" ముఖం పక్కకు తిప్పిచెప్పాడు రమేష్.

"ఏం, ఎగతాళిగా ఉందా నీకు. ఎదురు తిరుగుతున్నావు"

రమేష్ అటువైపు తిప్పిన తల ఇటు తిప్పి రంగారావు ముఖంలోకి సూటిగా చూశాడు.

"ఏం ఎదురుచెప్తే. ఏం చేస్తావు? చంపుతావా. నేను అక్కను, అమ్మను కాను. గుర్తుంచుకో" అనేసి విసురుగా అవతలికి వెళ్ళిపోయాడు.

రంగారావుకి అహం దెబ్బతిన్నట్లయింది. కళ్ళురుముతూ వెళ్తున్న రమేష్ కేసి చూస్తూ ఉండిపోయాడు.

అప్పుడు రంగారావు రూపాన్ని చూసి లక్ష్మీదేవమ్మ వణికిపోయింది.

ఉదయం వీధి అరుగుమీద ఎదురింటాయన కూర్చుని పేపర్లో చదివిన 'కొడుకుని చంపిన కసాయి తండ్రి' వార్త ఆమెకు గుర్తొచ్చింది.

పళ్ళు కొరుకుతున్న రంగారావు పక్కనే గోడకు ఆనించి ఉన్న బారెడు పొడుగు కర్రను అందుకున్నాడు. అది చూసి రమేష్ వీధిలోకి పరిగెత్తాడు. రంగారావు రమేష్ వెనక పరిగెత్తాడు. భుజాన కర్ర ఎత్తి పట్టుకుని కొడుకుని తరుముతూ రంగారావు పరిగెడుతూ ఉంటే ఇళ్లల్లోంచి జనం వీధిలోకి పరిగెత్తుకొచ్చారు. ఎవరూ రంగారావుని వారించడానికి ముందుకు రాలేదు. రమేష్ ఊరుదాటి చింతలమ్మ గుడి వద్దకు వచ్చి పడిపోయాడు. రంగారావు కర్రతో రమేష్‌ని చితకబాదాడు. రక్తం మడుగులో పడిపోయిన రమేష్‌ని చూసి లక్ష్మీదేవమ్మ పెద్దగా కేకవేసి కూలబడిపోయింది.



ఆ కేక వింటూనే రంగారావు భయపడ్డాడు.

"ఏమిటీ ఏమయింది" అంటూ వచ్చి లక్ష్మీదేవమ్మను కుదుపుతూ అడిగాడు.

ఆమె తేరుకొని "ఏముందీ ఏమీలేదు. ఏదో పీడకల" అంటూ అటూ ఇటూ చూసి "రమేష్ ఏడీ? " అని అడిగింది.

"ఇప్పుడేగా నీముందే ఎక్కడికో పోయాడు" అని చెప్పాడు రంగారావు.



నీటిజాలు పక్కనే తడిపొడి ఇసుకలో పడుకొని ఉన్నాడు రమేష్.

అతని మనసు చికాకుగా ఉంది. ఏవేవో ఆలోచనలు మస్తిష్కంలోకి అస్తవ్యస్తంగా దూరి వెళ్తున్నాయి. కళ్ళల్లో అమ్మ కనపడుతోంది. నాయనమ్మ ఆత్మీయత తెలుస్తోంది. తండ్రిపట్ల కసి పెరిగిపోతోంది.

అమృత కనబడడంలేదు. వాళ్ళ ఇంటిదగ్గరకు వెళ్లాలంటే ధైర్యం చాలడంలేదు. ఆమెకోసం ఏటివద్దకు వస్తున్నాడు. నీటికోసం అమృత రావడం లేదు. వాళ్ళ అమ్మ వస్తోంది. అప్పటికీ ఉండబట్టలేక "అమృత లేదా ఆంటీ? " అని అడిగాడు శారదమ్మని.

ఆమె బిందెను భుజాన పెట్టుకొని రమేష్‌వైపు చూసి "ఎందుకు నాయనా. నువ్విక్కడికి రావడం దానికోసమేనా? "

అంది.

రమేష్‌కి అవమానం అయింది.

ఏడ్వాలనిపించింది.

అమృతకు కూడా అసహనంగానే ఉంది. రమేష్‌ని చూడకుండా ఉండాలంటే కష్టంగా ఉంది. ఆమె ప్రతి కదలికనూ గమనిస్తూ ఆలయ పరిసర ప్రాంతాలను దాటిపోకుండా చూస్తోంది శారదమ్మ.

శివరామశాస్త్రి గుడిలో పూజ చేస్తున్నాడు. అమృత మంటపంలో ఒంటరిగా ఉంది. ఏదో ఆలోచిస్తూ రమేష్ పిలుపు వినిపించినట్లుగా ఉంటే తల తిప్పిచూసింది. వీధిద్వారంలో నిలబడి ఉన్నాడు రమేష్. ఆనందంతో ఊగిపోయింది అమృత. అటూ ఇటూ చూసింది.

నాన్న పూజలో ఉన్నాడు.

అమ్మ ఇంట్లో ఉంది.

రమేష్‌తో కలిసి కనబడకుండా పారిపోవాలనిపించింది అమృతకి. చెంగున లేచి పరిగెత్తబోయి ఆగిపోయింది. ఎదురుగా శారదమ్మ నిలబడి ఉంది.

"ఎక్కడికీ లేచావు? కాళ్లు విరగ్గొడతా గడప దాటావంటే "

నిశ్చేష్టురాలైంది అమృత. కుప్పలా కూలిపోయి ఒడిలో తల పెట్టుకుని ఏడ్చేసింది.

పూజ ముగించుకుని వచ్చిన శివరామశాస్త్రి అమృత పక్కనే కూర్చున్నాడు. ఆమె వీపుమీద చెయ్యివేసి నిమురుతూ దగ్గరకు తీసుకున్నాడు. తండ్రిని చూడగానే అమృతలో దుఃఖం పెల్లుబికింది.

"నాన్నా" అంటూ ఆయన ఒళ్లో వాలిపోయింది.

అప్పుడు శివరామశాస్త్రి ఎదురుగా ఉన్న భార్య మొహంలోకి చూశాడు. ఆమె ఏం మాట్లాడలేదు. భర్తతో ఎదిరించి మాట్లాడే ధైర్యం ఆమెకి లేదు. అక్కడినుండి వెళ్లిపోయింది.

"ఎందుకమ్మా! ఏడుస్తావు? అన్నిటికీ పైన దేముడున్నాడు. మనం ఆయన్ని నమ్ముకున్నవాళ్లం. అంతా సవ్యంగానే జరుగుతుంది." అని అమృతని సముదాయించాడు శివరామశాస్త్రి.

"రమేష్ మనసు బాగా దెబ్బ తిన్నది నాన్నా!" కాస్త ఏడుపు ఆపుకుంటూ అన్నది అమృత.

"అవునమ్మా."

"ఇక్కడికి రావడానికి జంకుతున్నాడు."

"వాళ్ల నాన్న మంచివాడు కాదమ్మా."

"నాకు చచ్చిపోవాలనిపిస్తోంది."

"ఛ! ఏం మాటలమ్మా అవి. నీకు ఏ లోటూ రాదు. నేనున్నాను తల్లీ."

తండ్రి మాటలతో అమృత మనసుని కుదుటపరుచుకుని ఆయన ఒళ్లోకి వాలిపోయింది.

శివరామశాస్త్రికి దేముడిమీద నమ్మకం. తను ఎవ్వరికీ అపకారం చెయ్యాలేదు. తనకు దేముడు అన్యాయం చెయ్యడు. వడిదుడుకులు సాధారణంగా వచ్చినా అవి అస్థిరాలుగానే ఉంటాయి. ఎప్పటిలాగా జీవితం ప్రశాంతంగానే గడుస్తుంది అని ఆయన నమ్మకం.

ఆయన దృష్టిలో అమృత నాట్యదేవత. ఓ కళామతల్లి. ఆమె మనసు నొచ్చుకుంటే సహించలేని మనసు ఆయనది. అమృత పెళ్లి విషయంలో శారదమ్మ మనసేమిటో తను ఊహించగలిగాడు. అయినా తను ఎవరి ఊహకూ అందే స్థితిలో లేడు. కూతుర్ని కాదని ఏదీ చెయ్యడు. ఆమె సుఖమే తను కోరుకునేది. ఆమె సంతోషమే తనకు కావాలి. అందుకు దేముడు తనకు అండగా ఉన్నాడన్న ధైర్యం శివరామశాస్త్రికి పుష్కలంగా ఉంది.

ఒక్కసారి గర్భగుడిలోకి చూశాడు. దేముడు తనకు అభయహస్తం ఇస్తున్నట్టుగానే ఉంది. 'పరమేశ్వరా' అనుకొంటూ కళ్లుమూసుకున్నాడు.

★ ★ ★

రమేష్‌కి కోపం తన్నుకొస్తోంది.

శారదమ్మ అమృతని తనకు దూరంగా ఉంచడానికి ప్రయత్నిస్తోందని తెలిసి ఆమెని చంపి పారేయాలనిపిస్తోంది.

పిడికిళ్లు బిగించి వదిలాడు. ఊరుదాటి పొలాలవైపు వెళ్లాడు. నీటికాలువలవెంట గట్లమీద ఎంతదూరం నడిచాడో?

చీకటి పడింది.

ఇంటికి రావడానికి బుద్ధిపుట్టడంలేదు.

నాయనమ్మ గుర్తుకొచ్చింది.

తనకోసం ఊరంతా తిరుగుతోంది పాపం.

వెనుదిరిగాడు.

ఇంటికి వచ్చేసరికి వీధివాకిట్లో లక్ష్మీదేవమ్మ ఎదురుచూస్తూ ఉంది.

"ఎక్కడికి పోయావురా చీకటిపడి ఎంత సేపయింది" అని ఆమె అడుగుతున్నా వినిపించుకోకుండా లోపలికి వెళ్ళాడు రమేష్.

పంచలో కట్టేసున్న కోడిపుంజుని ఒక చేత్తో పట్టుకొని రెండోచేత్తో దాన్ని నిమురుతూ ఉన్నాడు రంగారావు.

రమేష్‌ని చూడగానే కోడిపుంజుని నేలకేసి విసిరాడు.

ఆయనేదో మాట్లాడడానికి సిద్ధపడుతున్నాడని అర్థమయింది రమేష్‌కి. నిలబడి రంగారావువైపు తిరిగాడు. రంగారావుకి కోపం ఎక్కువవుతోంది.

ఇద్దరిమధ్యా తగాదా ప్రారంభం కాబోతోందని ఊహించింది లక్ష్మీదేవమ్మ.

"నువ్వు లోపలికి వెళ్ళరా" అంటూ రమేష్‌ని ఇంట్లోకి నెట్టుకొనిపోయింది.

"నాయనమ్మా. నాకు డబ్బులు కావాలి" లోపలికి వెళ్ళిన తర్వాత లక్ష్మీదేవమ్మని అడిగాడు రమేష్.

"నేను ఇస్తాను నాయనా నీకు ఎంత కావాలో చెప్పు"

"అయిదు వందలు"

"ఇస్తానయ్యా. ఎందుకు? ఏం అవసరం వచ్చింది? "

"కోడిపుంజును కొనుక్కోవాలి"

లక్ష్మీదేవమ్మకి షాక్ తగిలింది. మతిపోయి నిశ్చేష్టురాలయ్యింది.

"అదేం కోరిక నాయనా"

"అది అంతే! నువ్వు డబ్బులిస్తావా, ఇవ్వవా? "

"నా మాట వినవా"

"ఇప్పుడు నేను ఎవరిమాటా వినను. నాకు డబ్బులు కావాలి, అయిదువందలు"

"అయితే నేను ఇవ్వను"

"పెట్టె పగలగొడతా" అంటూ రమేష్ ఇనప్పెట్టె దగ్గరకి వెళ్ళాడు.

"ఇవిగో తాళాలు. నీకు ఎంత కావాలో అంత తీసుకో" అంటూ లక్ష్మీదేవమ్మ తాళాలగుత్తిని రమేష్‌వైపు విసిరేసింది.

"అదీ అట్లా అన్నావు బావుంది" అని రమేష్ తాళం గుత్తి అందుకుని పెట్టె తెరిచి అందులోంచి అయిదువందల రూపాయలు తీసుకొని పెట్టెకు తాళం వేసి వెనక్కు తిరిగాడు.

అక్కడే నిలబడి ఉన్న లక్ష్మీదేవమ్మ కళ్లలో నీళ్ళు తిరగడం చూసి చలించిపోయాడు.

"నాయనమ్మా ఏడుస్తున్నావా"

"ఇంక నాకేం మిగిలిందిరా. దేవుడు లాంటి భర్తను పోగొట్టుకున్నాను. పెళ్ళీడు కొచ్చిన మీ అక్కను పొట్టన పెట్టుకున్నాను. దేవతలాంటి కోడలు తనదారి తాను చూసుకొంది. పోతే కొడుకు కొరివి. నువ్వున్నావనుకుంటే చెయ్యి జారిపోతున్నావు" అంటూ ఏడ్చేసింది.

"నాయనమ్మా ఏడవకే! నువ్వేడిస్తే నేను చూడలేను" అంటూ రమేష్ లక్ష్మీదేవమ్మను పట్టుకొని బతిమిలాడసాగాడు. రమేష్ బతిమిలాడేకొద్దీ ఆమెలో దుఃఖం కట్టలు తెంచుకుని వచ్చేసింది.

నాయనమ్మని ఓదార్చడానికి రమేష్ చాలా ప్రయత్నం చేశాడు.

"నీకు దణ్ణం పెడతానురా. నామాట

వినరా. నువ్వొక్కడివేరా నాకు మిగిలింది" అంటూ రమేష్‌ని గుండెకు హత్తుకొంది లక్ష్మీదేవమ్మ.

రమేష్ హృదయం కరిగిపోయింది. తన కోసం నాయనమ్మ ఎంత బాధపడుతోందో తెలిసిపోయింది.

"నిన్ను బాధపెట్టను నాయనమ్మా" అని ఆమె కళ్ళు తుడిచాడు.

అప్పుడు రమేష్ కళ్ళు చెమ్మగిల్లాయి.

★ ★ ★

ఆ రాత్రి!

రమేష్‌కి నిద్రరావడంలేదు.

అస్తవ్యస్తంగా ఆలోచనలు వస్తూ మనసుని ఉద్రేకపరుస్తున్నాయి.

అమృతని కలుసుకోకుండా తను ఉండలేడు. వాళ్ళ అమ్మ అమృతని ఇల్లుదాటి రాకుండా కట్టడిచేసింది.

నాన్న మంచివాడయి ఉంటే తనకు ఇంత కష్టం వచ్చేది కాదు. అమ్మ బతికి ఉండేది. తనకు ఏలోటూ లేకుండా ఉండేది. తను ఇప్పుడు ఒంటరివాడు. అయినా సరే అమృత తనని ప్రేమిస్తోంది. తను అమృతను ప్రేమిస్తున్నాడు. ఇద్దర్నీ విడదీయడానికి ప్రయత్నిస్తే వాళ్ళ అంతం చూస్తాను. నాన్న అయినా సరే, శారదమ్మ అయినా సరే అడ్డువస్తే... ఆవేశంతో ఊగిపోయాడు.

అంతలో-

నాయనమ్మ గుర్తుకు వచ్చింది. శోకదేవతలా కూలిపోయిన లక్ష్మీదేవమ్మ కళ్లల్లో మెదిలింది.

ఆమె గుండెలో ఎంత దుఃఖం గూడుకట్టుకొని ఉందో. ఒక్కసారి పొంగిపొంగి వచ్చింది.

పాపం నాయనమ్మ.

ఎంత ఏడ్పు ఏడ్చింది.

అక్కనీ, అమ్మనీ, తాతనీ గుర్తుకు తెచ్చుకొని పొగిలిపొగిలి ఏడ్చింది.

అందుకు కారణం?

తనే!

తన ప్రవర్తనే

మూర్ఖంగా ప్రవర్తించాడా తను.

తనకోసం ఆమె ఎన్ని తిప్పలు పడుతోంది.

"నువ్వున్నావనుకొంటే నువ్వు గూడా చెయ్యిజారి పోతున్నావు" అని ఆమె అన్న మాటలు చెవిలో వినిపిస్తున్నాయి.

కన్న కొడుకుని అసహ్యించుకొంటూ తన మీద ఆశలు పెంచుకొంది.

మరి తనేం చేస్తున్నాడు.

ఆమెని ఏడిపిస్తున్నాడు.

మనసులో బాధ కలిగింది. లేచి లక్ష్మీదేవమ్మ మంచం దగ్గరకు వెళ్ళాడు. ఆమె అటువైపు తిరిగి పడుకొని ఉంది. మొహం కనబడకుండా చీరెకొంగు కప్పుకొని ఉంది.

అప్పుడు ఆమె ఏడుస్తూ ఉందని తెలిసిపోయింది రమేష్‌కి. వెళ్ళి ఆమె పక్కలో కూర్చున్నాడు.

లక్ష్మీదేవమ్మ గబుక్కున కళ్ళు తుడుచుకొని మొహంమీది చీర తొలిగించి రమేష్‌ని చూసి ఆశ్చర్యపోయింది.

"ఏంనాయనా" అన్నది. ఆమె గొంతు పూడుకుపోయి ఉంది.

"ఏడుస్తున్నావు కదూ, నాయనమ్మా?" రమేష్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"నన్ను క్షమించవూ. నిన్ను కష్టపెడుతున్నాను" అంటూ లక్ష్మీదేవమ్మ గుండెలమీద చిన్న పిల్లవాడిలా వాలిపోయాడు.

లక్ష్మీదేవమ్మ రమేష్ వీపుమీద చేతులు వేసి నిమిరింది.

"పిచ్చితండ్రీ నువ్వేం చేశావయ్యా. నా జాతకంలోనే ఉంది, కష్టాలు పడాలని"

ఆమె మాటల్లో నిర్లిప్తత ఉంది.

"ఇంకెప్పుడూ నిన్ను బాధపెట్టను నాయనమ్మా" అన్నాడు రమేష్.

"నా మాట విను నాయనా. నేను కోరుకొనేదల్లా నువ్వు సుఖంగా ఉండాలనే. మీ

నాయనతో నీకు పనిలేదు. అన్నీ నేను చూసుకొంటాను" అంది.

"అట్లాగే నాయనమ్మా! నువ్వు చెప్పినట్లే వింటాను సరేనా"

లక్ష్మీదేవమ్మ సంతోషంతో పొంగిపోయింది.

"నా తండ్రి మంచివాడు" రమేష్ నుదుట ముద్దుపెట్టుకొంది.

★ ★ ★

మూడోరోజు స్వాతి ప్రత్యక్షమయింది ఆ ఇంట్లో.

"హల్లో బావా, బాగున్నావా? " అని అడిగింది రమేష్‌కి ఎదురుగా వచ్చి

"ఆ!... ఎప్పుడొచ్చావు? "

స్వాతి సమాధానం చెప్పేలోపు లక్ష్మీదేవమ్మ అక్కడికి వచ్చింది.

"నేనే పిలిపించానురా రమేష్, నాకు వంట్లో నలతగా ఉంటేనూ. ఆ పనీ ఈ పనీ చెయ్యడానికని. నాలుగు రోజులుంటుంది. నీకేదన్నా అభ్యంతరం అయితే చెప్పు! పంపించేస్తా"

లక్ష్మీదేవమ్మ మాటలకి రమేష్ అడ్డు తగిలాడు.

"అదేమిటి నాయనమ్మా అట్లా అంటావు. స్వాతి ఇక్కడ ఉంటే నాకెందుకు అభ్యంతరం. నేను నీకెంతో స్వాతీ అంతే. ఈ ఇంట్లో నాకెంత స్థానం ఉందో స్వాతికీ అంతే"

లక్ష్మీదేవమ్మకి ఆనందంగా ఉంది.

"మా నాయనే! మా నాయనే! ఎంత మంచి మనసురా నీది" అంటూ స్వాతి వైపు తిరిగి "అమ్మా స్వాతీ వీడికేదన్నా తినడానికి చేసిపెట్టవే. నా తండ్రికి ఈమధ్య తిండికి కూడా కరువయ్యింది"

ఇంకా ఏదో అనబోతుంటే ఆమె గొంతులోంచి మాట రాలేదు. కళ్ళల్లోంచి నీళ్ళు టపటపా చెంపలమీదికి రాలాయి. అది చూసి స్వాతి చలించిపోయింది.

"ఏమిటే అమ్మమ్మా! ఏమయింది ఏడుస్తున్నావు? "

"వాళ్ళమ్మ పాపం వాడిని కొసరికొసరి తినిపించేది. ఏది కావాలంటే అది చేసిపెట్టేది. నేనేం పెట్టగలిగాను. చప్పిడి మెతుకులు తప్ప, ఏదన్నా చేసి పెడదామంటే నాలో ఓపికేది. అయినా నాకేం చేతనౌనని, చూడు వాడెంత చిక్కిపోయాడో. పిచ్చివాడిలా తయారయ్యాడు. ఈ యింటికి ఏం శని పట్టిందో. వాళ్ళ అమ్మని కబళించింది. దాంతోటే పోయింది ఈ యింటి కళ. తులసికోట చూడు ఎట్లా ఎండి వాడిపోయిందో. పసుపు, కుంకుమలతో రోజూ దీపారాధనలో వెలిగిపోయేది"

లక్ష్మీదేవమ్మ అలా అంటూ ఉంటే రమేష్‌కి అమ్మ గుర్తుకొచ్చి కళ్ళు చెమ్మగిల్లాయి. అతని మొహంలో రంగులు మారడం గమనించిన స్వాతి లక్ష్మీదేవమ్మ మరోమాట మాట్లాడకుండా "అమ్మమ్మా చెప్పవే బావకి ఏం చేసి పెట్టమంటావో? " అని అడిగింది.

"వాడి యిష్టం. వాడికి ఏది కావాలంటే అది"

స్వాతి రమేష్‌వైపు తిరిగి "చెప్పు బావా. ఏం కావాలి నీకు. లడ్డా, కారానా, జిలేబీలా, జాంగ్రీలా, వెజిటబుల్ బిరియానీనా, మటన్ బిరియానీనా, చికెన్‌పలావా... చెప్పు ఏం కావాలంటే అది"

స్వాతి అలా ఓ లిస్టు చెప్తూ ఉంటే లక్ష్మీదేవమ్మ కలుగచేసుకొని "అవన్నీ తరువాత చేసి పెడుదువుగాని ముందు నేతి మినప గారెలు చేసిపెట్టు" అని చెప్పింది.

"అదెంతసేపు అమ్మమ్మా. గంటన్నరలో రెడీచేసి పెట్టనా" అనేసి వెంటనే వంటింట్లోకి వెళ్ళి మినప బేడలు నీటిలో నానేసి వచ్చింది.

"నాయనమ్మా స్వాతిని కష్టపెడుతున్నావు" అన్నాడు రమేష్.

"లేదులేరా దాన్నేమన్నా బరువులు మొయ్యమన్నానా. బండలు కొట్టమన్నానా.

పిండివంటలు చెయ్యమన్నాను. ప్రేమతో చేసిపెడుతుంది. కమ్మగా ఉంటాయి"

"ఉంటాయి ఉంటాయి, ఎందుకుండవు. రెండు రోజులుంటుంది, వండిపెడుతుంది. కమ్మగా తింటాం మూడో రోజు నాకెందుకొచ్చిన శ్రమరా బాబు అని చెప్పాపెట్టకుండా చెక్కేస్తుంది"

"బావా బావా పొరబడుతున్నావు. నన్ను తక్కువగా అంచనా వేస్తున్నావు. నేనేం పిరికిదాన్ని కాను. వళ్ళు దాచుకొనే సోమరినేం కాను వెళ్ళిపోవడానికి. నువ్వే నేనున్నందుకు ఈర్ష్య పడతావు. ఎప్పుడెప్పుడు వెళ్ళిపోతుందా అని ఎదురు చూస్తుంటావు''

అంటూ లక్ష్మీదేవమ్మ మొహంలోకి చూస్తూ "అంతే కదూ, అమ్మమ్మా? " అంది.

అందుకు లక్ష్మీదేవమ్మ "వాడు అలాంటివాడు కాదులేవే. నాతండ్రి చాలా మంచివాడు. ఈర్ష్య, ద్వేషాలు, కుళ్ళు, కుట్ర అనేవి వాడి వంట్లోనే లేవు" అని రమేష్‌కి వత్తాసు పలికింది.

"అవున్లే మనవడు గదా" రాగంతీసింది స్వాతి.

"నువు మటుకు నాకు మనవరాలివి కాదా ఏమిటే"

"అయితే ఏంలాభం. నీకు బావమీదనే ప్రేమ ఎక్కువ"

"ఛ! అదేంకాదే. నాకు ఇద్దరూ ఒకటేనే పిచ్చిదానా!" లాలిస్తూ స్వాతిని దగ్గరకు తీసుకొని నుదుట ముద్దుపెట్టింది.

"వెళ్ళి గారెలు చెయ్యి" అని చెప్పింది.

"బావా సిద్ధంగా ఉండు తినడానికి నేతి గారెలు వేడివేడిగా" అంటూ స్వాతి రమేష్ వైపు చూసి వంటింటివైపు వెళ్ళిపోయింది.

'చలాకీపిల్ల' అనుకొంటూ పైకి అనేసింది లక్ష్మీదేవమ్మ.

రమేష్‌కి దగ్గరగావచ్చి "ఇన్నాళ్ళకు వచ్చింది ఈ ఇంటికి కళ" అంది.

"కలుపుగోలు మనిషి" అన్నాడు రమేష్.

"నీకు ఏది కావాలో అది చేయించుకో... సరేనా"

"సరేలేవే... నేనేం తిండిబోతునా ఏం? "

"అదికాదు నాయనా నా బాధ..."

"నాకు తెలుసు లేవే" అంటూ మిద్దెమీద ఉన్న ఇంట్లోకి వెళ్ళిపోయాడు రమేష్.

లక్ష్మీదేవమ్మ వంటింట్లోకి వెళ్ళి స్వాతి చెవిలో గూడుకట్టుకొంది.

స్వాతి గారెలు వండి ప్లేటునిండా పెట్టుకొని అల్లం చెట్నీ, మిరప్పొడితో తెచ్చి "బావా ఇంక నీదే ఆలస్యం" అంటూ రమేష్ ముందుంచి తను ఎదురుగా కూర్చుంది.

గారెలు ప్లేటునిండా ఉండటం చూసిన రమేష్‌కి మతిపోయింది.

"నీకంటికి నేనెలా కనబడుతున్నాను" అని అడిగాడు.

"నవమన్మధుడిలాగ" టకీమని చెప్పింది స్వాతి.

రమేష్ బిత్తరపోయాడు ఆమె సమాధానానికి. కాస్త కోపం కూడా వచ్చింది.

"నేనడిగింది నా రూపాన్ని గురించి కాదు. ఈ ప్లేటుని గురించి. ఇన్ని పెట్టావు నేనేం భీముణ్ణా, బకాసురుణ్ణా"

స్వాతి ఫక్కున నవ్వింది.

ఆమె నవ్వుతుంటే రమేష్‌లో కోపం ఎటుపోయిందో. అప్పుడు చూశాడు స్వాతిని కళ్ళార.

మల్లెపూవుల్లా పలువరుస. మొనదేలిన ముక్కు, మత్తెక్కించే కళ్ళు. చూసేకొద్దీ చూడాలనిపించే అందమైన రూపం.

స్వాతి నవ్వు ఆపడంతో రమేష్ ఆమెని చూడడం మానేసి గారెలు తినడం ప్రారంభించాడు. తింటూతింటూ అతనికి స్వాతిని చూడాలనిపించి తల పైకెత్తాడు. అప్పటిదాకా రమేష్‌ని చూస్తున్న స్వాతి ఏమీ ఎరగనట్టు చూపులు పక్కకు తిప్పుకుంది. అంతకుముందు ఎప్పుడు జారిందో ఆమె పైట భుజంమీదనుండి వళ్ళో పడిపోయి

ఉంది. రమేష్ చూపులు స్వాతి గొంతు కింది భాగంలో నిలిచిపోయాయి.

అది గమనించిన స్వాతి రమేష్ కళ్ళల్లోకి చూస్తూ "ఏమిటి చూస్తున్నావు? " అని అడిగింది.

"పైట జారింది"

"ఓ! అదా! బరువైంది బావా"

"బరువయిందని వదిలెయ్యడమేనా"

"ఏం చెయ్యమంటావు జారిపోతుంటేను"

"ఇప్పుడు పైట బరువైందని దాన్ని వదిలేస్తావు. ముందుముందు చీరె, లంగా బరువవుతాయి"

"ఏయ్ బావా! నువ్వు చాలా లోతుకుపోతున్నావు"

"నేనేం పోవడంలేదు. నువ్వే లాక్కుపోతున్నావు"

"ఆ! నువ్వు చిన్నపిల్లవాడివని నేను లాక్కుపోతున్నాను లోతుకి" వెటకారం చేస్తున్నట్టుగా కవ్విస్తూ అంది.

రమేష్ గారెల ప్లేటు ఖాళీ చేశాడు.

"నేనేం భీముణ్ణా, బకాసురుణ్ణా అన్నావుగా ముక్కమిగల్చకుండా లాగించావు" అంటూ దెప్పిపొడిచింది స్వాతి.

"రుచిగా ఉన్నాయిలే"

"డజనుకుపైగా పెట్టాను. ఒక్కటన్నా నాకు ఇచ్చావు కాదు. కనీసం నువ్వు తిన్నావా లేదా అని అడగలేదు" గోముగా అంది.

"సారీ స్వాతీ! ఆ ఐడియా రాలేదు"

"రాదులే మనసుంటేగా"

"నువ్వు మనసుమీద దెబ్బకొడుతున్నావు"

"ఏం పగిలిపోతుందా ఏమిటి"

"అంత తేలిగ్గా పగలదులే"

"ఇంకేం! అయినా నాకెందుకులే నీ మనసు వ్యవహారం. ఇవ్వాళా రేపూ ఉండి వెళ్ళిపోయేదాన్ని. రాత్రికి ఏం చెయ్యమంటావో చెప్పు అన్నంలోకి"

"అదేమిటి స్వాతీ! చిన్నపిల్లవాణ్ణి అడిగినట్టు అడుగుతున్నావు"

"అది అంతే స్వామీ. అంతా మీ నాయనమ్మగారి ఆజ్ఞ. తమ అనుమతిలేకుండా ఈ ఇంట్లో కాలు కదపకూడదట. ఏది చేసినా నిన్నడిగే చెయ్యాలట"

"అదేం? "

"మీ నాయమనమ్మని అడుగు నాకేం తెలుసు" కళ్ళు తిప్పుతూ లేచింది. రెండడుగులువేసి పోబోతూ "ఇంతకీ ఏం చెయ్యమంటావో చెప్పలేదు" అని అడిగింది.

"నీ యిష్టం"

"నీయిష్టం అంట నీయిష్టం. కాస్త ఉప్పు తగ్గించి కారం పట్టిస్తే చాలు జీవితాంతం గుర్తుంటాను" వెక్కిరిస్తూ వెళ్ళిపోయింది.

ఆమె ప్రవర్తనకి రమేష్ లోలోపల నవ్వుకొన్నాడు.

★ ★ ★

సాయంత్రం నీళ్ళు తోడి బాత్‌రూమ్‌లో పెట్టి "బావగారూ స్నానంచెయ్యండి" అంటూ రమేష్‌ని పిలిచింది స్వాతి.

రమేష్ బాత్రూమ్‌లోకి వెళ్ళగానే అతని వెంట స్వాతి గూడా లోపలికి దూరింది.

"నువ్వెందుకిక్కడ? " అని అడిగాడు రమేష్ స్వాతిని చూసి కంగారుపడుతూ.

"నీ వీపు రుద్దడానికి"

"వద్దులే, నేను రుద్దుకోగలను"

"అదేం కుదరదు. నీ వంటిమీద బెత్తెడు ఎత్తున మట్టి పేరుకుపోయిందట. సబ్బేసి బాగా రుద్ది స్నానం చేయించమని చెప్పింది మీ నాయనమ్మ"

రమేష్‌కి సిగ్గనిపించింది.

"అయితేమానిలే నేను రుద్దుకొని స్నానం చెయ్యగలను నువ్వెళ్ళు. ప్లీజ్" ప్రాధేయపడుతున్నట్టుగా అన్నాడు.

"అమ్మమ్మ నాకు అక్షింతలు వేస్తుంది. త్వరగా బట్టలిప్పుకో బరబరా రుద్దేసిపోతా" తొందరపెట్టింది స్వాతి.

"వద్దులే స్వాతీ నువ్వెళ్ళిపో"

"ఏం సిగ్గా? "

"ఎట్లన్నా కాస్త సిగ్గేకదా"

స్వాతి నవ్వింది.

"ఈ రోజుల్లో ఆడవాళ్ళే సిగ్గుపడడంలేదు నువ్వేందయ్యా బాబు. సిగ్గంటూ తెగ మెలికలు తిరిగిపోతున్నావు. వంటరిగా ఆడపిల్ల అదీ వరసైంది బాత్రూమ్‌లోకి వస్తే... అదే నేను మగ నువ్వు ఆడా అయి ఉంటేనా. ఈ పాటికి బాత్రూమ్ సెగలు పొగలతో గిలిగింతలు కొట్టకపోయిందా"

"స్వాతీ నువ్వు బరితెగించి మాట్లాడుతున్నావు"

"చాలాకాలానికి నువ్వు వంటరిగా దొరికావుగా లడ్డులాగా కరకరా కొరుక్కు తినాలనిపిస్తోంది. ఏం లాభం నువ్వు అవకాశం ఇవ్వడంలేదుగా"

"నీళ్లు చల్లారిపోతున్నాయి. ప్లీజ్ నువ్వు బయటకు వెళ్లవా"

"ఏం నేనుంటే నువ్వు స్నానం చెయ్యలేవా"

"ఆహా చెయ్యలేను"

"ఏం"

"నాకు సిగ్గు"

"నువ్వు సిగ్గు అంటూంటే నాకు సిగ్గుగా ఉంది. ఇంకా నీ ముందు సిగ్గులేకుండా ఉండాలంటే నాకు మహా సిగ్గుగా ఉంది. నే వెళుతున్నా జాగ్రత్తగా తలుపులేసుకో" అనేసి బాత్రూమ్‌లోంచి బయటకు వచ్చేసింది స్వాతి.

★ ★ ★

రాత్రి భోజనాలయిన తరువాత

"ఇలా రావే స్వాతీ" అంటూ లక్ష్మీదేవమ్మ స్వాతిని పిలుచుకొని పోయి బొడ్లోంచి తాళాల గుత్తిని తీసి బీరువా తెరిచింది.

అందులో రకరకాల ఆభరణాలు మెరుస్తూ కనబడ్డాయి.

"ఇవన్నీ మనవే" అన్నది లక్ష్మీదేవమ్మ.

"అవును కాదని ఎవరన్నారు. అయినా నాకెందుకు చూపిస్తున్నావు ఇప్పుడు?" విషయం అర్థంకాక అడిగింది స్వాతి.

"నాకెందుకో నీకు చూపించాలనిపించిందే. అయినా నీకుకాక ఎవరికి చూపిస్తాను. ఇవన్నీ నాకు మీ తాత చేయించాడు. ఇందులో ఒక్కటి కూడా మీ అత్తయ్య పెట్టుకోలేదు. పెట్టుకోమని ఎన్ని సార్లు చెప్పినా ఊహూ కనీసం పండగ పూట గూడా మెడలో వేసుకోలేదు. ఆమె పట్టుదల ఏమిటో ఎవరికీ అర్థం కాదు. జీవితం బాగు చేసుకొన్నా, నాశనం చేసుకొన్నా అంతా మన చేతుల్లోనే ఉంది. కుటుంబం మొత్తం ఇంట్లో ఉన్న ఆడదాని మీద ఆధారపడి ఉంది. మొగుడుకి సుఖాన్నివ్వడమే కాదు పెళ్లాం చెయ్యవలసింది. నయానా భయానా చెప్పి రాజుకి మంత్రిలా పని చెయ్యాలి. ఎంతటి మగవాడిని అయినా సరే చిరునవ్వుతో లొంగదీసుకోవచ్చు కనుసన్నలతో కొంగున కట్టేసుకోవచ్చు నిజం చెప్పాలంటే మీ తాతయ్య మీ మావయ్యకన్నా మహా మూర్ఖుడు. పరమకోపిష్టి. ఆయనతో నేను కాపురం చెయ్యాలా? ఎడమొహం పెడమొహంగా ఉన్నానా? మాటలతోటే వశపరచుకొన్నాను. మంచి మనసుతోటే మార్చుకొన్నాను. ఆయనలో మూర్ఖత్వం ఎటుపోయిందో. నన్ను ప్రేమించడం నేర్చుకొన్నాడు. ఎంతగా ప్రేమించడం నేర్చుకొన్నాడంటే అందుకు నిదర్శనమే ఈ నగలు. వద్దంటున్నా వినకుండా చేయించాడు" అంటూ చెప్పింది.

"నువ్వు చెప్పిందంతా నిజమే అమ్మమ్మా! అందుకు నేను నిన్ను అభినందిస్తున్నాను కూడా. అయితే ఒకటి అడుగుతాను చెప్పు. అత్తయ్య కాపురానికి వచ్చిన తర్వాత ఎప్పుడన్నా నువ్వు ఆమెను సాటి ఆడదానిగా

చూశావా చెప్పు? కనీసం ఆమెకి సన్నిహితంగా ఉన్నావా. నువ్వుగానీ మావయ్యగానీ మా అమ్మగానీ అత్తయ్య మీద పెత్తనం చెలాయించని రోజు ఏదన్నా ఉందా? "

స్వాతి అలా అడుగుతుందని ఊహించలేదు లక్ష్మీదేవమ్మ. గతుకుల్లోపడ్డ నాటు చక్రాల ఎడ్లబండిలా అయిపోయింది. తొట్రుపాటు పడుతూ ఏదో చెప్పబోయింది. స్వాతి ఆమెకు అవకాశం ఇవ్వలేదు.

"అదే అత్తయ్యగాబట్టి సరిపోయింది. వేరే ఎవరైనా అయి ఉంటేనా! మెతకదైతే ఆత్మహత్య చేసుకొని చచ్చేది. గడుసుదైతే కిరసనాయలు పోసి మిమ్మల్ని తగలబెట్టేది. అత్తయ్యకు సహనం ఎక్కువ. ఆమెకి దేవుడిమీద నమ్మకం. ఎప్పటికైనా తన కాపురం చక్కబడక పోతుందాని ఆశపడింది. కనుకనే ఇద్దరి పిల్లలకి జన్మనిచ్చింది. ఆ బిడ్డలను చూసుకుంటూ వాళ్లకోసం బతికింది. పెళ్లీడుకొచ్చిన దాన్ని పొట్టన బెట్టుకొన్నారు. అందుకు కారణం నువ్వేగా. మీ స్వార్థం కోసం బలితీసుకొన్నారు"

లక్ష్మీదేవమ్మ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. అవి చూసి స్వాతి మాట్లాడడం మానేసింది.

"మనవడు, మనవరాలూ కళ్లముందుంటారని ఆశ పడ్డానమ్మా! అదే తప్పయింది" కొంగుతో కళ్లు తుడుచుకొంటూ అన్నది లక్ష్మీదేవమ్మ.

"అలా అనుకోవడం తప్పని నేను అనడం లేదు అమ్మమ్మా. అందుకోసం బలవంతంగా మెడలు వంచి తాళిబొట్టు కట్టించాలని అనుకోవడమే రాక్షసత్వం. ఏ ఆడదీ తనకు నచ్చని మగవాడితో కాపురం చెయ్యడానికి ముందుకు రాదు. అందగాడు కావచ్చు ఆస్తిపరుడు కావచ్చు అదే మనసుపడ్డవాడితో ఎన్ని కష్టాలకైనా ఎన్ని త్యాగాలకైనా సిద్ధపడుతుంది"

లక్ష్మీదేవమ్మ ముక్కు చీదుకొంటుంటే స్వాతికి పాపం అనిపించింది. అసలే ఆమె దిగులుతో ఉంది. ఇంకా తన మాటలు గోరుచుట్టుమీద రోకటిపోటులా తగిలి ఉంటాయి. జాలేసింది స్వాతికి.

"సారీ అమ్మమ్మా! ఏదో వాగేశాను. బాధ పడొద్దు ప్లీజ్" అనునయిస్తూ దగ్గరగా వచ్చి ఆమె కళ్లు తుడిచింది.

లక్ష్మీదేవమ్మ బీరువామూసి తాళం చేతులు తెచ్చి స్వాతి చేతిలో పెట్టింది.

★ ★ ★

రాజమండ్రిలో జ్యోతిర్వేద సదస్సు జరుగుతోంది. రమ్మని ఆహ్వాన పత్రం వచ్చింది పరమేశ్వరశాస్త్రికి.

ఆయనకీమధ్య ప్రయాణాలు ఎక్కువైనాయి. సభలకీ, సమావేశాలకీ హాజరౌతున్నాడు. జనన లగ్నాలనుబట్టి ఆయుఃప్రమాణం నిర్ధారించి భవిష్యత్ చెప్పడంలో మంచి పేరు సంపాదించుకున్నాడు. అందుకు నైనిటాల్ ప్రయాణం బాగా దోహదపడింది. దేశం నలుమూలల నుండి వచ్చిన పండితులతో పరిచయాలు కావడం, వాళ్లతో చర్చలు జరపడంతో ఆయన గుర్తింపులోకి వచ్చాడు. కష్టపడి నేర్చుకొన్న విద్య పేరు తెచ్చిపెడుతోందని సంతోషించాడు.

కానీ స్వంత ఊళ్లో స్వంత మనుషులు తనను గుర్తించకపోవడం బాధగా ఉంది. అయినా ఎప్పుడో ఒకప్పుడు వాళ్లే తన పరిజ్ఞానాన్ని గుర్తిస్తారని పరమేశ్వరశాస్త్రికి గట్టి నమ్మకం.

జ్యోతిర్వేదానికి సంబంధించి సదస్సు జరుగుతోందని తెలియడంతో ఆయనకి సంతోషం అయింది. జ్యోతిష్యానికి, ఆయుర్వేదానికి సంబంధం ఉందని, జ్యోతిర్వేదం అన్ని శాస్త్రాలకూ మూలమని, దీనిద్వారానే భూతభవిష్యత్ వర్తమాన కాలాలకు సంబంధించిన అవగాహన కలుగుతుందని

ఆయన నమ్మకం. సదస్సులో ఆ విష యంపై విపులంగా వివరించాలని అనుకొన్నాడు.

రాజమండ్రి బయలుదేరుతూ వర్ధనమ్మ నుగూడా తనతో ప్రయాణంకమ్మన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"ఇప్పుడు కాదులెండి మరోసారి వస్తాను" అని సున్నితంగా తప్పుకొంది వర్ధనమ్మ.

నిజానికి భర్తతో వెళ్లాలని ఉంది వర్ధన మ్మకి. కానీ ఆమె మనసు చంద్రశేఖర్ పెళ్లి విషయం గురించి ఆలోచిస్తూ ఉంది.

చంద్రశేఖర్ కాకినాడనుండి రాగానే అక్కడ జరిగిన విషయాలన్నీ చెప్పాడు. అప్పుడు పరమేశ్వరశాస్త్రి కాకినాడకు లెటరు రాశాడు. ఆ లెటర్‌లో మాధవి పెళ్లి విష యంలో మీరు తొందర పడనవసరం లేదు అని రాశాడు.

ఆ వాక్యం వర్ధనమ్మకి నచ్చలేదు.

ఏదో ఒక సమయంలో పరమేశ్వరశాస్త్రి మంచి మంచి మాటలు చెప్పి తనచేత చంద్రకి మాధవిని చేసుకోడానికి ఒప్పిస్తా డని వర్ధనమ్మ అనుమానం. అందుకు ఆయనకి ఆ అవకాశం ఇవ్వకుండా తనే అన్నయ్యతో మాట్లాడాలని అనుకొంది.

ఆ ఉద్దేశంతో ఆమె రాజమండ్రికి ప్రయాణం కాలేదు.

"నామాట విని బయల్దేరు. అన్నిటికీ తల అడ్డంగా తిప్పకు. వచ్చిన అవకాశాన్ని వినియోగించుకో" అన్నాడు పరమేశ్వర శాస్త్రి.

"దయచేసి నన్నీ ఒక్కసారికి వదిలె య్యండి. ఇంకెప్పుడు రమ్మన్నా వస్తాను" తెలివిగా తిరస్కరించింది.

"సరే నీ ఇష్టం. నీకు అదృష్టం లేదు. నేనేం చెయ్యగలను" అని ఆ రాత్రికి రాజ మండ్రి బయల్దేరి వెళ్లాడు పరమేశ్వరశాస్త్రి.



లక్ష్మీదేవమ్మలో ఉన్న భయం, ఆందో ళనా మాయమై ఆమెలో నూతనోత్సాహం చోటుచేసుకొంది.

స్వాతి రాకతో ఆ ఇంటి వాతావరణం మారిపోయింది.

ఆమె ప్రవర్తన రమేష్‌కి బాగా నచ్చింది. ఆమెలో అందం ఉంది, అణకువ ఉంది. మాట్లాడే తీరులో మంచి ఆకర్షణ ఉంది. తల్లిలా లాలిస్తుంది. స్నేహితుడిలా హితవు చెప్తుంది. అప్పుడప్పుడు కోపాన్ని ప్రదర్శి స్తుంది. బావకదా అని కాస్త చిలిపిగా కూడా ప్రవర్తిస్తుంది.

అది లక్ష్మీదేవమ్మకి ఆనందాన్ని తెచ్చిపె ట్టింది. ధైర్యం చేసి తను స్వాతిని పిలిపిం చడం మంచిదే అయింది అనిపించింది ఆమెకి.

స్వాతి-రమేష్ ఒకటైతే చాలు. తన ప్రయత్నం ఫలించినట్లే! తన వంశం నిలబ డినట్టే.

కళ్లముందు మనవడూ, మనవరాలు చిలకా గోరింకల్లా ఉండాలని ఎన్నిసార్లు మొక్కుకొన్నదో దేవుడికి.

మరి దేవుడు తన మొక్కు తీరుస్తాడా?

లేకుంటే...?

ఆమె ప్రాణం విలవిల్లాడిపోతోంది.

స్వాతి మనసులో ఏం ఉందో,

రమేష్ తన మనసులోంచి అమృతను తీసేసి ఆ స్థానం స్వాతికి ఇవ్వగలడా?

ఎంతటి మగవాడైనా ఆడదాని కనుసన్నలకు దాసుడవుతాడనే నమ్మకం లక్ష్మీదేవమ్మకి పుష్కలంగా ఉంది.

ఆమె ఆంతర్యం రమేష్ ఊహలకి అందకుండా పోలేదు. అందనిదల్లా స్వాతి ఆంతర్యమే.

ఆ ఇంటి పెత్తనం అంతా ఆమెదే అన్నట్టు లక్ష్మీదేవమ్మ చేతిలోంచి తాళాల గుత్తి స్వాతి చేతిలోకి వచ్చింది.

★ ★ ★

బాగా పొద్దుపోయింది.

నిద్ర పట్టడం లేదు రమేష్‌కి.

అమృత జ్ఞాపకాలతో అతని మనసు ఉద్వేగ భరితమైంది.

అప్పుడప్పుడూ స్వాతి అమృత స్థానాన్ని ఆక్రమించుకొని రమేష్ హృదయాన్ని తికమక పెట్టసాగింది.

అమృత పిలుస్తున్నట్టూ...

స్వాతి కవ్విస్తున్నట్టూ...

అమృత నవ్వులు...

స్వాతి కనుసైగలు...

అమృత... స్వాతి...

అతని మనసు పట్టు తప్పుతోంది.

మంచంమీది నుండి లేచి గది బయటికి వచ్చాడు.

చల్లనిగాలి... నిశ్శబ్ద వాతావరణం.

అప్రయత్నంగా డాబా మీదనుండి కిందకి దిగాడు.

స్వాతి గదిలో లైటు వెలుగుతోంది.

అటువైపు నడిచి కిటికీ దగ్గర నిలబడి లోపలికి చూశాడు.

స్వాతి మంచం మీద పడుకొని ఏదో పుస్తకం చదువుకొంటోంది. కిటికీ దగ్గర అలికిడికి ఆమె తల్ల తిప్పి చూసి ఆశ్చర్యపోయింది. రమేష్ తిరిగి వెళ్లిపోతున్నాడు.

పుస్తకం పక్కనబెట్టి లేచి కూర్చుంది.

రమేష్ తన గదిలోకి వెళ్లాడు. పిడికిలి బిగించి అటూఇటూ తిరిగి వచ్చి మంచం మీద కూర్చున్నాడు.

ఊహూ

మనసు నిలవలేదు.

లేచి వాకిట్లోకి వెళ్లాడు. మళ్లీ లోపలికి వచ్చాడు.

స్వాతి అక్కడికి వచ్చింది.

రమేష్‌కి ఆమెను చూడగానే హృదయ స్పందన వేగం పుంజుకొంది.

సన్నజాజుల గుభాళింపు ముక్కులకు సోకింది.

రమేష్‌కి అయోమయంగా ఉంది. ఏం మాట్లాడాలో తెలియడంలేదు.

స్వాతి రమేష్‌కి ఎదురుగా వచ్చి నిలబడింది.

చిన్నగా నవ్వింది.

రమేష్‌లో మౌనం.

"ఏమిటి బావా మాట్లాడవు" అని అడిగింది స్వాతి.

"స్వాతీ నేనొకటి అడగనా" అన్నాడు.

"అడుగు బావా"

"నన్ను గురించి నువ్వేం అనుకొంటున్నావు?"

స్వాతికి వెంటనే సమాధానం దొరకలేదు. తర్వాత అన్నది "అదే నేను నిన్ను అడగాలనుకొంటున్నాను. నా గురించి నువ్వేం అనుకొంటున్నావో అని"

"నిన్ను గురించి నేను చాలా ఉన్నతంగా ఊహించుకొన్నాను. అమ్మ అప్పుడప్పుడూ చెప్పేది. స్వాతి చాలా మంచిది. మనసు సున్నితం అని. అది నువ్వొచ్చిన రోజే నిజమైంది. ఆ రాత్రి నాయనమ్మతో నువ్వన్న మాటలు నేను విన్నాను"

"అవునా... అప్పుడెక్కడ ఉన్నావు నువ్వు"

"అనుకోకుండా అటు వచ్చానులే. నాయ

# ఏరినముత్యాలు

★ వాగ్ధాటికంటె తూచి తూచి మాట్లాడటం ప్రశస్తం.

—బేకన్

★ పొగడ్త నాలుక చివరినుంచి వచ్చేది, ప్రశంస గుండె లోతులనుంచి వచ్చేది.

—డేల్‌కార్నెజి

★ దైవికం అనేది అర్థంలేని మాట. కారణం లేనిదే కార్యం లేదు.

—వోల్టేర్

★ ప్రచారాన్ని ఆశించే దానం దానం కాదు.

—హట్టన్

★ ఒక దురలవాటుకు అయ్యే ఖర్చులో ఇద్దరు పిల్లల్ని పెంచవచ్చు.

—ఫ్రాంక్లిన్

★ శ్రమతో శరీరం రాటుదేలినట్టు కష్టాలతో మనస్సు రాటు దేలుతుంది.

— సెనెకా

★ కారుచీకటి ముసుగులాగ అసత్యం ఈ ప్రపంచాన్ని కప్పింది.

—గురునానక్

★ ఎంత గింజుకున్నా భగవదనుగ్రహం లేనిదే నువ్వేమి సాధించలేవు.

—రామకృష్ణపరమహంస

★ తన లోపం ఎరిగినవాడే పరిపూర్ణుడైన మానవుడు.

—గాలిబ్

★ తెలివైన తండ్రి కొన్నకొడుకును గుర్తిస్తాడు.

— షేక్స్‌పియర్

★ అన్యాయపుమార్గాల ద్వారా సొమ్ము సంపాదిస్తే దాని ఫలితం అనుభవించక తప్పదు.

—కొరాన్

★ ఉపాధ్యాయుడు పాఠము బోధించుటతోపాటు ఉత్తమ జీవితమును గడిపి ఆదర్శప్రాయుడుగా నుండవలెను.

—గాంధీజీ

★ దేవుడు సాక్షాత్కరించినట్లు భావించి మనం పూజ చేయవలసియున్నది. పూజలో నా మనస్సు లీనం కాకుండా వుంటే నేను పూజ చేయనట్లే.

—కన్‌ఫ్యూషియస్

★ ప్రపంచాన్ని కూలంకషంగా అవగతం చేసుకొనడం ఒక్కటే దానినుండి రక్షణ పొందడానికి సాధ్యం.

—లాక్

★ ఉదయం ఆలస్యంగా నిద్రలేచేవాడు ఎవడూ గొప్పవాడు కావడం నేను ఎరగను.

—స్విఫ్ట్

సేకరణ : కె.వి.యన్. పద్మావతి

నమ్మని కంట తడి పెట్టించావుగా"

"ఆమె తన గొప్పలు చెప్పుకొంది. నేను యదార్థం మాట్లాడాను. తప్పు తెలుసుకొని ఏడ్చేసింది"

"అప్పుడు నువ్వు చివర్లో ఒక మాట అన్నావు గుర్తుందా. 'ఏ ఆడదీ తనకు నచ్చని మగవాడితో కాపురం చేయడానికి ముందుకు రాదు. అందగాడు కావచ్చు ఆస్తి పరుడు కావచ్చు అదే మనసు పడిన వాడితో ఎన్ని కష్టాలకైనా ఎన్ని త్యాగాల కైనా సిద్ధపడుతుంది' అన్నావు. ఆ విషయం కేవలం ఆడవాళ్లకేగాదు మగవాళ్లకి కూడా వర్తిస్తుంది" అన్నాడు.

స్వాతికి అప్పుడు అమృతం సేవించినంత సంతోషంగా ఉంది. చప్పున రెండు చేతులతో రమేష్ తలవంచి అతని నడినెత్తిన ముద్దు పెట్టుకొని "మీ అమ్మ ఇక్కడేగా నిన్ను ముద్దు పెట్టుకొనేది" అని అంది.

రమేష్‌కి ఆశ్చర్యం అయ్యింది.

"స్వాతీ" అన్నాడు.

"అవును బావా. నేను నీ దగ్గర అతిగా ప్రవర్తించాను. క్షమించు. అది అంతా కావాలనే"

"నేనెప్పుడో ఊహించాను స్వాతీ. నాయనమ్మ నిన్ను నామీద ప్రయోగించిందని"

"అది నిజమే... కానీ అమ్మమ్మ మనసులో ఏ చెడు ఆలోచనాలేదు. ఆమె కోరుకొనేదల్లా నీ సుఖమే. నువ్వంతా తాత పోలికట. నీలో తాతని చూసుకొంటుందట. నీకేదన్నా అయితే ఆమె బతకలేదు. పాపం బాగా దిగులు పడింది. అప్పుడప్పుడు తనలో తాను కుళ్లికుళ్లి ఏడుస్తుంది"

"నాకు మటుకు ఆమెని ఏడిపించాలని కోరికా స్వాతీ"

అప్పుడు రమేష్ కళ్లు చెమ్మగిల్లాయి. అది చూసి స్వాతి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

★ ★ ★

సూర్యోదయం అయింది.

బద్ధకంగా లేచాడు రమేష్.

కిటికీలోంచి బయటకు చూశాడు. దొడ్లో తులసికోట చుట్టూ ముగ్గులు పెడుతోంది స్వాతి.

ఆమె ఎప్పుడు నిద్రలేచిందో తలస్నానం చేసి ఉంది. తడి ఆరని జుట్టును వదులు చేసి చివర రిబ్బను ముడేసింది.

పసుపు పూసిన మొహం, నుదుట ఎర్రటి తిలకం బొట్టు, మెడలో రెండుపేటల ముత్యాల గొలుసు ముచ్చటగా ఉంది.

చీరె కుచ్చిళ్ళు కొద్దిగా పైకిలాగి బొడ్లో దోపుకోవడం వల్ల కనబడే పచ్చనికాళ్ళు, కాళ్ళకున్న వెడల్పాటి వెండి గొలుసులు. చూసేకొద్దీ చూడాలనిపిస్తోంది.

శ్రద్ధగా ఆమె తులసికోట చుట్టూ ముగ్గులు పెడుతూ ఉంటే రమేష్‌కి అమ్మ గుర్తుకొచ్చింది. అక్కడ అమ్మ రోజూ పేడ కళ్లాపు చల్లి ముగ్గులుపెట్టేది. మధ్యాహ్నం స్నానంచేసి తులసమ్మకి దీపారాధనతో నైవేద్యం పెట్టిగాని తను భోజనం చేసేది కాదు. కార్తీక మాసంలో అయితే వేకువజామున చన్నీటితో స్నానం, ఉపవాసాలతో పూజలు.

అమ్మ జ్ఞాపకంతో రమేష్ కళ్ళు చెమ్మగిల్లాయి.

స్వాతి అక్కడికి ఎప్పుడు వచ్చిందో ఆమెని రమేష్ చూడలేదు. అతని కళ్ళలో నీళ్ళు చూసి చలించిపోయింది.

"ఏమిటి బావా?" అంది.

"ఆ... ఏంలేదు" గబుక్కున కళ్ళు తుడుచుకొంటూ లేచి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఆరోజు ఆ మరుసటిరోజు ఆ ఇద్దరి మధ్యా కాలం యాంత్రికంగా కదిలిపోయింది.

మూడోరోజు మధ్యాహ్నం రమేష్ భోజనం చేసి తన గదిలో ఉన్నాడు. స్వాతి అతనికి దగ్గరగా వచ్చింది.

"నువ్వొట్టి పిరికివాడివి" అంది.

రమేష్ తెల్లబోయి స్వాతి ముఖంలోకి చూశాడు.

"అని నేను అనడంలేదు. అమృత. నీ అమృత అంది"

రమేష్‌కి చురకలా తగిలింది. ఏదో అన బోతుంటే స్వాతి ఆ అవకాశం ఇవ్వకుండా తనే అంది.

"ప్రేమించడంలో లేదు గొప్పదనం. ప్రేమించినదాన్ని పెళ్ళి చేసుకోవడంలో ఉంది. ఎన్ని అడ్డంకులు ఎదురైనాసరే ధైర్యంగా ఎదుర్కొని పెళ్ళి చేసుకునే దమ్ముండాలి. అదే మగతనం. ఆడది నమ్మి నవాడి కోసం అన్నీవదులుకొని రావడానికి సిద్ధపడుతుంది. దేనికైనా తెగిస్తుంది. అమృత ఇప్పుడు అందుకు ఎదురుచూస్తూ ఉంది"

"స్వాతీ..."

"నాకు అంతా తెలుసు బావా. నువ్వి ప్పుడు ఆలస్యం చెయ్యడం మంచిదికాదు. చంద్రశేఖర్‌తో అమృత పెళ్ళికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అదే జరిగితే అమృత బతకదు. నువ్వు నిజంగా అమృతని ప్రేమి స్తుంటే వెంటనే ఆమెని పెళ్ళిచేసుకో. నీ వెంట ఎక్కడికి రావడానికైనా సిద్ధంగా వుంది. నీలో ధైర్యం ఉంటే నీ వెంట తీసు కొనిపోయి పెళ్ళిచేసుకో. ఇదిగో తాళిబొట్టు" అంటూ స్వాతి మంగళసూత్రాలు ఉన్న పసుపు దారం తీసి చూపించింది.

రమేష్‌లో ఉత్సాహం ఉవ్వెత్తున ఉబి కింది. ఏదో తెగింపు అతనిని ఆవహిం చింది. చప్పున లేచి స్వాతి చేతిలోంచి మంగళసూత్రాలు అందుకున్నాడు.

అప్పుడు స్వాతి చెప్పింది,

"అమృత ఇప్పుడు శివాలయం మండ పంలో ఉంటుంది. నిన్ను చూడగానే వచ్చే స్తుంది. చింతలమ్మ గుడిలో ఆమె మెడలో తాళికట్టి నేరుగా ఇక్కడికి తీసుకొనిరా. అన్ని లాంఛనాలతో మీకు నేను స్వాగతం పలుకుతాను"

స్వాతి అలా అంటూ ఉంటే రమేష్ ఆమెనే చూస్తూ వుండిపోయాడు.

"ఏమిటి బావా అలా చూస్తున్నావు?" అని అడిగింది స్వాతి.

"నేను నిన్ను ఉన్నతంగానే ఊహించాను స్వాతీ. కానీ నేను ఊహించినదానికన్నా నువ్వు ఇంకా చాలా ఉన్నతంగా కనబడుతు న్నావు" అన్నాడు రమేష్.

"అదేంకాదు బావా. నీలో కాస్త బెరుకు ఉంది. దాన్ని తొలిగించగలిగితే చాలు. నీకు అండగా నేను ఉన్నాను. నువ్వు ధైర్యం చెయ్యగలిగావంటే అంతా సవ్యంగానే జరు గుతుంది... మీ నాన్నగానీ ఏదన్నా అడ్డం వచ్చాడా... కర్రతీసుకో... కాళ్ళు రెండూ విరగొట్టి పారెయ్... పీడా వదిలిపోతుంది"

ఆ సమయంలో రమేష్‌కి స్వాతి వరప్ర దాయినిలా కనబడింది. ధైర్యలక్ష్మిలా వెన్ను తట్టి నిలిచింది.

ఆలస్యం చెయ్యరాదన్న ఆలోచన కలిగి శరవేగంతో అక్కడినుండి దూసుకొనిపో యాడు.

స్వాతి చెప్పినట్టుగానే అమృత శివా లయం మండపంలో ఎదురుచూస్తూ వుంది. ముఖద్వారంలో రమేష్ కనబడగానే అమృత వెనకాముందూ చూడకుండా పరిగె త్తుకుంటూ వచ్చేసింది.

అలా వచ్చిన అమృత రమేష్‌కి నాలుగు అడుగులదూరంలో బ్రేకు పడ్డట్టు ఆగిపోయి గిరుక్కున వెనక్కి తిరిగి ఎంత వేగంతో అయితే వచ్చిందో అంతకు రెట్టింపు వేగంతో ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఆమె చర్య రమేష్‌ని విస్మయంలో పడే సింది. విషయం అర్థంకాలేదు. వెనక్కి తిరిగి చూశాడు.

అక్కడ రంగారావు నిలబడి ఉన్నాడు. ఆయన కళ్ళు ఎర్రగా ఉన్నాయి. రమేష్ క్షణం ఖంగుతిన్నాడు. తర్వాత తేరుకొని రంగారావు కన్నా కోపంగా ఆయనవైపు చూచి వెళ్ళిపోయాడు.

రంగారావు నేరుగా ఆలయంలోకి వెళ్ళాడు.

అప్పుడే గర్భగుడిలోకి వెళ్ళబోతున్నాడు శివరామశాస్త్రి.

"ఏమయ్యా, శివరామయ్యా" అని పిలిచాడు.

ఆ పిలుపులో కర్కశత్వం కనబడుతోంది.

శివరామశాస్త్రి రంగారావుకేసి తిరిగాడు. ఆయన కోపంతో ఊగుతున్నాడని తెలిసింది.

"నీ కూతురికి పెళ్ళిచెయ్యవా? బరితెగించి ఊరిమీద తిరుగుతోంది. ఇంకొక్కసారి ఆ పిల్ల నా కొడుకుతో కనబడిందా కాళ్ళు విరగ్గొట్టి, కాష్టంలోకి పంపుతా" అనేసి రంగారావు విసురుగా వెళ్ళిపోయాడు.

శివరామశాస్త్రి మాట్లాడడానికి కూడా అవకాశం ఇవ్వలేదు.

రంగారావు మాటలు శివరామశాస్త్రికి ఆ క్షణంలో కోపాన్ని తెప్పించాయి. మరుక్షణంలోనే శివలింగంకేసి చూశాడు.

"పరమేశ్వరా" అనుకుంటూ కుప్పలా కూలిపోయి శివలింగం మీద తల వాల్చాడు.

గుండెల్లోంచి దుఃఖం తన్నుకొచ్చింది. కళ్ళల్లోంచి రెండు నీటిబొట్లు రాలి శివలింగం మీదపడ్డాయి. దాదాపు స్పృహ తప్పాడు.

అప్పుడు ఎక్కడినుండి వచ్చిందో గాలి, ధ్వజస్థంభానికి వేలాడుతున్న గంటల్లో చలనం మొదలయ్యింది. క్షణక్షణానికి ఆ గంటల గోల ఎక్కువయ్యింది. మంటపం మధ్యలో ఉన్న పెద్ద గంట అటూ ఇటూ ఊగసాగింది. గాలి సుడిగాలిలా మారి వాన మొదలయింది.

అమృతా, రమేష్ ఒకరినొకరు చేతులు పట్టుకొని పరిగెడుతున్నారు. వాళ్ళ వెనుక రంగారావు తరుముకొస్తున్నాడు. అతని చేతిలో పెద్ద కర్ర ఉంది.

వాన వెలిసింది. సూర్యకిరణాలు తీక్షణంగా తాకుతున్నాయి.

చింతలమ్మ గుడిముందు నిలబడి ఉన్నాడు శివరామశాస్త్రి. ఆయనకి ఎదురుగా వచ్చారు అమృత, రమేష్.

శివరామశాస్త్రి మంగళసూత్రం చూపిస్తూ, "నాయనా రమేష్, ఈ మంగళసూత్రం అమృత మెడలో కట్టు" అంటూ రమేష్‌కి ఇచ్చాడు.

రమేష్ అమృత మెడలో మంగళసూత్రం కట్టగానే వాళ్లని దీవించి తన హృదయానికి హత్తుకున్నాడు.

భుజాన కర్ర ఎత్తిపట్టుకొని కోపంతో ఊగిపోతూ యమకింకరుడిలా వస్తున్నాడు రంగారావు. ఆయన్నిచూడగానే శివరామశాస్త్రికి భయం కలిగింది. వెంటనే ధైర్యంగా నిలబడిపోయాడు. అమృతా, రమేష్‌లు ఆయనవెనక్కి వెళ్ళారు.

శివరామశాస్త్రి నిశ్చలంగా నిలబడ్డాడు.

"దేవుడు వాళ్ళకి పెళ్ళిచేశాడు. మంచిమనసుతో దీవించు" అన్నాడు దగ్గరగా వస్తున్న రంగారావుతో.

ఆ మాటలు వినేస్థితిలో లేడు రంగారావు.

"దేవుడు చేశాడా నువ్వు చేశావా? " రావడంతోటే భుజాన ఎత్తిన కర్రతో శివరామశాస్త్రి నెత్తిమీద బాదాడు.

"అబ్బా..." అంటూ ఉలిక్కిపడి లేచాడు.

ఎదురుగా శివలింగం ఉంది. తల తడుముకున్నాడు. తనకు ఏమీకాలేదు.

★ ★ ★

వర్ధనమ్మ ఆలోచిస్తూ ఉంది.

సాధారణంగా అమ్మాయిగలవాళ్ళు సంబంధాలు వెతుకుతూ మంచి సంబంధం తారసపడితే 'వచ్చి అమ్మాయిని చూసుకోండి. నచ్చితే కట్నకానుకలు మాట్లాడుకుందా'మంటారు. అది ఎప్పటినుంచో వస్తున్న ఆచారం.

అబ్బాయిగల వాళ్ళు ముందుకు వచ్చి 'మీ

అమ్మాయిని మేం చేసుకుంటాం' అనడం గూడా వుంది. అయితే అది అరుదు.

ఏదైనా అమ్మాయి తరపువాళ్ళు ప్రస్తావించకుండా అబ్బాయి తరపువాళ్ళు అమ్మాయిని అడగడం కాస్త ఎబ్బెట్టుగానే ఉంటుంది.

అయినా తను అమృత, చంద్రశేఖర్‌ల పెళ్ళి విషయం అన్నయ్య దగ్గర ఎలా ప్రస్తావనకు తీసుకుని రావాలి?

'అన్నయ్యా' మీ అమృతని మా చంద్రకి చేసుకోవాలనుకుంటున్నాం. అని అడగాలా? లేక 'అమృత పెళ్ళి విషయంలో నీ అభిప్రాయం ఏమిటి అన్నయ్యా? ' అని అడగాలా?

ఏదైనా తనకుతానుగా పోయి అడిగితే ఏంబావుంటుంది? వాళ్ళవైపునుండి ప్రస్తావన రాకుండా?

మొన్న వదిన వచ్చింది అమృతని చూడ్డానికి. చంద్రానికి ఇవ్వడానికి సుముఖంగా ఉన్నట్లు చెప్పింది. అయినా తను పోయి ఎవరినో అడగడంలేదు. సొంత అన్నయ్యనే అడుగుతుంది. ఇందులో నామోషి పడనవసరంలేదు. పోతే మరి అన్నయ్య సమాధానం ఎలా ఉంటుందో,

అమృతని చంద్రానికి ఇవ్వనని అంటాడా?

అనగలడా?

అలా అనడానికి చంద్రానికి ఏంతక్కువ. వాడికేకదా మాధవిని ఇవ్వడానికి రాజేశ్వరి తొందరపడుతోంది.

తను 'ఊc' అనకనే...

లేకుంటే మాధవీ, చంద్రల పెళ్ళి ఎప్పుడో జరిగిపోయి ఉండేది.

అదే జరిగితే...

రాజేశ్వరి తనమీద స్వారీ చేయదా. అత్తా భార్యలతో చంద్ర చేరిపోయి తను వంటరిదైపోతుంది. అప్పుడు తన మాటకేం విలువ వుంటుంది.

ఆలోచించేకొద్దీ వర్ధనమ్మని అసహనం కమ్మేయసాగింది.

అదే అమృత అయితే ఏ బాధా ఉండదు. ఎవరికీ తల వంచనక్కరలేదు. ఏది జరిగినా తన నేతృత్వంలోనే. ఇంకా ఆలస్యం చేయకూడదని అనిపించింది.

"చంద్రా ! నేనూ సునీత మీ మావయ్యగారింటికి పోతున్నాం. నువ్వెక్కడికీ వెళ్ళకు" అని కొడుక్కి చెప్పి సునీతతో బయలుదేరింది.

వీధి గుమ్మంలో పోస్ట్‌మాన్ ఎదురై సైకిల్ దిగాడు.

"శాస్త్రిగారికి లెటర్ ఉందమ్మా" అంటూ ఉత్తరాల కట్టలోంచి ఇన్‌లాండ్ లెటర్ తీసి ఇచ్చాడు.

'కాకినాడనుండే అయివుంటుంది. అన్నయ్యకి చెల్లెలు ఏమి రాసిందో' అనుకొంటూ వర్ధనమ్మ కవరందుకొని చదివింది.

హైదరాబాదునుండి దేవరాజుగారు రాసింది అది-

'మహారాజశ్రీ జ్యోతిష్య పండితులు పరమేశ్వరశాస్త్రిగారికి దేవరాజు అనేక నమస్కారములుచేసి రాయునది. నేను మీ జ్యోతిష్య పాండిత్యాన్ని గుర్తించనందుకు ముందుగా క్షమాపణలు వేడుకొంటున్నాను. నా విషయంలో మీరు చెప్పినది అక్షరాలా నిజమైనది. డబ్బు చాలా ఖర్చయిపోయినది. మానసికంగా నేను కొంతకాలం బాధలు అనుభవించాను. ఇప్పుడు కొంత ఉపశమనంగా ఉంది. ఫ్యాక్టరీ విషయంలో నా తొందరపాటు వలన చాలా కష్టాలను, నష్టాలను అనుభవించాను. దయచేసి మీరు వీలు చూసుకొని ఒకసారి వచ్చిపోగలరని ఆశిస్తున్నాను. మీ ఆశీస్సులు నాకు కావాలి. మీ రాకకోసం ఎదురు చూస్తూ ఉంటాను'

ఆ ఉత్తరాన్ని చదివి "హైదరాబాదు నుండి దేవరాజుగారు రాశారు. మీ నాన్నగారు రాగానే చూపించాలి, జాగ్రత్తగా

ఉంచు" అని చంద్రశేఖర్ చేతికిచ్చి వర్ధనమ్మ వెళ్ళిపోయింది.

★ ★ ★

వర్ధనమ్మ రావడంతో శారదమ్మకు ఆనందమయ్యింది.

ఆమె రాకకోసమే తను ఎదురుచూస్తూ వుండి. పెళ్ళి పెత్తనానికి వచ్చారంటేనే వాళ్ళకి మర్యాదలు చాలా గొప్పగా చేస్తారు. అందునా మగపెళ్ళివారు వస్తే అమ్మాయి తరపువాళ్లు చేసే మర్యాదలు అంతా ఇంతా కాదు.

వర్ధనమ్మ పరాయిదికాదు. స్వయానా తన ఆడబిడ్డ. పైగా పెళ్ళికొడుకు తల్లి కావడం విశేషం.

ఆమెకి ఎలా మర్యాదలు చెయ్యాలో తోచలేదు శారదమ్మకి. నట్టింట్లో మంచంవేసి దానిమీద పరుపుపరిచే ప్రయత్నం చెయ్యబోయింది. అది చూసి వారించింది వర్ధనమ్మ.

"ఏమిటి వదినా నాకు మర్యాదలు, నేను పరాయిదాన్నా ఏం. నాకు సర్వస్వతంత్రం ఉంది ఈ ఇంట్లో" అంటూ మంచం వాల్చనీయలేదు. తనే స్వయంగా చాప పరుచుకొని కూర్చుంది.

అమ్మా అత్తయ్య అంత ఆప్యాయంగా మాట్లాడుకొంటుంటే సునీతకి వింతగా వుంది. విషయం బోధ పడక అమ్మ పక్కనే కూర్చుని "వదినేది అత్తయ్యా?" అని అడిగింది శారదమ్మను.

"వాళ్ళ నాన్నకి ఎదురుగా కూర్చొని ఉంటుంది మంటపంలో" అని చెప్తూ శారదమ్మ, తల్లీకూతుళ్ళకి మంచినీళ్ళు ఇచ్చింది. తర్వాత కాఫీ కలిపి వాళ్ళకిచ్చి తనూ తాగుతూ వర్ధనమ్మకి ఎదురుగా కూర్చొంది.

సునీత కాఫీ తాగుతూనే గ్లాసు అక్కడ పెట్టేసి మంటపంలోకి వెళ్ళింది.

వదినా, ఆడబిడ్డలు మాటల్లో పడిపోయారు.

పావుగంట తర్వాత సునీత, అమృత అక్కడికి వచ్చారు.

"ఏమిటే అమృతా, ఈమధ్య నువ్వు రావడం మానేశావు" అని అడిగింది వర్ధనమ్మ.

అమృత ఏంమాట్లాడలేదు. పెదాలపైకి నవ్వు తెచ్చుకొంటూ వచ్చికూర్చుంది.

వర్ధనమ్మకి వింతగా ఉంది అమృత వాలకం. తను కనబడితే వాగుడుకాయలా గలగలా మాట్లాడే అమృత పెదవి విప్పడం లేదు. పైగా చిక్కిపోయి ఉంది.

"మీ అమ్మ సరిగ్గా అన్నంపెట్టడం లేదా ఏమిటే బాగా చిక్కిపోయావు"

"అదేంలేదు. నీ కళ్ళకి నేనట్లా కనబడుతున్నాన్లే అత్తయ్యా"

"నిజం అమృతా, నువ్వు బాగా చిక్కిపోయావు. కడుపునిండా అన్నంతిను. కాస్త వళ్ళు చేస్తే ముచ్చటగా వుంటావు"

"మీరు మాట్లాడుతూ ఉండండి" అని శారదమ్మ వంటింట్లోకి వెళ్ళింది.

కందిపప్పూ, మునక్కాయ పులుసు, బంగాళాదుంప తాలింపు, పచ్చడీ, వడియాలతో గంటకల్లా వంట తయారుచేసింది.

భోజనాలు అయిన తరువాత శివరామశాస్త్రి పంచలో మంచంమీద కూర్చున్నాడు. వర్ధనమ్మ ఆయనకి దగ్గరలో చాపమీద కూర్చుంది.

మామూలు విషయాలయితే అన్నయ్యతో ధైర్యంగా మాట్లాడేది. పెళ్ళి విషయం అనేసరికి కాస్త మొహమాటపడే పరిస్థితి అయ్యింది వర్ధనమ్మకి. పైగా ఆయన మనసులో ఏమి ఉందో ఎలాంటి సమాధానం వస్తుందో?

అయినా తనకేం ఖర్మ ఇలా వచ్చి 'నా కొడుక్కి నీ కూతురుని ఇవ్వు' అని అడగడం ఏమిటి. తన కొడుక్కి పిల్లని ఇచ్చేవాళ్ళు లేకనా?

ఆ క్షణం వర్ధనమ్మ మనసు ఎన్నివిధా

లుగా పోయిందో. రాజేశ్వరి గుర్తుకొచ్చింది. ఆమె మాట వాళ్ళ అన్నయ్య కాదనలేరు. మాధవీ, చంద్రశేఖర్‌ల పెళ్ళి జరిగిపోతుంది.

ఆ ఆలోచన వర్ధనమ్మ మనసులోకి దూరగానే ఆమె పెదాలు విచ్చుకున్నాయి.

"అన్నయ్యా చంద్రశేఖర్ విషయంలో నీ ఉద్దేశం ఏమిటి? " అని అడిగింది.

శివరామశాస్త్రికి విషయం బోధపడింది. ఆమె చంద్రం పెళ్ళివిషయం ప్రస్తావిస్తోంది. అందుకు తను చెప్పవలసిన సమాధానం ఆలోచిస్తున్నాడు.

శారదమ్మ వచ్చి వర్ధనమ్మ పక్కన కూర్చుంది. చెల్లెలికి అన్న చెప్పే సమాధానం ఏమిటోనని ఎదురు చూస్తూ వుంది.

ఆయన మౌనంగా ఉన్నాడు. ముఖంలో గాంభీర్యం పొడచూపుతోంది. చూపులు ఎక్కడో శూన్యంలో ఉన్నాయి.

"మిమ్మల్నే అడుగుతోంది" అంది భర్తని ఉద్దేశించి.

"వినబడుతోంది"

"చంద్రంకి పెళ్ళి చెయ్యాలనుకుంటున్నారు"

"మంచిదేగా"

"అమృతని వాడికి చేసుకోవాలనుకుంటోంది"

"చంద్రం బాగా చదువుకున్నవాడు. అమృత చదువు చిన్నప్పుడే ఆగిపోయింది. వాడికి చదువుకున్న అమ్మాయి అయితే బావుంటుంది" అన్నాడు శివరామశాస్త్రి. అది కూడా చాలా సున్నితంగా అన్నాడు.

భర్త మనసులో ఏంవుందో అర్థమయింది శారదమ్మకి. తను ఏం మాట్లాడాలో తెలియక వర్ధనమ్మ మొహంలోకి చూసింది.

"చదువు విషయం మేం చూడలేదన్నయ్యా. అమృత అంటే నాకు ఇష్టం. చంద్రం కూడా దాన్ని చేసుకోవడానికి ఇష్టపడుతున్నాడు" అంది వర్ధనమ్మ.

ఇక బయటపడక తప్పదనిపించింది శివరామశాస్త్రికి. "మంచిదే, బావుంది. వాడు దాన్ని చేసుకోవడానికి ఇష్టపడ్డట్లు అది కూడా ఇష్టపడాలిగా. ఆడవాళ్ళు తన భర్త తనకన్నా గొప్పవాడుగా ఉండాలని కోరుకుంటారు"

అహంమీద కొరడా ఝుళిపించినట్టయింది వర్ధనమ్మకి. శారదమ్మకి భర్తమీద కోపం వచ్చింది.

"ఏమిటండీ మీరంటున్నది. అర్థంపర్థం లేని మాటలు" అని కసిరింది.

"అమృత ఓ కళాకారిణి. నాట్యదేవత. నాట్యంలో దానికి తనకన్నా గొప్పవాణ్ణి కాకపోయినా కనీసం దీటైనవాణ్ణి అయినా భర్తగా తీసుకురావాలి"

వర్ధనమ్మకి సహనం చచ్చిపోయింది. ఆవేశం కట్టలు తెంచుకుంది. తన బిడ్డను చిన్నచూపు చూచినందుకు అక్కడ కూర్చో బుద్ధి కాలేదు. చప్పున లేచింది.

"ఎందుకన్నయ్యా ఈ మాటలు. చంద్రకి అమృతని ఇవ్వనని చెప్పొచ్చుగా. దానికి నాట్యం వచ్చు వాడికి రాదు అని కారణం ఎత్తి చూపుతావు. నిజానికి అమృతని చంద్రకి ఇవ్వకపోవడానికి అదేకారణం అయితే నేను నీ చెల్లెల్ని. నాకూ నాట్యం వచ్చు నువ్వు ఏ గురువు దగ్గరయితే నాట్యం నేర్చుకున్నావో నేనూ ఆ గురువు దగ్గరే నేర్చుకున్నాను. మర్చిపోయావేమో నాట్యంలో నేను నీకు తీసిపోను. చంద్రం కాకినాడకు పోయేవరకూ నాట్యం నేర్చుకున్నాడు. చదువుకుంటే మంచి ఉద్యోగంలో స్థిరపడి పోతాడని కాకినాడ పంపించాం. అన్నయ్యా కూతుర్ని కోడలిగా చేసుకోవాలని భ్రమతో వచ్చి అడిగినందుకు బాగా బుద్ధిచెప్పావు. నా బిడ్డని చులకన చేసి అవమానపరిచావు. చాలుచాలు చూడన్నయ్యా ఎందులో అయితే నీ బిడ్డని నువ్వు గొప్పగా చెప్పుకుంటున్నావో అందులోనే నా బిడ్డను

నీ బిడ్డకన్నా గొప్పగా తయారుచేస్తాను. మూడు నెలల్లో చంద్రం అమృతకన్నా అద్భుతంగా నాట్యం చేస్తాడు. కావాలంటే పందెంకాస్తా" ఆవేశంగా అంది.

"అది అసంభవం. ఈ వయసులో వాడు నాట్యం నేర్చుకోవడం సాధ్యంకాదు"

"సాధ్యం కాదనుకోవడం నీ భ్రమ. మూడు నెలల తరువాత నీకు ధైర్యం ఉంటే అమృతని పోటీకి నిలబెట్టు"

"ఓడిపోతాడు"

"గెలిస్తే"

"వాడి కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తాను"

"మాట తప్పవుగా మరి"

"తప్పను"

ఇంక క్షణం కూడా అక్కడ ఉండలేదు వర్ధనమ్మ. విసవిసా వెళ్ళిపోయింది.

★ ★ ★

అమృతలో దిగులు పుట్టుకొచ్చింది.

ఆమె పెళ్ళి విషయంలో శివరామశాస్త్రి వర్ధనమ్మతో పంతానికి పోవడం అమృతకి నచ్చలేదు.

చంద్రశేఖర్‌కి అమృతని ఇవ్వడం ఇష్టం లేదు శివరామశాస్త్రికి. ఆ విషయాన్ని వర్ధనమ్మ మొహాన చెప్పలేక తప్పించుకోవడానికి ఆయన చెప్పిన కారణం ఆమెకి అహం మీద దెబ్బ కొట్టినట్లయింది. అందుకు వర్ధనమ్మ రెచ్చిపోయి మాట్లాడడం శివరామశాస్త్రి అవమానంగా భావించి ప్రతిజ్ఞ చెయ్యడం అమృతని సంకటంలో పడేసినట్టయింది.

ఆ వయసులో చంద్రశేఖర్ నాట్యం నేర్చుకుని అమృతని ఓడించడం అనేది కల్లో కూడా జరగదని శివరామశాస్త్రి ధీమా. ఆ విషయం అమృతకు కూడా తెలుసు.

కానీ వర్ధనమ్మ అత్తయ్య మంచి పట్టుదల గల మనిషి. కొడుకుని అవమాన పరిచాడన్న కోపంతో ఉంది. చంద్రశేఖర్ బావ గాని సవాలుగా తీసుకుంటేనా...!

సవాలుగా తీసుకుంటే?

పట్టుదల వుంటే మనిషి సాధించలేనిది ఏదీ వుండదని నాన్న అన్నమాటలు ఆమె మస్తిష్కంలో మెదిలాయి.

చంద్రశేఖరం బావకి నాట్యకళ అంటే మంచి ఇష్టం. పైగా అతనికి! అందులో చిన్నతనంలోనే ప్రవేశం వుంది.

అయినా తాను ఓడిపోవడం జరగదు. పొరపాటున ఓడిపోతే...?

చంద్రశేఖర్‌తో పెళ్ళి, అతనితో కాపురం, వూహించే కొద్దీ అమృతలో భయం పుట్టుకు రాసాగింది.

నాన్న ఎంత పొరబాటు చేశాడు అనవసరంగా గొంతుమీదికి తెచ్చాడు.

ధైర్యంగా ఉండడానికి ఎంత ప్రయత్నించినా ఉండలేకపోతోంది. ఎక్కడో మనసు కీడుని శంకిస్తోంది.

రమేష్‌ని కాదని తను బతకగలదా? అతనితోనే జీవితాన్ని పంచుకోవాలనుకుంది. కాదని దేవుడు తనకు అన్యాయం చేస్తాడా?

చేస్తే...

గుండెల్లోంచి దడ మొదలయింది.

ఆలోచించేకొద్దీ ఆమెకి భవిష్యత్ అగమ్యంగా కనబడసాగింది.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు? "

శివరామశాస్త్రి అమృత పక్కనే వచ్చి కూర్చున్నాడు. అమృత ఆయన్ని గమనించలేదు.

"అత్తయ్యతో పంతానికి పోయి తొందరపడ్డావు నాన్నా" అంది అమృత ఆయన ముఖంలోకి చూస్తూ.

ఆమె మొహంలో దిగులు తాలూకు విచారరేఖలు స్పష్టంగా కనబడ్డాయి శివరామశాస్త్రికి.

"ఎందుకమ్మా భయపడుతున్నావు. చంద్రశేఖరంతో గెలవలేననా? నిన్ను నీవు తక్కువ అంచనా వేసుకుంటున్నావు. హనుమంతుడికి కూడా ఆయన బలం ఆయనకు తెలియదు, జాంబవంతుడు చెప్పేదాకా.

అవలీలగా సముద్రాన్ని లంఘించి అవతల లంకలో దిగాడు. నువ్వూ అంతే. ఏడేడు పధ్నాలుగు జన్మలెత్తినా చంద్రశేఖర్ నీతో పోటీపడి గెలవలేడు. ఆ నమ్మకం నాకుంది. దేవుడు మనకెన్నడూ అన్యాయం తలపెట్టడు. నువ్వు కోరుకున్న వాడితోనే నీ పెళ్ళి జరుగుతుంది"



శివరామశాస్త్రి అలా చెప్తుంటే అమృతకి ఉత్సాహం అయింది. ఆమెలో దిగులు తాలూకు భయం ఎటు పోయిందో మనసు పొరల్లోంచి ఊహలు పరవశించసాగాయి.

కడలి ఎగసి ఆకాశాన్ని అందుకొంది. అక్కడ మబ్బులు అలలు అలలుగా పరుగులు తీస్తున్నాయి. ప్రణయ పరిష్వంగంలో అమృత మెత్తని పూల పాన్పులో రమేష్ హస్త స్పర్శతో తీగెమీటిన వీణలా మారిపోయింది. ఏదో మత్తు ఆమెని ఆవహించింది. తమకంతో తనువు మరచి రమేష్‌ని చుట్టేసి పైకిలాక్కొంది.

"అమృతా" ఆమె చెవి దగ్గర ఆ పిలుపు.

అంత మత్తులోనూ అమృతకి ఏదో అనుమానం కలిగింది. కళ్లు తెరిచి చూసింది.



తన మొహం మీద చంద్రశేఖర్ మొహం... త్రుళ్ళిపడి లేచింది.

"ఏమిటమ్మా" అన్నాడు శివరామశాస్త్రి.

"నాకేదో భయంగా వుంది"

శివరామ శాస్త్రి చిన్నగా నవ్వాడు.

"అది నీ భ్రమ. నిజంగా నువ్వు భయపడ్డావంటే నువ్వు నేర్చుకొన్నదంతా బూడిదలో పోసిన పన్నీరే అవుతుంది. ధైర్యంగా వుండు. చంద్రశేఖర్‌ని గెలవాలని పట్టుదలతో వుండు. నేనున్నానమ్మా నీకు తోడు. ఇంకా ఎక్కువ ప్రాక్టీస్ చెయ్యి. గెలుపు నీదే"

తండ్రి ధైర్యం చెప్తుంటే అమృతలో ఆలోచనలు మొలకలెత్తాయి.

అయినా తనెందుకు భయపడాలి? చంద్రశేఖరం బావకి నాట్యకళలో ఏమాత్రం ప్రవేశం వుందని? ఎప్పుడో చిన్నప్పుడు కాకినాడకు వెళ్లక ముందు నాలుగు ముక్కలు నేర్చుకొన్నాడు. ఇప్పుడు ఇంకా పంతానికి పోయి పట్టుదలగా నేర్చుకొంటే ఇంకొంత నేర్చుకోగలడు. అంత మాత్రానికి తను భయపడటం అవివేకం. నాన్న అన్నట్లు ఏడేడు పధ్నాలుగు జన్మలు కాదుగదా ఇంకో పధ్నాలుగు జన్మలెత్తినా తనతో పోటీ పడి గెలవలేడు.

ఆ ఆలోచనలతో అమృతలో ధైర్యం మొదలైంది. భయం ముక్కలై నామరూపాలు లేకుండాపోయింది. గెలుపు తనదే అని అమృత ఆనందంగా నాట్యం ప్రాక్టీసు చేయసాగింది.

★ ★ ★

శారదమ్మకి అంతా అయోమయంగా వుంది.

అమృత పెళ్లి విషయంలో తను భర్తకి ఎదురు నిలబడి మాట్లాడలేక ఆడబిడ్డని ఆశ్రయించింది. కానీ ఆమె ప్రయత్నం ఆశించిన ఫలితాన్ని ఇవ్వలేదు. పైగా బెడిసికొట్టి వికృత రూపం దాల్చింది.

తానొకటి తలిస్తే దైవం వేరొకటి చేస్తాడంటే ఇదే కాబోలని అనుకొంది.

అన్నాచెల్లెలు పంతానికి పోయారు.

వర్ధనమ్మ కొడుకు కాళ్లకు గజ్జెలు కట్టింది. చంద్రశేఖర్ ప్రిస్టేజిగా తీసుకొని రెచ్చిపోయాడు. పరమేశ్వరశాస్త్రి ఇల్లు ఇప్పుడు ఒక నర్తనశాలగా మారిపోయింది.

శివరామశాస్త్రిలో పట్టుదల పెరిగింది. అమృతని ఉత్సాహపరుస్తూ చిన్న పిల్లవాడిలా ఉరకలేస్తూ శివాలయం ప్రాంగణాన్ని అమరనాట్యశాలగా మారుమ్రోగిస్తున్నాడు.

ఇప్పుడు పోటీ అమృత, చంద్రశేఖర్‌ల మధ్యకాదు, అన్నాచెల్లెళ్ల మధ్య అనే భావన కలిగింది ఊరి ప్రజల్లో.

గెలుపు శివరామశాస్త్రిది అని కొందరు అంటుంటే కాదు వర్ధనమ్మదేనని కొందరు అంటూ రెండు భాగాలుగా విడిపోయారు. వాళ్లకి అది మంచి వినోదంగా వుంది.

రమేష్‌కి ప్రాణ సంకటం అయింది. తను ఒంటరి వాడు. సలహాలిచ్చేవాళ్లుగానీ సంతోషపెట్టేవారుగానీ లేరు. నాయనమ్మ ఏం చేయగలదు? అమృతను తెచ్చి పెళ్లి చెయ్యగలదా, అమ్మలేదు, అక్కలేదు. వాళ్లిద్దరినీ నాన్న బలి తీసుకొన్నాడు.

నాన్న గుర్తుకు రాగానే రమేష్‌లో రక్తం వేడెక్కింది.

వాడొక రాక్షసుడు

రంగారావుపట్ల కసి, ద్వేషం పెరగసాగాయి.

స్వాతి చేసిన ప్రయత్నంలో ఆయన అడ్డు రాకుంటే ఇలా అయ్యేదికాదు.

ఇప్పుడు అమృత ఓడిపోతే... ఆ ఆలోచన రాగానే రమేష్ మస్తిష్కం విలవిల్లాడింది.

చింతలమ్మ గుర్తుకు వచ్చింది. వెంటనే ఆ అమ్మవారి గుడికి బయలుదేరాడు.

రమేష్ గుడి ప్రాంగణంలోకి అడుగు పెట్టేసరికి అక్కడ శారదమ్మ ఉంది. ఆమెని చూడగానే రమేష్‌కి అలర్జీ మొదలయింది.

గిరుక్కున వెనక్కి తిరిగాడు మరలా రావచ్చని.

శారదమ్మ చింతలమ్మకు మొక్కుకొని లేచేసరికి వర్ధనమ్మ పూలూ, పళ్లు తీసుకొని అక్కడికి వచ్చింది.

ఇద్దరూ ఒకరిని ఒకరు చూసుకొని ఆశ్చర్యపోయారు.

"ఏం వదినా అమ్మవారికి ఏం మొక్కుకొన్నావు" అని అడిగింది వర్ధనమ్మ.

"నువ్వేం కోరుకొంటావో నేనూ అదే కోరుకొన్నాను"

వర్ధనమ్మకి వదినపట్ల అభిమానం పెరిగింది.

"ఉండు పోదాం. నేను కూడా వస్తాను" అంటూ గుడిలోకి పోయింది వర్ధనమ్మ.

ఆమె తిరిగి వచ్చేవరకు అక్కడే వుంది శారదమ్మ.

★ ★ ★

రాజమండ్రిలో-

పరమేశ్వరశాస్త్రికి బ్రహ్మరథం పట్టారు.

మొదట్లో పరమేశ్వరశాస్త్రిని మామూలు జ్యోతిష్యుడే అనుకొన్నారు. తీరా ఆయన ప్రసంగాలను విన్న తర్వాత పరమేశ్వరశాస్త్రి ప్రతిభ తెలియసాగింది. జననలగ్నాన్ని బట్టి ఆయన భూత, భవిష్యత్, వర్తమానాలకు సంబంధించిన విషయాలు చెప్తుంటే తోటి పండితులకి పరమేశ్వరశాస్త్రిలో ఏదో మహత్తు వుందనిపించింది.

నాలుగు రోజుల్లో స్వగ్రామానికి రావలసిన పరమేశ్వరశాస్త్రి వారం రోజులకు గానీ రాలేకపోయాడు.

అగ్రహారంలో బస్సు దిగి ఇంటికి రాగానే ఆయనకి వర్ధనమ్మ చిన్నపిల్లలా గంతులేస్తూ చంద్రశేఖర్‌కి నాట్యం నేర్పుతూ కనిపించింది. చంద్రశేఖర్ ఆమె చెప్పే పాఠాన్ని చక్కగా అభినయిస్తున్నాడు.

తల్లీ కొడుకులకి బాహ్య ప్రపంచం కనబడడంలేదు. పరమేశ్వరశాస్త్రి రాకను గమనించలేదు వాళ్లు. పరమేశ్వరశాస్త్రి చూస్తూ నిలబడిపోయాడు. అప్పుడు ఆయనకి మొదట్లో ఆశ్చర్యం కలిగింది. తర్వాత ఆనందం అయింది. ఆ తర్వాత ఏదో అనుమానం.

ఇప్పుడు వీడికి నాట్యం నేర్చుకోవలసిన అవసరం ఏం వచ్చింది?

పరమేశ్వరశాస్త్రిని చూడగానే శిలా ప్రతిమల్లా అచేతనంగా నిలబడిపోయారు తల్లీ కొడుకూ.

"ఏమిటిది? " కాస్త కోపంగా అడిగాడు పరమేశ్వరశాస్త్రి. ఆ అడగడంలో అసహనం స్పష్టంగా కనబడుతోంది.

వర్ధనమ్మ తడబడింది. ఆమెలో ఏదో భయం.

"ఎంతసేపయింది మీరొచ్చి అవన్నీ తర్వాత చెప్తాగానీ ముందు మీరు స్నానం చేయండి" అంటూ తొందరపెట్టి భర్తని లోనికి తీసుకెళ్లింది.

పరమేశ్వరశాస్త్రి భోజనం చేసిన తర్వాత వర్ధనమ్మ వచ్చి ఆయనకి ఎదురుగా కూర్చుంది.

"మీరు రాజమండ్రి వెళ్లిన తర్వాత ఇక్కడ చాలా జరిగాయండి" అంటూ మొదలుపెట్టి జరిగినదంతా చెప్పి "మా అన్నయ్య మనల్ని బాగా అవమానపరిచాడు" అని ఏడ్చేసింది.

పరమేశ్వరశాస్త్రికి అరికాలిమంట తలకెక్కింది. భార్యని జుట్టుపట్టుకొని ఈడ్చి ఈడ్చి తన్నాలనిపించింది. తీక్షణంగా ఆమెనే చూస్తూ వుండిపోయాడు.

"ఏమిటండీ అలా చూస్తున్నారు" అని అడిగింది.

"ఏమిటా? ఆడదాని పెత్తనం అంటే ఏమిటో ఇప్పుడు తెలుస్తూ వుంది"

"ఏమయిందని ఇప్పుడు" వర్ధనమ్మ భృకుటి ముడివడింది.

"ఇంకా ఏంకావాలి. కొంపమీదికి తెచ్చావు"

తన్నుకొస్తున్న ఆవేశాన్ని తమాయించుకోడానికి ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. అక్కడినుండి లేచాడు.

"మొగుణ్ణి నేనింకా చావలేదుగా నీకెందు

కొచ్చిందీ తొందర. ఇప్పుడేమంత మునిగిపో యిందని పెళ్లి పెత్తనానికి పోయావు. నీ కొడుక్కి పిల్లనిచ్చేవాళ్లు లేకపోలేదు"

"అదికాదండీ"

"వేలకువేలు కట్నం ఇచ్చి పిల్లనిచ్చేవాళ్లు ఒకపక్క ఇంటిచుట్టూ తిరుగుతూ వుంటే నువ్వు చేసిందేమిటి? కనీసం నాకు చెప్పి చెయ్యాలన్న ఇంగితం లేదా నీకు. నీ దృష్టిలో నేనొక అసమర్థుణ్ణి, ఎందుకూ పని కిరాని దద్దమ్మని, వాజమ్మని"

భర్తకోపం చూసి హడలెత్తిపోయింది వర్ధ నమ్మ.

"ఏమండీ.. ఏమండీ"

ఆమె మాటలు ఆయన వినే స్థితిలో లేడు.

"నీకెప్పుడూ నేను అడ్డుచెప్పలేదుగా. నువ్వు చెప్పిన దానికల్లా గంగిరెద్దులా తల వూపానుగా. అదే నేను చేసిన తప్పు. నిన్ను కట్టడి చెయ్యకపోవడమే. మీ అన్నయ్యలా నేను ప్రవర్తించకపోవడమే. ఆయన ముందు మీ వదిన ఒక్క నిముషం నిలబడి మాట్లాడగలదా? ఆమెకా అవకాశం ఇవ్వలా మీ అన్నయ్య. నేనూ అదే బాటలో నడిచివుంటే నీకిన్ని కాళ్లు వచ్చేవికాదు"

పరమేశ్వరశాస్త్రి మాటలు వర్ధనమ్మకి కోపాన్ని తెప్పించాయి.

"ఏమిటండీ మీరనేది. నాకేమంత కాళ్లొ చ్చాయని, నేనేం కానిపని చేశానని మీరు తెగ కోప్పడిపోతున్నారు. నా కొడుక్కి మా అన్నయ్య కూతుర్ని ఇవ్వమని అడిగాను తప్పా. నేనేం దారినపోయే దానయ్యని అడ గలేదుగా. ఇంతకుముందు మీరెన్నిసార్లు అన్లేదు. అమృత నా ప్రాణం, దాన్ని నా గుండెలమీద పెంచానని. పైగా మీరేగా చెప్పారు... జ్యోతిష్యం ప్రకారం అమృతకీ చంద్రకీ పెళ్లి అవుతుందనీ..."

"అవును, అన్నాను. అదేమాట ఇప్పుడూ అంటున్నాను. వాళ్లిద్దరికీ పెళ్లి అవుతుందని! కానీ కాకూడదు"

"అదీ, అట్లా అనండి. దాగుడుమూతలు లేకుండా ధైర్యంగా అనండి. అమృతని చంద్రకి చేసుకోవడం ఇష్టంలేదని చెప్పండి. అంతేగానీ మనసులో ఒకటి దాచుకొని పైకొకటి ఎందుకండీ చెప్పేది. నన్ను మభ్య పెట్టటానికేగా. ఎన్నన్నా తెలివైనవారు మీరు. తెలివి తక్కువదాన్ని నేనే... నేనేనండి" వర్ధనమ్మ దుఃఖం ముంచుకొచ్చి ఏడ్చేసింది.

ఆమెను చూస్తుంటే పరమేశ్వరశాస్త్రికి దిక్కుతోచలేదు. తనను సరిగా అర్థం చేసు కోవడంలేదు. పైగా పెడసరంగా అర్థం చేసుకొంటుంది. ఆమెమీద జాలి, కోపం పిచ్చి పట్టినట్టుగా వుంది ఆయనకి.

జుట్టు పీక్కునే పరిస్థితి.

అరిచేతిని నుదుటికేసి బాదుకొన్నాడు.

"నువ్వొట్టి మొద్దువి. పరమమూర్ఖురా లివి. నా మాట విను. నన్ను అర్థం చేసుకో. నాలో ఏ స్వార్థం లేదు. నేనెవరినీ మభ్యపెట్టడంలేదు. నిజం చెప్తున్నా. అమృ తని నువ్వు మీ అన్నయ్య కూతురనే ఇష్టప డుతున్నావు. కానీ నేను అలాకాదు నా ప్రాణంకన్నా అమితంగా చూసుకొంటు న్నాను. మన చంద్రంకన్నా అదంటేనే నాకు ఎక్కువ ఇష్టం. అది సుఖంగా వుండాలి. పదికాలాలపాటు చల్లగా వుండాలి"

"అంతా బూటకం. వట్టి మాటలు. అదే నిజం అయితే ఇంత రాద్ధాంతం చేసేవారే కాదు"

"ఛీ, నీకెలా చెప్పాలో అర్థం కావడం లేదు. మొండిపట్టు వదలవుగా. దేవుడి సాక్షిగా చెప్తున్నా చంద్రశేఖర్‌కి అమృతని చేసుకోవడం నాకిష్టమే. కానీ... కానీ..."

"కాని... కానీ... ఏమొచ్చింది"

"అదే... అదే..."

"చెప్పండి"

"అదే... అది.. అది వాడితో కాపురం చెయ్యదు"

అవాక్కయ్యింది వర్ధనమ్మ. భర్త మొహం

లోకి అదోలా చూసింది.

"ఏమిటీ? కాపురం చెయ్యదా? మొగుడితో పెళ్లాం కాపురం చెయ్యదా! కాపురం చెయ్యక ఏం చేస్తుంది? చస్తుందా?"

పరమేశ్వరశాస్త్రి చెవులు రెండూ మూసుకున్నాడు.

"ఆపు... ఇంక మాట్లాడవద్దు. ఏ మాటైతే నేను అనకుండా నిగ్రహించుకున్నానో అది నువ్వనేశావు. భగవంతుడా అమంగళం శాంతింపచెయ్యి. మా అమృతని చల్లగా చూడు"

ఆయన మనసు వికలమైంది. విషాదం అలముకొంది. నోట మాటరాక మౌనంగా వుండిపోయాడు.

పరమేశ్వరశాస్త్రి మాట్లాడకపోవడం వర్ధనమ్మ ఊహలకు ఊపిరి పోసినట్టైంది. ఆమె దృష్టిలో ఆయన మాధవిని చంద్రశేఖర్‌కి చేసుకునే ఉద్దేశంతో నాటకం ఆడుతున్నాడు. అదే అనేసిందామె.

"అహహ... చెల్లెలి మీద ప్రేమ. చెల్లెలి కూతురు మీద ప్రేమ. ఎంత నాటకం ఆడుతున్నారండి. అమృత వాడితో కాపురం చెయ్యదా? నన్ను నమ్మించడానికి ఎంత పెద్ద ప్రయత్నం చేస్తున్నారండీ! మీ జ్యోతిష్యాన్ని అడ్డుపెట్టుకుని. పైగా భయపెట్టడం గూడానా? ఇది ఎప్పటినుండి నేర్చుకున్నారండి"

వర్ధనమ్మ పూనకం వచ్చిన దానిలా విరుచుకుపడింది.

అయినా పరమేశ్వరశాస్త్రి పెదవి విప్పలేదు. ఆయనలో ఆత్మవిమర్శ మొదలైంది.

ఎంత అవివేకంగా ప్రవర్తించాడు తను. బ్రహ్మరాతను మార్చడం ఎవరివల్ల అవుతుందని? అయినా ప్రయత్నించాడు. ఫలితం బూడిదలో పోసిన పన్నీరే అయింది.

జరిగేది జరక్క మానదుకదా!

ఆలోచించేకొద్దీ పరమేశ్వరశాస్త్రికి నూతనోత్సాహం కలగడం మొదలయింది. అమావాస్య అంధకారంలో మిణుగురు పురుగు మెరుపు ఏదో కనబడింది. ఆ మెరుపు వెలుగుగా మారి క్రమంగా విస్తరించి చీకటిని తరిమెయ్యసాగింది.

అప్పుడు అమృతకి, చంద్రశేఖర్‌కి పెళ్లి జరగదు. అనే నిర్ణయానికి వచ్చాడు. దాంతో ఆయన మనసు కుదుటపడి వదనంలో పెదాలు మెల్లగా విచ్చుకొన్నాయి.

"ఏమిటి ఇంకా నవ్వుతున్నారు" వర్ధనమ్మ అలా అడగడంతో పరమేశ్వరశాస్త్రి ఆలోచనల్లోంచి తేరుకున్నాడు. అంతవరకూ ఆమె ఏమేమో అన్నది. అందులో ఒక్కమాట కూడా ఆయన చెవుల్లోకి దూరలేదు. ప్రశాంతంగా భార్య మొహంలోకి చూశాడు.

"నాట్యకళలో ఆరితేరిన అమృతతో చంద్రశేఖర్ పోటీ పడుతున్నాడంటే నవ్వు రాక ఏమవుతుంది" అన్నాడు.

"మీ ఉద్దేశం ఏమిటో తెలిసిపోయింది లెండి. ఇంకా ఎందుకు మాట్లాడతారు. నాట్యంలో అమృత ఆరితేరవచ్చు. చంద్రశేఖర్ ముందు ఓడిపోవలసిందే"

"అది నీ భ్రమ"

"కాదు"

"అనవసరంగా మీ అన్నయ్యతో పంతానికి పోతున్నావు"

"ఆయనే చంద్ర కాళ్లు కడిగి కన్యాదానం చెయ్యబోతున్నాడు"

"అది జరిగేది కాదు"

"జరిగి తీరుతుంది" ఆమెలో పట్టుదల పెరిగింది.

తన జ్యోతిష్య పాండిత్యానికి పరీక్ష అనుకొని పరమేశ్వరశాస్త్రి మౌనం వహించాడు.

★ ★ ★

అలా మౌనం వహించాడేగానీ పరమేశ్వరశాస్త్రి మనసు స్థిమితంగా వుండలేకపోతోంది.

శివరామశాస్త్రి, వర్ధనమ్మలు పరువుకుపోతే, అమృతా, చంద్రశేఖర్‌లు జీవన్మరణ

సమస్యగా తీసుకొన్నారు.

గెలుపు ఓటములు పరమేశ్వరశాస్త్రి జ్యోతిష్యానికి అందడంలేదు. ఎవరినోట విన్నా గెలుపు అమృతదే అనే మాట వినబడుతోంది.

ఆలోచిస్తే అంతేమరి. నాట్యంలో చంద్రశేఖర్ అభ్యాసం ఎంత? అమృతతో పోల్చుకొంటే చాలా తక్కువ. కానీ చంద్రశేఖర్ పట్టుదల చూస్తుంటే భయమేస్తోంది. రోజు రోజుకీ అతనిలో ప్రోగ్రెస్ కనబడుతుంటే వర్ధనమ్మకి ఉత్సాహం పెరిగిపోతోంది. అది చూస్తుంటే పరమేశ్వరశాస్త్రికి తన జ్యోతిష్యం మీద నమ్మకం కలుగుతోంది.

ఆ వెంటనే ఆ నమ్మకం కాస్తా వీగిపోతోంది.

చంద్రశేఖర్ గెలిస్తే?

మ్రింగుడు పడని చేదు మాత్ర నోట్లో పగిలినట్లుగా వుంది. ప్రాణం విలవిల్లాడింది.

మనసుని ప్రశాంత పరచుకొంటే అది అంతా తన భయమే అనిపిస్తుంది. ధైర్యం పుష్కలంగా వచ్చి చేరింది. అమృత ఓడిపోవడం ఏమిటి? కలలో కూడా జరగదు.

అలా అయితే తన జ్యోతిష్యం ఫెయిలయినట్టే ఫెయిల్ కాదు. ఫెయిల్ కావడానికి వీలులేదు.

అయితే?

అమృత, చంద్రశేఖర్‌ల పెళ్లి జరగదు. ఆ క్షణం పరమేశ్వరశాస్త్రిలో ఆనందం వెల్లివిరిసింది. మరుక్షణంలోనే మాయమయ్యింది.

తన జ్యోతిష్యం ఫెయిలవకపోతే?

పెళ్లి జరుగుతుంది.

జరిగితే... ఆ తరువాత వచ్చే ఊహ భయం కలిగిస్తుంది. ఊహించుకోలేకపోయాడు.

అప్రయత్నంగా అతని అడుగులు చింతలమ్మ గుడివైపు కదిలాయి. అక్కడ ఒక కొబ్బరికాయ కొనుక్కొని గుడిలోకి వెళ్లాడు.'

అప్పుడే శివరామశాస్త్రి గుడిలోంచి బయటకి వస్తూ కనిపించాడు. అనుకోకుండా ఒకరికొకరు ఎదురు కావడంతో క్షణం ఖంగుతిని ఆశ్చర్యపోయారు.

"బావా" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"ఏం కోరుకోడానికి వచ్చావు అమ్మవారిని"

"నేనేది చెప్పినా నువ్వు నమ్మవుగా"

"ఆ అనుమానం నీకు దేనికొచ్చింది? "

"ఇప్పుడు మనం ఉంటున్న పరిస్థితి అటువంటిది గనక"

శివరామశాస్త్రికి కోపం వచ్చిందని తెలిసిపోయింది పరమేశ్వరశాస్త్రికి. అనవసరంగా ఆయనతో ఘర్షణపడి ఇద్దరిమధ్య వాతావరణం వేడెక్కకుండా చూసుకోవాలని ప్రయత్నించాడు.

"క్షమించు బావా. నన్ను అపార్థం చేసుకోవద్దు. నీ పట్ల నాకు గౌరవం తప్ప వేరే ఏభావమూ లేదు. నువ్వు నమ్మినా నమ్మకపోయినా అమృత నీకు కూతురు కావచ్చు నాకది ప్రాణం. దాని సుఖమే నేను కోరుకునేది"

"అందుకిప్పుడు అమ్మవారిని ఏం కోరుకొంటున్నావు? "

"నిజం చెప్తున్నా బావా, చంద్రశేఖర్ ఓడిపోవాలని కోరుకొంటున్నాను"

అవునా అన్నట్టుగా చూశాడు శివరామశాస్త్రి.

"నిజం చెప్పాను బావ. ఆపైన దేవుడున్నాడు" అనేసి గుడిలోకి వెళ్ళిపోయాడు పరమేశ్వరశాస్త్రి.

నమ్మలేని నిజం అది శివరామశాస్త్రికి. ఆశ్చర్యపోయిన వాడిలా గుడిలోకి పోతున్న పరమేశ్వరశాస్త్రిని చూస్తూవుండిపోయాడు.

'అంటే అమృతని చంద్రశేఖర్‌కి చేసుకోవడం పరమేశ్వరశాస్త్రికి ఇష్టంలేదా...'

అదే నిజమయితే పేరిశాస్త్రిగారి సంబంధం ఎందుకు కుదరకుండా పోయింది.

అమృతను చూడగానే పేరిశాస్త్రి వాళ్ళ కొడుక్కి చేసుకోడానికి ఇష్టపడ్డాడు. 'ఒక

సారి అబ్బాయి, వాళ్ళ అమ్మ వచ్చి చూస్తే ముహూర్తం పెట్టుకోవచ్చు' అని అన్న ఆయన పరమేశ్వరశాస్త్రి ఇంటికి వెళ్ళి వచ్చిన తర్వాత హైదరాబాదు వెళ్ళగానే లెటర్ రాస్తానన్నాడు.

అప్పుడు శివరామశాస్త్రికి పేరిశాస్త్రి ఏమని లెటర్ రాశాడో గుర్తొచ్చి పరమేశ్వరశాస్త్రి మీద కోపం వచ్చింది. నన్ను నమ్మించే ప్రయత్నంలో వాడు ఏదైతే అన్నాడో అదే జరిగి తీరుతుంది. ఇంకా అక్కడే వుండి పరమేశ్వరశాస్త్రి మొహం చూడబుద్ధికాలేదు. చరచరా వెళ్ళిపోయాడు.

గుడిలోంచి వచ్చిన పరమేశ్వరశాస్త్రికి అక్కడ శివరామశాస్త్రి లేకపోవటంతో ఆయన నిజాన్ని నమ్మడంలేదని తెలిసిపోయింది. అదే నమ్మివుంటే తను వచ్చేవరకూ వుండేవాడు.

'ప్చ్..'

కాలగమనాన్ని ఆపగలగడం ఎవరివల్ల అవుతుంది. ఎవరివల్లాకాదు.

ఈ మానవుల మనస్తత్వాలు పరిశీలిస్తుంటే పరమేశ్వరశాస్త్రికి విధి ఎంత బలీయమైనదో తెలుస్తోంది. అనుకున్న ఫలితాన్ని సాధించే ప్రయత్నంలో అది వాళ్ళని తన గుప్పిట్లోకి తెచ్చుకొంటున్నట్లుంది.

లేకపోతే ఏమిటి?

అమృత, చంద్రశేఖర్‌ల పెళ్ళి విషయంలో తన అభిప్రాయాన్ని విప్పి చెప్పినా శివరామశాస్త్రి నమ్మడంలేదు. భార్య మరోవిధంగా అర్థంచేసుకొన్నది.

నిజానికి పరమేశ్వరశాస్త్రి, శివరామశాస్త్రి అభిప్రాయాలు ఒకటే. కానీ ఇద్దరిమధ్యా అగాధం. ఇదంతా చూస్తుంటే ఎవరికివాళ్ళు తమతమ అభిప్రాయాలను బలపరచుకొనే ప్రయత్నంలో ఎదుటివాళ్ళను గురించి అందుకు అనుకూలంగా ఆలోచిస్తారు. విశాలహృదయంతో ఆలోచించరు.

ఆలోచిస్తే-

మనిషి ఆలోచనగానీ, ప్రవర్తనగానీ వాళ్ళ జాతకాలను బట్టే వుంటుందని ఆయనకు అనిపిస్తోంది. లేకుంటే ఒకడు దొంగగాను, మరొకడు దొరగాను, ఇంకొకడు హంతకుడుగాను ఇలా రకరకాలుగా మనుషులు ఎందుకుంటారు. ఒక చెట్టుకు కాసిన కాయలు ఒక రుచిని కలిగి వుంటాయి. మరి ఒక తల్లికి పుట్టిన బిడ్డలు ఎందుకు వేర్వేరు ప్రవృత్తులను కలిగి వుంటారు.

ఎక్కడెక్కడో పరిభ్రమించిన పరమేశ్వరశాస్త్రి ఆలోచనలు తిరిగి జాతకం దగ్గరకొచ్చి ఆగాయి.

ఈ జగన్నాటకంలో మనం కేవలం నటులం, ప్రేక్షకులం మాత్రమే.

నిజాన్ని జీర్ణించుకోలేని శివరామశాస్త్రిమీద జాలికలిగింది పరమేశ్వరశాస్త్రికి.

★ ★ ★

పరమేశ్వరశాస్త్రి ఇంట్లోకి అడుగుపెట్టేసరికి కాకినాడ నుండి రవి వచ్చి వున్నాడు.

మేనల్లుడిని చూడగానే పరమేశ్వరశాస్త్రికి భృకుటి ముడివడింది. 'కారణం ఏదో వుంటుంది' అనుకొన్నాడు.

"మాధవికి విజయవాడ సంబంధం కుదిరింది. కట్నకానుకలు కూడా మాట్లాడుకున్నారు. నిశ్చయ తాంబూలాలు పుచ్చుకొని ముహూర్తాలు పెట్టుకోవాలట. అమ్మా నాన్నా మిమ్మల్ని తీసుకొని రమ్మన్నారు" అని చెప్పాడు రవి.

పరమేశ్వరశాస్త్రికి మింగుడు పడని వార్త అది.

భవిష్యత్తు అగమ్యం, అయోమయం.

ఆలోచనల్లో పడ్డాడు.

రవి వూరికి బయలు దేరుతూ పరమేశ్వరశాస్త్రిని బయల్దేరమన్నాడు.

"మాధవికి ఇంకా కళ్యాణ ఘడియలు రాలేదు నాయనా. ఆ సమయం వచ్చినప్పుడు తప్పక వస్తాను. నేనే దగ్గర వుండి అన్నీ చేస్తాను. దాని పెళ్ళి విషయంలో మీరేం హైరానా పడనవసరం లేదని చెప్పు.

మీ అమ్మా నాన్నకి" అన్నాడు పరమేశ్వర శాస్త్రి.

భర్త మాటలు వర్ధనమ్మకి కోపాన్ని తెప్పించాయి. అసహనం ఆమెని కప్పేసింది.

"అదేమిటండీ శుభమా అంటూ వాళ్ళు సంబంధం కుదుర్చుకొంటే మీరు అడ్డుపుల్ల వేస్తారు" అని అంది.

పరమేశ్వరశాస్త్రి వర్ధనమ్మ మొహంలోకి చూశాడు. ఆ చూపుల వెనక బడబానలం పొంగుతోంది. అయినా ఆయన మొహం ప్రశాంతంగానే వుంది.

"ఇది నీకు సంబంధించింది కాదు. నా సొంత విషయం. ఇక్కడ నా మాట నువ్వు గౌరవించకపోవొచ్చు అక్కడ ఆ యింట్లో నా మాటకు పూర్తి గౌరవం వుంది"

వర్ధనమ్మ ఏదో మాట్లాడబోయింది.

"మాట్లాడవద్దు" అన్నాడు.

ఆమె నోటికి తాళం పడిపోయింది.

పరమేశ్వరశాస్త్రి బస్టాండుకు వెళ్ళి రవిని బస్సెక్కించి వచ్చాడు.



వర్ధనమ్మ చిరుబురులాడుతోంది. ఆమెకి భర్తపట్ల అనుమానం పోలేదు. 'ఆయనకింకా మాధవిని చంద్రకి చేసుకోవాలనే వుంది' అనుకొంటోంది.

చెల్లెలి కాపురంమీద ఎంత ప్రేమ.

కసి భగ్గుమన్నది.

తనకూ వున్నాడు ఒక అన్న ఎందుకు?

ఆమెలో శివరామశాస్త్రిపట్ల అసహనం. తనతో సహకరించటంలేదని భర్తపట్ల కక్క లేని కోపం.

అయినా పరమేశ్వరశాస్త్రి భరిస్తున్నాడు.

'లలాట లిఖితం మార్చడం ఎవరివల్ల అవు తుందని'

అతను ఆలోచించేకొద్దీ 'మాధవికి పెళ్ళికా కుండా తను అడ్డుతగులుతున్నాడా' అనే అను మానం కలుగుతోంది.

రవితోపాటు కాకినాడవెళ్ళి కుదుర్చుకున్న సంబంధాన్ని ఖాయ పరిస్తే బాగుండేదేమో! మాధవి పెళ్ళి సాఫీగా జరిగేది. అనవస రంగా తలదూర్చాడు తను. అంతా పైన వేసుకొన్నాడు. చంద్రశేఖర్‌కి, మాధవికి పెళ్ళి జరిగే అవకాశాలు కనుచూపు మేరలో కనబ డటంలేదు. అమృతకి దీటుగా చంద్రశేఖర్ నిలబడ గలుగుతున్నాడన్న అభిప్రాయం స్థిర పడసాగింది. ఒకవేళ చంద్ర అమృత చేతిలో ఓడిపోతే... అప్పుడు మాధవి చంద్రశేఖర్‌ని చేసుకొంటుందా?

ఊఁ హుఁ...

పరమేశ్వరశాస్త్రి ఆత్మస్థిరత్వం కోల్పోతు న్నాడు.

★ ★

సూర్యోదయం అవుతూ వుంది.

వరండాలో రాజారావు, మాధవి పేపరు చూస్తూ వున్నారు.

వీధి గేటు తీస్తున్నట్టు శబ్దం రావడంతో ఇద్దరూ ఒకేసారి తలపైకెత్తి చూశారు.

పరమేశ్వరశాస్త్రి లోపలికి వస్తూవున్నాడు. మాధవికి ఆనందమయింది.

"అమ్మా మావయ్య వచ్చాడు" ఇంట్లో వున్న రాజేశ్వరికి వినబడేలా అంటూ పేపరు పక్కన పడేసి చెంగున లేచి పరమేశ్వరశాస్త్రికి ఎదురు వెళ్ళింది.

"ఒక్కడివే వచ్చావా మావయ్యా?" అని అడిగింది.

"అవునమ్మా"

వాళ్ళిద్దరూ వరండాలోకి వచ్చేసరికి రాజే శ్వరి ఇంట్లోంచి అక్కడికి వచ్చింది.

"రా అన్నయ్యా" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించింది.

పరమేశ్వరశాస్త్రి వచ్చి రాజారావుకి ఎదు రుగా కూర్చున్నాడు.

"ఇంటి దగ్గర వదినావాళ్ళు కులాసాయేనా అన్నయ్యా?" రాజేశ్వరి క్షేమసమాచారాలు విచారిస్తుంటే పరమేశ్వరశాస్త్రి ముక్తసరిగా సమాధానం చెప్పాడు. ఆయన ఇదివరకటిలా వాళ్ళతో మాట్లాడలేక పోతున్నాడు. ఏదో పోగొట్టుకొన్నవాడిలా వున్నాడు. ప్రయత్నం మీద మొహంలోకి ప్రశాంతతని తెచ్చుకొంటు న్నాడు. రాజేశ్వరి ఏదో అడగబోయింది. పర మేశ్వరశాస్త్రి ఆమెకాఅవకాశం ఇవ్వలేదు. "నాకు విశ్రాంతి కావాలమ్మా" అన్నాడు.

వింతగా వుంది వాళ్ళకి ఆయన వాలకం. మాధవి వెంటనే "అమ్మా నువ్వు మావయ్యకి వేడివేడిగా మంచి కాఫీ ఇవ్వు. నేను నీళ్ళు కాస్తాను. స్నానం చేసిన తర్వాత టిఫిన్ పెట్టు. తిని రెస్ట్ తీసుకొంటాడు. తర్వాత తీరిగ్గా మాట్లాడుకోవచ్చు" అని చెప్పింది.

పరమేశ్వరశాస్త్రి మాధవి సమయస్ఫూర్తికి ఆమె వీపుమీద చెయ్యివేసి ప్రేమగా నిమిరి దొడ్లోకి వెళ్ళిపోయాడు.

ఆయన కోరుకొంటున్న విశ్రాంతి శరీరానికి కాదు అని తెలిసిపోయింది వాళ్ళకి.

'ఏదో జరిగి వుంటుంది' అనుకొన్నారు.

అమృత కోసం చంద్రశేఖర్ పోటీపడుతు న్నాడని తెలుసు. అదీ రవి అగ్రహారంపోయి రావడంతో. అతను ఆ వూరు పోయి వచ్చి కూడా నెల రోజులు దాటింది. తర్వాతి విష

యాలు తెలియవు. పరమేశ్వరశాస్త్రి రాక, ఆయన వాలకం చూసి రకరకాలుగా ఊహించుకొంటున్నారు.

ఆయనంటే ఆ యింట్లో అందరికీ గౌరవం, ఆయన మాటంటే గురి.

చంద్రశేఖర్‌కి, మాధవికి పెళ్ళి జరుగుతుందని ఎప్పుడో చెప్పిన పరమేశ్వరశాస్త్రి మాటలు వాళ్ళ హృదయాలలో బాగా నాటుకుపోయాయి. ఆయన మనసులో గూడా అదే వుంటుందని అనుకొంటున్నారు వాళ్ళు.

మధ్యాహ్నం భోజనాలు అయిన తర్వాత అందరూ వచ్చి హాల్లో కూర్చున్నారు.

అప్పుడు పరమేశ్వరశాస్త్రి తన బ్యాగ్‌లోంచి నాలుగు మూలలా పసుపు, కుంకుమ పూసిన కవరొకటి తీసి "చంద్రశేఖర్ పెళ్ళి" అంటూ రాజారావుకి ఇచ్చాడు. అలా కవరు అందిస్తున్నప్పుడు పరమేశ్వరశాస్త్రి చెయ్యి వణికింది. రాజేశ్వరి మొహం వివర్ణమైంది. రాజారావు కవరులోంచి కార్డుతీసి చదివాడు.

"అమృతేనా" అని అడిగింది రాజేశ్వరి భర్తని ఉద్దేశించి.

"అవును" అంటూ ఆ కార్డు రాజేశ్వరికి ఇచ్చాడు.

"అమృత ఓడిపోయిందా మావయ్యా?" మాధవి పరమేశ్వరశాస్త్రి మొహంలోకి చూస్తూ అడిగింది.

"అవునమ్మా" ఆయన సమాధానంలో జీవంలేదు. మాధవి మొహంలోకి చూశాడు. అమాయకంగా వున్నాయి ఆమె చూపులు.

అలాంటి వార్త వినవలసి వస్తుందని వాళ్ళు ఎవరూ ఊహించలేదు. చంద్రశేఖర్‌కి, మాధవికి పెళ్ళి జరిపించే ప్రయత్నంలో పరమేశ్వరశాస్త్రి వున్నాడని, ఆ విషయమై వర్ధనమ్మని ఒప్పించగలడని అనుకొన్నారేగాని ఇలా జరుగుతుందని ఊహించలేదు.

పరిస్థితి పరమేశ్వరశాస్త్రిని దాటిపోయిందని తేలిపోయింది. ఎవరినోటా మాట పెగల్లేదు.

"రెండు రోజులు ముందుగా బయల్దేరి రండి" అన్నాడు పరమేశ్వరశాస్త్రి. తను వచ్చిన పని అయిపోయింది. పెళ్ళికి పిలిచాడు. అక్కడ వుండబుద్ధికాలేదు. లేచి ఊరికి బయల్దేరాడు.

వీధిగుమ్మందాకా అందరూ ఆయన వెంట వచ్చారు. అక్కడ మాధవిని దగ్గరకు తీసుకొని హృదయానికి హత్తుకొన్నాడు. "నీకు నేనున్నానమ్మా" గొంతు జీరబోయింది.

బస్టాండు దాకావస్తానన్న రాజారావుని వారించి తను ఒక్కడే వెళ్ళాడు. బస్సు కదిలి వేగం పుంజుకొంటుంటే పరమేశ్వరశాస్త్రి హృదయంలో తుఫాను వాతావరణం చెలరేగింది.

'అమృత వోడిపోయిందా మావయ్యా?' అంటూ అడిగిన మాధవి మాటలు, అప్పుడు ఆమె చూసిన అమాయకపు చూపులు పరమేశ్వరశాస్త్రిని విచలితుణ్ణి చేశాయి.

నిజానికి అమృత వోటమిని ఎవరూ వూహించలేదు. ఎలా జరిగిందో మరి. అదో పెద్దవింత. నిజం.

గజ్జెల కాళ్ళతో లయబద్ధంగా సవ్వడి చేస్తూ వచ్చాడు చంద్రశేఖర్ వేదికమీదికి. అపరనాట్యదేవతలా కదిలి వయ్యారంగా వచ్చింది అమృత. ప్రార్థనతో ప్రారంభించి పరస్పరం విజయకాంక్షతో పోటీపడ్డారు. అద్భుత విన్యాసాలతో చెలరేగిపోతున్నారు. అమృత ప్రదర్శించే భంగిమలు చంద్రశేఖర్‌ని ఆశ్చర్యపరుస్తున్నాయి. అతనిలో పట్టుదల పెరిగింది. ఆమెకి ఏ మాత్రం తీసిపోకుండా నర్తించసాగాడు. ఆ పోటీలో గెలుపు ఎవరిని వరిస్తుందో చెప్పలేని పరిస్థితి. చంద్రశేఖర్ శివుడే అయి తాండవిస్తుంటే అమృత పార్వతిలా పోటీపడింది. ఆమె చేసే విన్యాసాలకు ప్రతిగా విన్యాసాలు ప్రదర్శిస్తున్నాడు చంద్రశేఖర్. అమృత వూహించలేదు, చంద్రశేఖర్ బావ అంతగొప్పగా నాట్యం చేస్తాడని. ఆమె హృదయంలో ఎక్కడో అధైర్య బీజం నాటుకొంది. క్షణక్షణానికీ ఆ బీజం పాదుచేసుకొని మొలకెత్తసాగింది. భయం, వణుకు... ఆడుతూ ఆడుతూ అమృత కుప్పలా కూలిపో

యింది.

వర్ధనమ్మ విజయగర్వంతో పూగిపోయింది. శివరామశాస్త్రి వోటమిని అంగీకరించక తప్పలేదు.

ముహూర్త నిర్ణయం జరిగింది.

శుభలేఖలు అచ్చయినాయి.

పెళ్ళి పనులు చకచకా జరిగిపోతున్నాయి.

పరమేశ్వరశాస్త్రి పిలుపు మేరకు కాకినాడ నుండి రాజేశ్వరీవాళ్ళు ఇంటికి తాళంవేసి రెండు రోజులు ముందుగా అందరూ వచ్చారు.

కళ్యాణం వచ్చినా, కక్కొచ్చినా ఆగదంటారు. కాలగమనంలో అందరూ పావులే. నీ, నా, తన భేదాలు లేకుండా సుఖదుఃఖాలను మింగుతూ తనపనితాను చేసుకొని పోతుంది అది.

అందులో అమృత రెక్కలు తెగిన పక్షి అయింది. తండ్రి తొందరపాటు తనని కష్టాలలో పడేసింది.

అయినా ఆమెకి కోపంలేదు. ఎవరికీ ఎదురు చెప్పలేదు. చెప్పినట్టు విన్నది. తెచ్చిన చీరెలు కట్టుకొన్నది. ఇచ్చిన నగలు పెట్టుకొన్నది. ఫోటోలకు ఫోజులిచ్చింది. అంతా యాంత్రికంగానే. పెళ్ళి కూతురై వచ్చి తలవంచి మెడను అప్పగించింది. వేదమంత్రాల మధ్య తాళిబొట్టు కట్టాడు చంద్రశేఖర్. తొలిసారిగా నెత్తిమీదపడ్డ తలంబ్రాలు శరీరం మీదికి దొర్లినప్పుడు అప్రయత్నంగా అమృతలో చలనం కలిగింది. తేళ్ళు, జెర్రులు పైన పారాడుతున్నట్లు ఒళ్ళు గగుర్పొడిచింది. అయినా భరించింది.

భరింపరానిదల్లా తన హృదయంలోంచి రమేష్‌ని తొలిగించి చంద్రశేఖర్‌ని జీవితభాగస్వామిగా ఆహ్వానించడమే.

ఆ భావం సూచాయగానైనా ఆమె మొహంలోగానీ ప్రవర్తనలోగానీ కనబడలేదు. ఇష్టపడి చేసుకొన్నదానిలా వుంది. మొహంలో చిరుదరహాసం, చూపుల్లో సోయగం, జడనిండా పూలు, మెడనిండా నగలు, తలంబ్రాలు పడ్డ తెల్లటి బట్టలతో కొత్త అందం కనబడుతోంది ఆమెలో. ఆమెని వదిలిపోబుద్ధికాలేదు సునీతకి. వదినమీద అభిమానం పెరిగింది. అమృత సునీతని దగ్గరికి తీసుకొంది. తన దగ్గరే వుంచుకొంది. తనని వదిలి వెళ్ళకుండా కబుర్లు చెప్పసాగింది. బుద్ధిమంతురాలిలా వింటోంది సునీత వదిన మొహంలోకి చూస్తూ.

వర్ధనమ్మ సంతోషానికి అంతులేకుండా వుంది. పందెం నెగ్గిందన్న గర్వం. తన నగలన్నీ అమృతకి అలంకరించింది. రాత్రి సంబరానికి గదిని అలంకరించమని పని పురమాయించింది అమ్మలక్కలకి.

వాళ్ళు ఆ పనిలో వుంటే అమృత సునీతతో కలిసి పరమేశ్వరశాస్త్రి వైద్యం చేసే గదిలోకి వచ్చింది. ఆ గదినిండా మందు సీసాలు. ఆయుర్వేదం మందులు, ఇంగ్లీషు మందులు, రకరకాల సీసాలు. ఏ సీసాలో మందు ఎందుకు వాడతారో అమృతకు తెలుసు. గది అంతా పరిశీలిస్తూ, "సునీ దాహంగా వుందే ఒక గ్లాసు మంచినీళ్ళు తెస్తావా? " అని అడిగింది సునీతని అమృత.

"ఆఁ తెస్తాను వదినా" అనేసి వెళ్ళి గ్లాసు నిండా మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. గటగటా తాగేసింది అమృత.

"ఇంకా కావాలా వదినా? " అడిగింది సునీత.

"చాలు ఇంకొద్దు" అంటూ సునీతని దగ్గరికి తీసుకొని నుదుట ముద్దు పెట్టుకుంది.

ముత్తైదువులు వచ్చారు. అమృత చేతికి పాలగ్లాసు అందిస్తూ చిలిపి చిలిపిగా ఏవో మాటలు చెప్పారు. సిగ్గుతో తల వంచుకున్న ఆమెని భుజాలమీద చేతులు వేసి తమవెంట తీసుకొని వచ్చారు.

చంద్రశేఖర్ అమృతకోసం ఎదురుచూస్తూ వున్నాడు.

గదిలోకి అడుగు పెట్టబోతున్న అమృత ఉన్నఫళంగా వెనక్కి విరుచుకుపడిపోయింది.

అందరిలో కంగారు. కళ్ళు తిరిగి వుంటాయని నీళ్ళు తెప్పించి ముఖంమీద చల్లి అటూ ఇటూ కుదిపారు. అప్పుడు అమృత బ్లౌజ్ లోంచి చిన్నసీసా ఒకటి బయటపడింది. అది చూసిన వాళ్ళలో అయోమయం, విషాదం.

విషగుళికలు వుండే సీసా అది.

ఏడుపులూ, శోకాలూ...

ఆ విషయం తెలిసి అక్కడికి వచ్చిన శివ రామశాస్త్రి కళ్ళకి అమృత శవమై కనబడింది. పెళపెళమంటూ కాళ్ళకింద భూకంపం వచ్చి నట్లుంది. ఆమె చనిపోయిందన్న ఆలోచన రాగానే దుఃఖం పొంగివచ్చింది. ఆ దుఃఖంలోంచి ఆవేశం. దేవుడు తనకు అన్యాయం చేశాడు. నిత్యం దేవతార్చనతో జీవితాన్ని వెళ్ళబుచ్చే తనకు ఇలా శిక్ష విధి స్తాడా? తన బిడ్డని బలి తీసుకుంటాడా? ఆ దేవుడికి మనసు వుందా? మంచి అంటే తెలుసా? ప్రేమంటే తెలుసా? తను ఇంత కాలం పూజించింది దేవుడినా, శిలనా? శిలనే... శిలలో దైవంలేదు. అసలు దేవుడే లేడు. వుంటే ఇలా నా తల్లిని...

శివుడిమీద కోపం... ఆవేశం... పూనకం... ఉద్రేకం...

దక్షయజ్ఞంలో సతీదేవి ఆత్మార్పణం చేసు కున్నప్పుడు మండిపడ్డ పరమశివుడే అయి నాడు శివరామశాస్త్రి. భృకుటిలో ఉగ్రం, గంటల సవ్వడి, ఢమరుకధ్వని- ఏదో ప్రేరణ. ఆపాదమస్తకం కంపించింది. కాళ్ళూచేతులూ కదిలాయి. ఊగుతూ ఊగుతూ తాండవం చేయసాగాడు.

శివరామశాస్త్రి అలా శివతాండవం చేస్తుంటే విభ్రాంతి చెందాడు పరమేశ్వరశాస్త్రి.

'శివతాండవం చేయాలంటే దానికి వెనకాల ఎంతో ప్రేరణ కావాలి. నన్ను నేను మరిచి పోగలగాలి. శివుడిలో లీనమవ్వాలి. అప్పుడే శివతాండవం రక్తి కడుతుంది. లేకుంటే ఎంత ప్రయత్నించినా అది పేలవంగానే ఉంటుంది' అని చెప్పిన శివరామశాస్త్రి మాటలు గుర్తుకొ స్తున్నాయి.

ఆయన చెప్పిన మాటలు వాస్తవమేనని తెలిసింది. అమృత అంటే ప్రాణం ఆయనకి. దాని సుఖం కోసం, దాని ఆనందం కోసం అందరినీ వదులుకోవడానికి సిద్ధపడ్డాడు. తను కొలిచే దేముడు తనను అన్యాయం చేయడని నమ్మాడు. కానీ... కానీ... కాటే శాడు. అందుకు ఆ దేముడి మీద కోపం, ద్వేషం, అసహ్యం, ఉక్రోషం, ఉగ్రం, విరక్తి. అమృత ఇక లేదని తెలిసి దుఃఖం, ఏడుపు, ఉద్వేగం, పరితాపం...

అలా ఎంతసేపు శివతాండవం చేశాడో వళ్లు చెమటలు పట్టింది. పొగిలి పొగిలి ఏడుస్తూ నీరసించి కూలబడిపోయాడు.

కాలం కన్నెత్తయినా ఆయనవైపు చూడ లేదు. తనపని తాను చేసుకుంటూ ముందుకు సాగిపోయింది.

ఏడుపులు, శోకాల మధ్య అమృతను ఉంచిన పాడెను నలుగురు భుజాలకెత్తుకు న్నారు. శ్మశానంలో బండెడు ఎండుకట్టెల్లో పెట్టి నిప్పంటించారు.

భగభగమంటూ మండుతున్న ఎర్రటి మంటల్లో అమృత కాలిపోతూవుంటే చూడ లేక చూస్తున్నాడు రమేష్... అక్కడికి దగ్గ రలో ఉన్న మట్టి దిబ్బమీద కూర్చొని- నిర్వి కారంగా, నిరామయంగా...

అతని గుండెల్లోంచి దుఃఖం పొంగుకొ స్తోంది. కళ్లల్లోంచి బొట్లుబొట్లుగా నీళ్లురాలి చెంపలమీదికి దొర్లుతున్నాయి.

'పలకవా... నువ్వు పలక్కపోతే నే చచ్చి పోతా' చింతలమ్మ తిరునాళ్లరోజు రాత్రి అమృత అన్న మాటలు చెవుల్లో వినబడు తుంటే ఆమె రూపం తననే చూస్తూ ఉంది.

అంతపనీ చేసింది. చచ్చిపోయింది. అందుకు కారణం తనే. అవును తనే... తనే... కాదు...కాదు... కాదు...కాదు... నాన్న... నాన్న.... అవును నాన్నే. అమృత చావుకి కారణం ఆయనే. అక్క చావుకీ,

అమ్మ చావుకీ కూడా కారణం ఆయనే.

బావి చుట్టూ జనం, బావిలోంచి తీసిన మృదుల శవం, ఆ శవం మీద పడి రోదిస్తున్న సుశీల. సుశీలని జుట్టు పట్టుకుని లాక్కొస్తున్న రంగారావు. రంగారావు చేతిలో చావు దెబ్బలు తిని ఫ్యాన్‌కి వురేసుకొని వేలాడుతున్న సుశీల శవం. ఒక్కొక్కటీ కళ్ల ముందు కనపడుతుంటే తండ్రి పట్ల రమేష్ కోపం- ఆవేశం. తన్ను తాను మర్చిపోతున్నాడు.

'మీ నాన్న గాని ఏదన్నా అడ్డంగా



వచ్చాడా.... కర్ర తీసుకో... కాళ్లు రెండూ ఇరగ్గొట్టి పారెయ్యి. పీడ వదిలి పోతుంది' అని స్వాతి చెప్పిన మాటలు గుర్తుకొచ్చి ఆవేశాన్ని రెచ్చగొడుతున్నాయి.

శివాలయంలో ఎదురుచూస్తున్న అమృత తనని చూడగానే పరిగెత్తుకుంటూ వచ్చింది. వచ్చింది వచ్చినట్టుగానే తనని కలవకుండా వెనక్కి పరుగెత్తి పోయింది. అక్కడ పెద్దపులిలా ఉన్న నాన్నని చూసి భయపడి పారిపోయింది.

ఆ పోవడం... పోవడం... ఆపైన తలచుకుంటే రమేష్‌కి దుఃఖం ఆగడంలేదు.

ఆరోజు ఆయన రాకుంటే అమృత తనతో వచ్చేది...

'మీ నాన్నగాని ఏదన్నా అడ్డంగా వచ్చాడా.... కర్ర తీసుకో... కాళ్లు రెండూ ఇరగ్గొట్టి పారెయ్యి. పీడ వదిలిపోతుంది' స్వాతి మాటలు చెవిలో మారుమోగుతు న్నాయి.

ఆరోజు ఆపని చేసివుంటే ఇప్పుడిలా అమృత... ఊహించలేకపోతున్నాడు. అత నిలో దుఃఖం పోయింది. తండ్రి పట్ల కోపం, ఆవేశం. స్వాతి చెప్పిన మాటలు రెచ్చగొడు తున్నాయి.

అక్క చావుకీ, అమ్మ చావుకీ, అమృత చావుకీ ఆయనే కారణం. రమేష్ కళ్లలో మృదుల శవం, సుశీల శవం, అమృత శవం. చెవుల్లో స్వాతి మాటలు. తన్ను తాను మర్చి పోతున్నాడు. ఆవేశంతో వూగిపోతున్నాడు. పూనకం వచ్చేసింది.

'ఒరేయ్'

ఒక్క అరుపుతో లేచాడు.

ఇంటిముందు వేరుశనగకాయలు ఆరబోసి కాలితో నెరుపుతూ వున్నారు రంగారావు, లక్ష్మీదేవమ్మ. రమేష్ అరుపుకి ఉలిక్కిపడి చూశారు. వీధి వాకిట్లో నిలబడి ఉన్నాడు రమేష్. అతని చేతిలో గొడ్డలి వుంది. లక్ష్మీ దేవమ్మ విషయం పసిగట్టి కంగారుపడిపో యింది.

"వరే రంగా నువ్వు పరిగెత్తిపో" అని రంగారావుని కేకేసి ఆమె రమేష్‌కి అడ్డువ చ్చింది. రమేష్ ఆగలేదు. లక్ష్మీదేవమ్మను ఒకతోపు తోసేశాడు. రంగారావులో భయం... వణుకు... చమటలు పట్టాయి. ఇంట్లోదూరి దొడ్డిదారిన పరిగెత్తాడు. రమేష్ ఆయన వెంటబడ్డాడు. వీధిలో రంగారావు పరిగెడుతూ ఉంటే రమేష్ వెనక తరుముకొ స్తున్నాడు. నెత్తీనోరు బాదుకుంటూ లక్ష్మీదే వమ్మ పడుతూలేస్తూ వాళ్ళ వెనక శోకాలు తీస్తూ పరిగెడుతోంది. ఆమె శోకాలకు ఇళ్ళలో జనం వీధిలోకి పరిగెత్తుకొచ్చారు. నాలుగు వీధులు కలిసినచోట జారి బోర్లాప డిపోయాడు రంగారావు. అంతే చెక్కపేళ్లను పగలకొట్టినట్లు రమేష్ గొడ్డలితో రంగారావు తలని రెండుసార్లు పగలేశాడు. అప్పుడు చిమ్మిన రక్తాన్ని చూసి రమేష్ ఉన్మాదిలా నవ్వుతూ చేతిలోని గొడ్డలిని గిరగిరాతిప్పి నిటారుగా గాలిలోకి విసిరాడు. అది గాలిలో గిరికీలు కొడుతూ పైకిపోయి వచ్చి రంగా రావు వీపులో దిగబడింది. అక్కడికి పరిగెత్తు కుంటూ వచ్చిన లక్ష్మీదేవమ్మ అది చూసి కెవ్వుమంది.

అంతా క్షణంలో జరిగిపోయింది.

ఎర్రని రక్తంమడుగులో బోర్లాపడివున్న తండ్రిని చూసిన రమేష్ తల్లో నాడులు పగి లిపోయేలా గావుకేక పెట్టి కూలబడిపో యాడు. అక్కశవం, అమ్మశవం, అమృత శవం, తండ్రిశవం ఒకదానివెంట ఒకటి కళ్లల్లో కనబడుతుంటే రమేష్‌లో పగ, ద్వేషం, కోపం... మతిభ్రమించిన వాడిలా పిచ్చిపి చ్చిగా మాట్లాడుకుంటూ వెర్రిచూపులు చూస్తూ తనలో తాను నవ్వుకుంటూ లేచిపో యాడు.

★ ★ ★

ఇంట్లో ఉయ్యాల బల్లమీద బాసింపీట వేసుకొని కూర్చుని వున్నాడు పరమేశ్వరశాస్త్రి. వర్ధనమ్మ ఆయనముందు కాస్తపక్కగా కింద కూర్చుని ఉయ్యాలబల్లమీదకి వాలిపోయింది. రాజేశ్వరి, మాధవి ఇంట్లో తలుపుదగ్గర గోడకు ఆనుకొని కూర్చుని వున్నారు. రాజా రావు, రవి మూలగా వున్న మంచంమీద చెరొకపక్క కూర్చుని వున్నారు.

అందరి హృదయాలలో విషాదం.

ఎవరూ మాట్లాడడంలేదు.

నిశ్శబ్దం.

ఆ వాతావరణంలో పరమేశ్వరశాస్త్రి గంభీ రంగా వుండడం భరించలేకుండా వుంది వర్ధ నమ్మ. మెల్లగా జరిగి ఆయన ఒడిలో తలపె ట్టింది. పరమేశ్వరశాస్త్రి ఆమె తలమీద చెయ్యి వేసి నిమిరాడు. కట్టలు తెంచుకుని వచ్చింది వర్ధనమ్మలో దుఃఖం. ఆమె ఏడ్చిన ఏడుపుకి తల ఎగిరెగిరిపడుతోంది. పరమేశ్వరశాస్త్రి

కళ్ళనిండా నీళ్ళు తొణికి బుగ్గలపైకి దొర్లాయి. ఏడుపుని ఆపుకోలేకపోయాడు. వంగి వర్ధనమ్మ తలమీద మొహాన్ని ఆనించి పొగిలిపొగిలి ఏడ్చాడు. వాళ్ళనలా చూడలేక రాజేశ్వరి, మాధవి, రాజారావు, రవి వచ్చి సముదాయించారు.

"నేను మిమ్మల్ని తప్పుగా అర్థం చేసుకున్నానండీ" ఏడుస్తూ మాటలు రానిదానిలా అంది వర్ధనమ్మ భర్తని ఉద్దేశించి.

పరమేశ్వరశాస్త్రి మాట్లాడలేదు.

"మీ ప్రతిభను గుర్తించలేకపోయాను"

ఆయన మౌనంగానే వుండిపోయాడు.

"నేను పాపం చేశానండీ, క్షమించరూ"

"ముఖాన రాత ఎవరూ మార్చలేరు. ఎలా జరగవలసి వుంటే అలా జరుగుతుంది" పాపను జోకొట్టినట్లు వర్ధనమ్మను ఓదార్చాడు.

రాజేశ్వరివాళ్ళు ఊరికి వెళ్ళే ప్రయత్నంలో బట్టలు సర్దుకుంటున్నారు. అది గమనించిన వర్ధనమ్మ "ఏమండీ వాళ్ళు బయల్దేరుతున్నారు" అంది భర్తతో. పరమేశ్వరశాస్త్రి ఏమీ మాట్లాడలేదు.

"అన్నయ్యా వెళ్తున్నాం" రాజేశ్వరి పరమేశ్వరశాస్త్రికి ఎదురుగావచ్చి చెప్పింది.

"ఆ..." అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

వాళ్ళు వర్ధనమ్మావాళ్ళకి కూడా చెప్పి బయలుదేరారు.

"ఏమండీ వాళ్ళు వెళ్ళిపోతున్నారండీ" వాళ్లను వెళ్ళకుండా వుండమని చెప్పమన్నట్టు వర్ధనమ్మ భర్తతో అంది. ఆయన నోరు విప్పలేదు.

రాజేశ్వరి, రాజారావు, మాధవి, రవి గడప దాటి పంచదిగి పోతూ వుంటే వర్ధనమ్మ, చంద్రశేఖర్ అచేతనంగా నిలబడి చూస్తూ వుండిపోయారు.

"మీరు మాట్లాడరేవండీ, వాళ్ళు వెళ్ళిపోతున్నారు"

జీవంలేని నవ్వుని పెదాలమీదకి తెచ్చుకుని "వాళ్ళు వెళ్ళిపోవలసిన వాళ్ళే" అన్నాడు పరమేశ్వరశాస్త్రి.

"మాధవిని వుండమని చెప్పండి"

"నేనెలా చెప్పగలను? "

వర్ధనమ్మ గబగబా బయటకు వెళ్ళి మాధవి చెయ్యి పట్టుకుని "మాధవీ నువ్వూ వెళ్ళిపోతున్నావా? " అని అడిగింది.

"ఆ... అవును అత్తయ్యా"

"మీ మావయ్యకి చెప్పావా నువ్వు... వద్దు వెళ్ళొద్దు... వెళ్ళేనన్నైతే మీ మావయ్యకి చెప్పేసిపో..." అంటూ మాధవిని లోపలికి తీసుకొచ్చింది. ఆమె ప్రవర్తన రాజారావుకి, రాజేశ్వరికి అర్థంకాలేదు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకొని లోపలికి వచ్చారు. మాధవి పరమేశ్వరశాస్త్రికి ఎదురుగా వచ్చింది.

"ఏమ్మా... వెళ్తున్నావా? " అని అడిగాడు.

"అవును మావయ్యా"

"మీ అత్తయ్య ఏమంటోంది "

"వద్దు అంటోంది"

"నువ్వేం అనుకుంటున్నావు? "

"..."

"ఏమ్మా? "

ఏం చెప్పాలో తెలియడంలేదు. నేలచూపులు చూస్తూ వుండిపోయింది. పరమేశ్వరశాస్త్రి దగ్గరగా వచ్చి ఆమె గడ్డం కింద చెయ్యి వేసి తలపైకెత్తాడు.

"నీ యిష్టం తల్లీ... వాళ్ళ మావయ్య చులకనచేసి మాట్లాడాడు. అందుకు పంతానికి పోయాడు చంద్ర. అంతేకానీ నీమీద ప్రేమ లేకకాదు" అన్నాడు.

"నీకు నేనున్నానమ్మా" అన్న ఆయన మాటలు గుర్తుకు వచ్చాయి మాధవికి.

వంగి పాదాలకు నమస్కరించింది. రెండు చేతులతో ఆమెను లేవదీసి హృదయానికి హత్తుకున్నాడు పరమేశ్వరశాస్త్రి. ★

**అంకితం**

**అమృతహృదయులు... మామ–మారెళ్ళ నాగభూషణాచారి పాదపద్మములకు భక్తితో... రచయిత.**

# ‘శిథిలాలయం’ పై సమీక్షలు

జనవరి ‘చతుర’లో ప్రచురితమైన ఆర్.వి.టి.ఫణీంద్రుడు రచన ‘శిథిలాలయం’ పై మాకందిన ఉత్తమ సమీక్షలు,

## గొప్ప సెటైర్!

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*



జనవరి చతురలో వచ్చిన ‘శిథిలాలయం’ ఒక నవల కాదు... సుదీర్ఘ విమర్శ. సాహిత్యంపై రచయిత సంధించిన విమర్శనాస్త్రం... సాహిత్యంతో పరిచయం ప్రతి ఒక్కరి మస్తిష్కాన్ని దొలిచే ఒక అద్భుతసాధనం... ఇందులో ప్రత్యేకించి కథగానీ, కథనంగానీ, పాత్రల గొప్పతనంగానీ ఏమీ లేవు.

ఓ నలుగురు చేయి తిరిగిన రచయితలు చేసిన సుదీర్ఘ చర్చ మాత్రమే యిది. కార్తీక్... రచయితగా స్థిరపడాలనుకోవడం... పరిస్థితులకు ఎదురొడ్డి ప్రతీకారం, పగ సాధించడం... పార్వతి అప్పుడప్పుడు వారించడం... తనవల్లే తన అభిమాని రేణుక చనిపోవడం... నరేష్ మావగారికి ఉరిశిక్ష పడడం... ఇవేమీ రచయిత అయిన కార్తీక్‌లో ఏ మార్పు తేలేదు. నీతిగా, నిజాయితీగా ప్రజల మేలుకోసమే రచనలు చేసే వీరభద్రం తను చేసిన పనులవల్లనే చనిపోవడం కార్తీక్‌లో విపరీత సంచలనం జరిగి... కలం వదిలేశాడు. ఫలితంగా వారసత్వంగా అన్వేష్ అదే తరహా రచనలు కొనసాగిస్తున్నాడు. అన్వేష్ తర్వాత మరో వెంకట్... వెంకట్ తర్వాత

మరో రాజేష్... ఇలాగే ఈ హింసావాద సాహిత్యానికి అవధుల్లేవు... అంతులేదు.

మానవ సంబంధాలు, మానవతావిలువలు, మనిషి జీవితంలో ఆటుపోట్లు... సమాజంలో జరిగే మార్పులు, ఆచారాలు, వ్యవహారాలు, ఇలా విభిన్నకోణాల రచనలు మానవ మనుగడను ముందుకు తీసుకెళ్తాయే కానీ మానవ కంకాళాలతో, భైరవవిగ్రహాలతో, క్షుద్రపూజలతో, రక్తతర్పణాలతో సాగే రచనలు మనిషి మనుగడను ఏ స్థితికి దిగజారుస్తాయో... రచయితలందరూ ఆలోచించాలి.

ఏది ఏమైనా ఈ శిథిలాలయం గొప్ప 'సెటైర్'. ప్రస్తుత రచయితలు, కొత్తగా రచనలు చేసేవారు కొందరైనా ఈ 124 పేజీల సుదీర్ఘ రచనను చదివి అనంతరం మంచి రచనలు అందించినట్లయితే ప్రస్తుత రచయిత ఆర్.వి.టి. ఫణీంద్రుడు, చతుర వారూ మంచి ఫలితం సాధించినట్లే.

–తెన్నేటి లక్ష్మీనరసింహమూర్తి,
అర్థవరం - 534 197

## ఆవేదన

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

ఫణీంద్రుడుగారి 'శిథిలాలయం' ఇతివృత్తం ఈనాటి సాహిత్యాన్ని దృష్టిలో పెట్టుకుని విశ్లేషిస్తూ అందరూ ఆలోచించాల్సిన రచనగా రూపొందింది. నవల చదువుతున్నప్పుడు పేరున్న కొందరు రచయితలు పాఠకుల దృష్టిలోకి వస్తారు. కార్తీక్ చిన్నతనంకాని, వాళ్ళ తాతగారి వర్ణనకానీ, కార్తీక్ పేరుకోసం రాసిన మొట్టమొదట నవలకాని, ఆ నవల పబ్లిష్ చేసిన పత్రిక వర్ణనకాని ఇవన్నీ ఆ దారిలోనే నడిచాయి. ఈ విషయం పక్కన పెడితే ఏ ఉద్దేశ్యంతో ఈ నవల రాసారో అది సాధించినట్లే అన్పిస్తుంది. మార్పు సహజం! సమాజంలోని అన్నిరంగాలూ మార్పును సంతరించుకుంటూనే నడుస్తాయి. పాఠకులు 'మాలపల్లి', 'బారిస్టర్ పార్వతీశం', 'వేయిపడగలు' మొదలగు నవలలనుంచి 'సెక్రటరి', 'లక్ష్మి', 'శాంతినివాసం'లను దాటుకుంటూ 'తులసి' వరకు వచ్చారు. మన పాఠకులు షిడ్నీ సెల్డన్ 'ఇఫ్ టుమారో కమ్స్', జఫరి ఆర్చర్ 'కాన్ అండ్ ఎబెల్' మొదలగు నవలలని గొప్ప నవలలుగా భావించవచ్చు. కానీ అదే శైలిలో రాసిన, రాస్తున్న నవలలను అవి తెస్తున్న పోకడలను బట్టి కాపీలుగాను, పెడదారి పట్టిన సాహిత్యంగాను విమర్శించటం జరుగుతోంది. దీనిని బట్టి పాఠకులను తక్కువ అంచనా వేయరాదని స్పష్టమవుతోంది.

మారుతున్నకాలంతో నవల ఇతివృత్తాలు పాఠకులను ఆలోచింపజేసేవిగా ఉండాలి. చీరెలు, మేడలు, కార్లవర్ణన చెప్పటం కాక ఏదైనా ఒక సబ్జెక్టు గురించి పాఠకులకు చెప్పాలనే తపన రచయితలలో ఉండాలి. అవి లేని పరిస్థితుల ఫలితమే ఇప్పుడు వస్తున్న నవలల తీరు.

అలా అని వస్తున్న అన్నితరహా నవలలను ఆహ్వానించనక్కర్లేదని చెప్పటంలేదు. మంచి నవలలకి ఎప్పుడూ ఆహ్వానమే. సమాజంలో భార్యగా తన కర్తవ్యాన్ని తను అర్థం చేసుకునే పార్వతులు, జీవితాన్ని తేలికగా తీసుకునే సరోజలు, ఒక కర్తవ్యం కోసం జీవితాన్ని అర్పితం చేసే ఇందిరలు వుంటారు. సమాజం ఎలా పార్వతులకి, ఇందిరలకి పట్టం కడుతుందో సరోజలు ఎలా కనుమరుగవుతారో అలానే మంచి నవలలు ఎప్పుడూ మెప్పు పొందుతూనే వుంటాయి. చెత్త నవలలు కనుమరుగవుతూనే వుంటాయి. ప్రస్తుతం వస్తున్న నవలల పోకడలను బట్టి 'శిథిలాలయం' ఇతివృత్తం ఒక ఆవేదనని తెలియచేస్తుంది. అయితే నవల ముగింపు రచయిత నిరాశని తెలియచేస్తోంది. మంచి నవలలకు, హిట్

అయిన నవలలకు ఉన్న తేడాని రచయిత విశ్లేషించలేదు. ఆ పని చేస్తే ఇంకా బాగుండేది.

–వి. జ్యోతి,
రాజ్‌గంగాపూర్, ఒరిస్సా - 770 017

## మరో కథాచిత్రం

*(తృతీయ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

'శిథిలాలయం'లో రచయితల సాధకబాధకాలను చక్కగా వర్ణించారు. నవలలోని హీరోపాత్ర 'కార్తీక్' ఒక ప్రముఖ రచయితను ప్రతిబింబిస్తుందని నవలలతో పరిచయమున్న ఏ సగటు పాఠకుడైనా ఈజీగా ఐడెంటిఫై చేయగలడు. అలాగే త్రిమూర్తులు పాత్ర, ఇంకా చాలా పాత్రలు కూడా నేటి నిజజీవితంలోని పాత్రలే.

'శిథిలాలయం' అన్న టైటిల్‌ను ఈ నవలకు ఎందుకు పెట్టారో అర్థంకాదు. నేటి రచనాలోకాన్ని శిథిలాలయంతో పోల్చారా? నేటి నవలల దుస్థితి గురించి రచయిత చాలాచోట్ల తెలియచేశారు. కానీ ఈ 'శిథిలాలయం' రాయడంవల్ల రచయిత సాధించినదేమిటి? మరి ఇది కూడా పాఠకులకు ఎలాంటి సందేశమూ ఇవ్వలేదు. అలాంటప్పుడు నవలయొక్క స్థితిగతుల గురించి చర్చించడం ఎందుకని! నవలలన్నీ పాఠకులకు సందేశమిచ్చేలా వుండాలని కాదు. రచయిత ఒక ఉద్దేశ్యంతో రాసినా పాఠకులు దాన్ని వేరేవిధంగా రిసీవ్ చేసుకోవచ్చు. ఈ నవలలో కార్తీక్ 'గాయత్రి'కోసం రాసిన నవలను పాఠకులు వేరేవిధంగా తీసుకోవడం దీనికి ఉదాహరణ.

కార్తీక్ భార్య పార్వతి పాత్రను మహోన్నతంగా చిత్రీకరించడానికి ప్రయత్నించారు. కానీ అదేపాత్ర కార్తీక్‌లోని 'మిస్టర్ హైడ్' పూర్తిగా బయటికి రాకుండా కాపాడలేకపోయింది. రచయిత తలచుకుని ఉంటే పార్వతి పాత్రను ఇంకా మహోన్నతంగా చిత్రీకరించి ఉండవచ్చు.

అలాగే ఇందిర పాత్ర కూడా. హీరో పాత్రకు మోటివేషన్, ఇన్స్పిరేషన్ ఇవ్వడానికే సెలెక్ట్ చేసుకున్న పాత్రలా ఉంది కానీ నవలలో ఇన్‌వాల్వ్ అయినట్లు కనిపించదు. అలాగే నవల మధ్యమధ్యలో సైకియాట్రిస్ట్ ఇందిర దగ్గరకు వచ్చే పాత్రలవల్ల నవల కంటిన్యుటీ దెబ్బతిన్నట్టు అనిపిస్తుంది. ఆ పాత్రలగురించి చదివేటప్పుడు, కథ మధ్యలో ఆగిపోయి సెపరేట్ ఫ్రేమ్‌లో ఇంకొక కథాచిత్రం చూస్తున్నట్లనిపించి నవల పాఠకుని మనసుపై చెరగని ముద్ర వేయడానికి అడ్డం వస్తుంది.

నవలలో రచయిత శైలి బాగుంది. కానీ, 'రచయిత తనకు తెలిసిందంతా ప్రదర్శించకూడదు. పాఠకులు ఎంత అర్థం చేసుకుంటారో అంతవరకే చెప్పాలి' లాంటి కొటేషన్స్ బాగున్నాయి.

మొత్తానికి 'శిథిలాలయం' నవల పాఠకుల్ని చదివించేలా చేస్తుంది. ఈనాడు రచనా వ్యాసంగంలో రచనా లోకంలో ఉన్న అడ్డంకుల గురించి పాఠకుడికి తెలుస్తుంది. రచన అంటే కేవలం కాగితంమీద కలంతో నాలుగు వాక్యాలు రాయడమే కాక ఇంకా చాలాచాలా విషయాలున్నాయని ప్రతి పాఠకుడూ ఈ నవల చదవడంవల్ల తెలుసుకుంటాడు.

–బి. నరహరి,
అనంతపురం - 515 001

## సాహిత్యాలయం - శిథిలాలయం

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

హితవు చెప్పే సాహిత్యం శిథిలాలయంగా

మారిన నేపథ్యంతో సాగిన ఈ నవల ఆద్యంతం విభిన్న సంఘటనలతో పాఠకుడిని ఆలోచించమని తట్టి లేపుతూనే వుంది. కానీ వాస్తవానికి ప్రతి రచయిత(త్రి) తమ వెన్ను తామే చరుచుకుని పునరాలోచన చేసుకోవలసిన అవసరాన్ని రచయిత పాత్రద్వారానే ప్రస్ఫుటం చేసిందీ నవల.

సాహితీ సాగరాన్ని మథించిన 'కార్తీక్' అవగాహనా శూన్యుడై అమృతం అనుకుని చిలకగా కటాక్షించిన కాలకూట విషాన్ని కలంలో నింపి విభిన్న ప్రయోగాలతో సమాజాన్ని 'స్లో పాయిజన్' చేయసాగాడు. ఒక్కసారి అక్షరాలు అచ్చురాళ్ళయితే లక్షలాది మంది రచనను చదివి మానసికంగా ప్రభావితులౌతారు. అయితే నవల నడిచిన తీరు గమనిస్తే కార్తీక్ చుట్టూవున్న సమాజం కన్నా కార్తీకే ఎక్కువ ప్రభావితుడైనట్లనిపిస్తుంది.

పత్రికా సాహిత్యమే కాదు టి.వి., సినిమా-మీడియా ఏదైనా సరే వికృత ధోరణులు ప్రోదిచేసి పెంపుచేస్తే భారీమూల్యం చెల్లించవలసి వస్తుంది. దీనిక్కారణాలు గుర్తించకుండా ఒకరిపైనొకరు నెపం వేసుకుంటూ పలాయనవాద మంత్రం పఠిస్తే ప్రయోజనం శూన్యం.

తమ చేతివ్రాత సమాజం నుదుటివ్రాత అని రచయిత(త్రు)లు జాగురూకులై నడచుకోకపోతే జరిగే అనర్థాలు వివిధ సంఘటనల ద్వారా అతి చిన్న పరిధిలో క్లుప్తంగానైనా వివరణాత్మకంగా ఆయా పాత్రలద్వారా వివరించారు. ఇంకా ఏదో చెప్పాలన్న తపన రచనలో అంతర్లీనంగా అడుగడుగునా గోచరిస్తూనే వుంది. అయితే రచయిత తాను చెప్పాలనుకున్న హితోక్తులు ఇందిర విమర్శల రూపంలో చెప్పినది రెండు పేజీలకు మించకపోవడం, దానికి తోడు కార్తీక్ చుట్టూ నడిచిన పాత్రలలో కొన్నింటిని చిత్రీకరించిన తీరు కడకు ఈ నవలకు కూడా 'కమర్షియల్ ట్రెండ్' తప్ప లేదా అనిపింపచేసింది. అయినప్పటికీ ఈ ఒరవడితో నవలా ప్రయత్నం హర్షణీయం, అభిలషణీయం!

**–సి. ఉమాదేవి,**
గన్నవరం - 521 101

## సజీవ పాత్రలు

*(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

**ఆర్**.వి.టి. ఫణీంద్రుడుగారి నవల 'శిథిలాలయం' నేటికాలంలో రావలసిన రచన. ప్రతి రచయితా చదివి తీరవలసిన నవల.

రచయితకు కేవలం ధనసంపాదన మాత్రమే ధ్యేయం కాదు, కారాదు. సమాజంపట్ల ఒక పవిత్రమైన బాధ్యత కూడా ఉంటుందని హెచ్చరిస్తూ, ఆ విధిని నిర్వర్తించలేని రచయితలు సంఘద్రోహులేనని నిర్మొహమాటంగా చాటిచెప్తుందీ నవల.

ఇందులో హీరో కార్తీక్‌ది మానవ సహజమైన బలహీనతలన్నీ ఉన్న సజీవపాత్ర. అతనికి తాను తప్పు చేస్తున్నానని తెలుసు, కానీ దిద్దుకుందామంటే, అతని అసలు ధ్యేయమైన ధనార్జన అడ్డుపడుతుంది.

అనుక్షణం అతణ్ణి తట్టిలేపే మరొక అపూర్వమైన పాత్ర పార్వతి. ఇంక మిగిలినవన్నీ కార్తీక్‌లోని గుణగణాలకు అద్దం పడుతూ వచ్చిపోయేవే. మొత్తంగా ఈ నవల నేటి సమాజంలో వ్యక్తులు ధనసంపాదన వెనుక తీస్తున్న వెర్రిపరుగులను విమర్శిస్తోంది. ఉత్తమ విలువలను ప్రతిబింబించలేని రచన ఒక శిథిలాలయం వంటిదేనని నొక్కి చెప్తోంది. పాఠకుల మనసు దోచుకుంటుంది.

**–అనూరాధ,**
హైదరాబాదు - 500 038.

★

# చతురప్రపంచం

## ఏది ముఖ్యం

ఇటీవల ఓ అమెరికన్ పత్రిక భార్యలతో ఓ సర్వే నిర్వహించింది. "ఇంటి దగ్గ రుండి మీ భర్తతో రతిలో పాల్గొనడానికిష్టప డతారా? లేక ఆ సమయంలో ఫైవ్ స్టార్ హోటల్ కెళ్లి భోజనం చేస్తారా? మీ ఛాయిస్ ఏమిటి? "అన్నదాసర్వే.

84 శాతం మంది భార్యలు భోజనాన్ని కోరుకున్నారు. దానికి వారిచ్చిన వివరణలు ఈ క్రింది విధంగా ఉన్నాయి. డల్లాస్‌లో నివశించే మిసెస్ మేర్లిన్ డుఫీల్డ్ అనే మహిళ (53) భావాలివి...

"ఇంట్లో ఉంటే ఇద్దరికీ భోజనం వండాలి. గిన్నెలు తోమాలి. ఆ తర్వాత రొమాన్స్ టైముకి అలిసిపోతాను."

మిసెస్ ఫిలిప్స్ బోయ్‌లాన్ అనే మహిళ (48) ఇలా అంటోంది. "20 ఏళ్ల క్రితమయితే ఇంట్లో ఉండడానికే ఒప్పుకునే దాన్ని. కానీ ఇప్పుడు డిన్నర్‌నే కోరుకుంటాను" అని. ఈమె న్యూయార్క్ నివాసి.

ఫ్లోరిడాకి చెందిన మిసెస్ నారీన్ కేస్‌వెల్ (41) ఇలా చెప్పింది. "దానికి వేళాపాళా లేదు. ఇంట్లో ఎప్పుడైనా రతిలో పాల్గొనవచ్చు. కానీ భోజనం ఆఫర్ అస్తమానూ రాదుగా."

సేనోజాకి చెందిన మిసెస్ మెర్లిన్ కూపర్ (21) భోజనాన్నే ఇష్టపడతానంది.

దానికి కారణాన్ని ఇలా వివరించింది... "రతి రుచి నాకు తెలుసు. కానీ ఫైవ్ స్టార్ హోటల్ లో డిన్నర్ రుచి తెలియదు కాబట్టి తెలుసుకోవాలనుకుంటున్నాను."

లాస్ ఏంజెలెస్‌కి చెందిన మిసెస్ లిజావిలియమ్స్ (26) అనే మహిళ ఇలా అభిప్రాయపడుతోంది.

"పక్క మీద కన్న ఫైవ్ స్టార్ హోటల్లోని వాతావరణం అందంగా ఉంటుందని తెలుసు. అందుకే రొమాన్స్ కాకుండా




భోజనం కూడా ఎంత బాగుంటుందో, అదీ అలాంటి హోటల్లో... తెలుసుకుంటే పోలా..."

అయితే భర్తల అభిప్రాయం ఇందుకు భిన్నంగా ఉంది. 79 శాతం మంది భర్తలు ఇంటిదగ్గర భార్యతో గడపడమే ఫైవ్ స్టార్ హోటల్ భోజనం కన్నా నయం అన్నారు.

షికాగో నివాసి గేరీ కౌంటర్ ఇలా అంటున్నాడు, "మా ఆవిడ చక్కగా, రుచిగా వండగలిగినప్పుడు హోటల్ కూడు దేనికీ? "

47 ఏళ్ల కెన్నెత్ గెట్టి "ఇంటికొచ్చాక కారులో మళ్లీ అంత దూరం వెళ్లిరావడం

కష్టం" అంటూంటే డల్లాస్‌కి చెందిన విలియం ఆర్చర్(41) "అది ఎంత గొప్ప భోజనమయినా మా ఆవిడతో రతిలో పాల్గొన్న తృప్తినివ్వదు." అని తేల్చాడు. అందుకే 'లోకో భిన్న రుచిః' అన్నారు పెద్దలు.

## 'మగ గైషా' లతో మజా

'గెయిషా గర్ల్స్' గురించి చాలామందికి తెలుసు. జపాన్‌లోని అబ్బాయిలకోసం గైషా గర్ల్స్ ఉంటారు.

అయితే ఆ దేశంలో ఇప్పుడో కొత్త ట్రెండ్ మొదలయింది. జపనీస్ ఆడవాళ్ల కోసం గైషా బాయిస్ తయారయ్యారు. క్లబ్బుల కొచ్చే ఆడవాళ్లకి ఈ గైషా బాయిస్ మసాజ్ చేయడం, టీ ఇవ్వడం, కంపెనీ కోసం కబుర్లు చెప్పడం, వాళ్ల సిగరెట్లను అంటించడం, వారితో కలిసి నృత్యం చేయడం, వాళ్ల బాధలని వినడం... మొదలైనవి గైషా బాయిస్ బాధ్యతలు.

ఆడవాళ్ల కోసమే నడిచే మగగైషాలున్న క్లబ్బులు ఇప్పుడు టోక్యోలో స్టేటస్ సింబల్ స్థలాలయ్యాయి. అలాంటివాటిలో సభ్యత్వం లభించడానికి ఎన్నో అర్హతలుండాలి....టాప్ ప్రభుత్వోద్యోగో, రాజకీయనాయకురాలో, ఆరుఅంకె ఆదాయంగల యువతో అయివుండాలి.

'లేడీస్ క్లబ్ ఆలి' టోక్యోలోని ఇలాంటి మొదటి క్లబ్బు. దీనర్థం లేడీస్‌క్లబ్ లవ్. దీని యజమానురాలు మిసెస్ నగామైన్ మాట్లాడుతూ "ఆడవాళ్లని మగవాళ్లు చక్కగా చూసుకోవడం ఏసియన్ ఆడవాళ్లకి తెలియదుకాబట్టి ఆ అనుభవాన్నివ్వాలని స్థాపించాం. ఆసియా దేశాల్లో మగాళ్లు ఆఫీసునుంచి ఇంటికి వస్తూనే వేడినీళ్లు పెట్టు, టీ ఇయ్యి, టి.వి. ఆన్ చెయ్యి లాంటి ఆజ్ఞలను జారీ చేస్తుంటారు. వాళ్లు కూడా తమ భర్తలయడ విధేయతగా ఉండే సంస్కృతికి లోబడ్డవారే. దీన్లోని మార్పుని ఎంజాయ్ చేసే అవకాశం ఆడవాళ్లకివ్వాలని మగగైషాలకి శిక్షణనిచ్చి దీన్ని తెరిచాం." అంది.

ఈ క్లబ్బులోకి ఓ సభ్యురాలు రాగానే చక్కని దుస్తుల్లోని మగాళ్లు ఆమెని ఆహ్వానిస్తారు. క్లబ్బు ఆవరణలో ఉన్నంతసేపూ ఆమెని రాణీలా ట్రీట్ చేస్తారు. సగటున ఓ సభ్యురాలు ఇందుకోసం ఓ రాత్రికి 3500 రూపాయలదాకా చెల్లించాల్సివుంటుంది. కొందరు 12000 రూపాయలుకూడా




చెల్లిస్తూవుంటారు, కొన్ని ప్రత్యేక సర్వీసులను కలుపుకుని.

క్లబ్బు ఆవరణలో సెక్సుని అనుమతించరు. కానీ ఇక్కడ పరిచయం అయిన మగాళ్లు సభ్యులతో బయట సెక్సులో పాల్గొనవచ్చును. అందుకు క్లబ్బు అభ్యంతరం చెప్పదు. అయితే నగదుకాక బహుమతులే తీసుకోవాలన్న నియమం వుంది. నగదు తీసుకుంటే అది వ్యభిచారం నేరం కిందకి

వచ్చి తమ క్లబ్ లైసెన్స్ రద్దు చేయవచ్చన్న భయంతో ఈ నియమం పెట్టారు.

## జయంట్ పాండా

ప్రపంచంలో అతి తక్కువ సంఖ్యలో ఉన్న జంతువుల్లో ప్రథమస్థానం జయంట్ పాండాది. 25 లక్షల ఏళ్లనుంచీ భూమిమీద జీవించి ఉన్న పాండా కేవలం చైనా, నార్త్ వియత్నాం దేశాలకే పరిమితం. తూర్పుచైనాలో ఉన్న వీటి సంఖ్య వెయ్యిలోపే. వీటిలో 200 దాకా వివిధ జంతు ప్రదర్శనశాలల్లో ఉన్నాయి. చెరకు, లేత వెదురు కాడలు, ఆకులు తిని బతికే పాండా చూడముచ్చటగా ఉంటుంది. నల్లటి కాళ్లు, చెవులు, నడుము... మిగిలిన భాగమంతా తెల్లగా వుండే జయంట్ పాండా కి ఆకలెక్కువ. ఇది రోజుకు 8 గంటలు తింటూ గడుపుతుంది. ఇందుకు కారణం దాని కడుపులో జీర్ణించుకోవడానికవసరమయ్యే రసాయనిక పదార్థాలు ఉత్పత్తి కావు. దాంతో జీర్ణంకాక దానికి ఆకలి అనిపించి తింటూవుంటుంది.

ఇది ఒంటరిగా జీవించే జంతువు. ఒకదానితో మరొకటి కలవవు. దీని దవడలు ఎంత బలమైనవంటే గట్టి వాసాన్ని కూడా కొరకగలవు. 100 కిలోల బరువు దాకా ఎదిగే ఇవి రోజుకి నాలుగు కిలోల ఆహారాన్ని తీసుకుంటాయి. మిగిలిన సమయమంతా నిద్రలో గడుపుతాయి. 18 నెలల దాకా తల్లి పిల్లలను పెంచి ఆ తర్వాత వదిలేస్తుంది. దీన్ని రెచ్చగొడితే తప్ప ఇది మనుషుల మీదకి దాడి చేయదు. వాటి ప్రధాన శత్రువులు కుక్కలు.

కుక్క కనిపిస్తే చెట్టెక్కి ప్రాణ రక్షణ చేసుకుంటుంది. వీటి జాతి ఇంతగా అంతరించిపోవడానికి కారణాలు.... దీనిని చర్మం కోసం చంపడం, వేగే జంతువులకోసం పన్నిన వలలో ఇవి చిక్కుకుని చావడం, అడవులను నరికివేయడంతో ఆహారం సమృద్ధిగా లభించకపోవడం మొదలైనవి.

జయంట్ పాండా ఆరు లేక ఏడు సంవత్సరాలకి జత కడుతుంది. ఆడ పాండా ఏడాదిలో కేవలం 12 నుంచి 25 రోజులదాకానే జత కడుతుంది. ఆ సమయం దాటితే ఆ ఏడాదికి ఇంక దానికి పిల్లలు పుట్టరు. జత కట్టిన 12-24 వారాల మధ్యలో పిల్లలు పుడతాయి. చైనాలో రెడ్‌పాండాలు కూడా వున్నాయి. జయంట్‌పాండాల కన్నా చిన్నవిగా ఉండే వాటి ఒంటిరంగు తెలుపు, నలుపుల్లో కాక ఎరుపు, నలుపుల్లో ఉంటాయి. ఇది చూడడానికి పాండాలా వున్నా జయంట్‌పాండా కి చెందింది కాదు. రేకాన్ జాతికి చెందింది.




ప్రస్తుతం 800 పాండాలు తూర్పుచైనాలోని 8 పర్వతశ్రేణుల్లో, సముద్రమట్టానికి 3,000 మీటర్లపైన వెదురు అడవుల్లో జీవిస్తున్నాయి. జయంట్‌పాండా తొలిసారిగా మనిషి కంట పడింది 1869లో.

'వరల్డ్ వైల్డ్‌లైఫ్ ఫండ్' చిహ్నంగా

# ఏరిన ముత్యాలు

★ ఒక పౌను చదువును ఆచరణలో పెట్టడానికి, పదిపౌనుల జ్ఞానం కావల్సి వుంటుంది.

–పర్షియన్ సూక్తి

★ కాలంకంటే విలువైనదీ లేదు, అంతకంటే విచ్చలవిడిగా వృధా చేయబడేదీ లేదు.

–ఆంగ్లసామెత

★ బుద్ధిహీనుడైతే గాని ఒకే గోతిలో రెండుసార్లు పడడు.

–టర్కీ సామెత

★ గొప్ప వ్యక్తులు ఆశయాలకోసం జీవిస్తారు. నీచులు, బలహీనులు ఆశలకోసమే జీవిస్తారు.

–చైనీస్ సూక్తి

★ సంపదవల్ల అవగుణాలు బయటపడతాయి. కష్టాలవల్ల సుగుణాలు వెల్లడవుతాయి.

–ఆంగ్ల సామెత

★ నీవు మెలకువగా వుండే రాత్రి మొదటి ఝాములో నీవు చేసిన తప్పులగురించి ఆలోచించుకో. ఇతరుల లోపాలగురించి నీవు నిద్రపోతున్న మిగతా మూడు ఝాములు ఆలోచించినా ఫరవాలేదు.

–చైనా సామెత

★ అందరినీ సంతోషపరచాలని కోరు వ్యక్తి ప్రయత్నం వ్యర్థప్రయత్నం.

–లాటిన్ సామెత

★ దురదృష్టాలు రెక్కలతో ఎగురుకుంటూ వస్తాయి. కాళ్ళతో నడుచుకుంటూ పోతాయి.

–ఆంగ్ల సామెత

★ స్నేహం నిద్రపోతున్నప్పుడు, ద్వేషం మేల్కొంటుంది.

–ఫ్రెంచి సామెత

★ అనుభవ జ్ఞానమే అసలయిన అర్హత.

–దలైలామా

★ కిరీటాన్ని ధరించే శిరస్సు సుఖానికి దూరమవుతుంది.

–షేక్స్‌పియర్

★ సత్యానికి గ్రహణం పడుతుంది గానీ పూర్తిగా అదృశ్యంకాదు.

–లివి

★ ఉత్తములు మిత్రకార్యాన్ని నెరవేర్చడంలో జాప్యం చేయరు.

–కాళిదాసు

సేకరణ: డి. వెంకటేశ్వరరావు

పాండాను తీసుకున్నారు. దీన్ని బతికించుకోవడానికి ఏటా లక్షలకొద్దీ డాలర్లను వెచ్చిస్తోందా సంస్థ. దురదృష్టవశాత్తూ మనిషి సంరక్షణలో ఎదిగే పాండాల్లో కూడా నాలుగింట ఒకటి మరణిస్తోంది.

## బీర్ రన్నర్స్

అమెరికాలో ఇటీవల ఓ కొత్తరకం నేరస్థులు పుట్టుకొచ్చారు. అమెరికా అంతటా హైవేలలో వేల సంఖ్యలో 'కన్‌వీనియన్స్ స్టోర్స్' వుంటాయి. ఈ స్టోర్స్ కేవలం హైవేలపై కార్లలో వెళ్లేవాళ్ల అవసరాలను తీర్చడం కోసం వెలిసినవి. వీటిలో భోజన పదార్థాలు, వైన్స్, లిక్కర్స్, సాఫ్ట్‌డ్రింక్స్, టాయిలెట్ సామాను మొదలయినవి దొరుకుతాయి.

కొందరు ఆ దుకాణాల్లోకెళ్లి ఫ్రిజ్‌లలోని బీర్ క్యాన్స్ ప్యాక్స్ తీసుకుని కౌంటర్‌లో వాటి ధర చెల్లించకుండా పరిగెత్తుకుని పారిపోయి కారెక్కి వెళ్లిపోతున్నారు. పోలీసులకు రిపోర్ట్ చేస్తారేగానీ పెద్దగా ఖరీదు చెయ్యని ఇలాంటి బీర్‌క్యాన్స్ దొంగలని పట్టుకునే ఆసక్తి, టైము పోలీసులకు వుండటంలేదు. ఈ సూక్ష్మం గ్రహించడంతో ఇలాంటి దొంగతనాలు పెచ్చుపెరిగిపోయాయి. ఈ దొంగలని 'బీర్ రన్నర్స్' గా వ్యవహరిస్తున్నారు. ఈ రకం దొంగలు కాలిఫోర్నియా రాష్ట్రంలో అధికం.

ఇలాంటివారితో విసిగెత్తిపోయిన సార్జెంట్ గ్రైనరీకి ఓ ఆలోచన తట్టింది. దాన్నతను పై అధికారుల అంగీకారంతో ఆచరణలోకి తెచ్చాడు. ఆ రాష్ట్రంలో వేలకొద్దీ ఉన్న 'కన్‌వీనియన్స్ స్టోర్స్' లను కాపలా కాసేంత పోలీసు ఫోర్స్ లేదు. దాంతో ఆ దొంగలను పట్టుకోవడానికి 'మేనెక్విన్ పోలీస్ ఫోర్స్' ని ఉపయోగించదలుచుకున్నాడు సార్జెంట్ గ్రైనరీ. చూడటానికి అచ్చం పోలీసులా కనిపించే దుస్తులను ఓ బొమ్మకి తొడిగి (బట్టల దుకాణాల్లో చీరలు కట్టి ఉంచే బొమ్మల్లాంటివి) ఆ మేనెక్విన్‌ని ఓ స్టోర్‌లో బీర్‌క్యాన్స్ గల ఫ్రిజ్ పక్కన ఉంచాడతడు. స్టోర్‌లోకి వెళ్లబోయే లేదా వెళ్లిన బీర్‌రన్నర్స్ ఆ బొమ్మని చూసి లోపల పోలీసులు ఉన్నారనుకుని దొంగతనం చేయడానికి భయపడి వెళ్లిపోతారు. ఈ ట్రిక్ చాలా స్టోర్స్‌లలో ఫలించింది.




పోలీసుల సహకారంతో చాలా స్టోర్స్‌ల యజమానులు తమ ఖర్చుతో అలాంటి బొమ్మలని తమ స్టోర్స్‌లలో ఉంచారు. అయితే ఈ ట్రిక్కును బీర్ రన్నర్స్ త్వరలోనే కనుక్కున్నారు. సార్జెంట్ గ్రైనరీకి ఇంకో ఆలోచన స్ఫురించింది. ఆ బొమ్మ తల అటూఇటూ కదిపే ఏర్పాటు చేశాడు. దాంతో అది బొమ్మ కాదని, మనిషని భ్రమించారు దొంగలు. ఈ ట్రిక్కు కూడా కొద్దివారాలకు బీర్‌రన్నర్స్ కనుక్కున్నారు. సార్జెంట్ గ్రైనరీ ఇప్పుడు కొత్తగా ప్రతి పోలీస్ బొమ్మకి వీడియో కెమేరాని, మైక్‌ని బయటకి కనపడకుండా అమర్చి బీర్‌క్యాన్స్

ఉన్న ఫ్రిజ్ తలుపు తెరిచినపుడల్లా అవి ఆన్ అయ్యేలా ఏర్పాటు చేశాడు. బీర్ తీసుకుని పరిగెత్తి పారిపోయేవాళ్లని వీడియో కెమేరాలో బంధించాక వాళ్లని పట్టుకోవడం తేలికకదా! క్రమంగా బీర్ రన్నర్స్ సంఖ్య ఇప్పుడు తగ్గుతోంది.

## రేడియో చేసిన మేలు

అమెరికాలోని రేడియో నెట్‌వర్క్ మొత్తం ప్రైవేటు సంస్థల చేతుల్లో వుండటంవల్ల 1930 నుంచీ 1950 దాకా అనేక రకాల సీరియల్ నాటకాలని ప్రసారం చేసాయి. ప్రపంచంలోని అత్యంత ప్రముఖ డిటెక్టివ్ షెర్లాక్ హోమ్స్ సీరీస్‌ని ఎడిత్ మైసర్ అనే రచయిత రాసి డైరెక్ట్ చేశాడు. అమెరికాలోని తొలి సీరియల్ నాటకం ఇది. ఈ సీరియల్ డ్రామావల్ల అప్పటికే పాఠకులు మర్చిపోయిన కానన్ డాయల్ పుస్తకాలకి అమెరికాలో తిరిగి డిమాండ్ ఏర్పడింది. దాంతో షెర్లాక్ హోమ్స్ పాత్ర విజయాన్ని హాలీవుడ్ వాళ్ళు కూడా ఉపయోగించుకున్నారు. షెర్లాక్ హోమ్స్ సినిమాలు అనేకం తీశారు వాళ్ళు. రేడియో ప్రైవేటు సంస్థల చేతుల్లో వుండటంవల్ల అమెరికన్ ప్రజలకి మరో మంచి జరిగింది. ఆనాటి రేడియో ప్రసారాలని "ది న్యూ ఎడ్వెంచర్స్ ఆఫ్ షెర్లాక్ హోమ్స్, మోర్ న్యూ ఎడ్వెంచర్స్ ఆఫ్ షెర్లాక్ హోమ్స్' పేర ఆడియో కేసెట్‌ని ఇటీవల అమెరికన్ మార్కెట్‌లో ప్రవేశపెట్టారు. అలాంటి గంట కేసెట్ ఒక్కోదాని ఖరీదు 10 నుంచి 12 డాలర్లు.

ఆ రోజుల్లో ప్రసారమయిన ఆ నాటకాలని ఇప్పుడు 3,000కి పైగా వున్న చిన్న చిన్న ఎ.ఎమ్, ఎఫ్.ఎమ్. లోకల్ రేడియో స్టేషన్స్ తిరిగి పునఃప్రసారం చేస్తున్నాయి. కంపాక్ట్ డిస్క్‌లో కూడా ఆనాటి పాపులర్ డ్రామాలని విడుదల చేశారు.

ఆ రోజుల్లోని హాలీవుడ్ స్టార్స్ అయిన క్లార్క్ గేబుల్, జేమ్స్ స్టివార్ట్, మేరీ ఎకార్డ్, రుడాల్స్ వేలంటినోలాంటివారు కొన్ని రేడియో నాటకాల్లో పాల్గొన్నారు. అవన్నీ ఇప్పుడు ఆడియో టేప్‌రూపంలో కాంపాక్ట్ డిస్క్‌లుగా మార్కెట్లో లభ్యమవుతున్నాయి. ఓల్డ్ టైమ్ రేడియోస్ గ్రేటెస్ట్ షో పేర 30 గంటల ప్రోగ్రాంని (30 కేసెట్ల సెట్) 60 డాలర్లకి విడుదల చేశారు.




'మెర్క్యురీ థియేటర్ ఆన్ ది ఎయిర్' పేర ఆర్సన్ వెల్స్ అనేక రేడియో డ్రామాలను ప్రసారం చేశాడు. అవీ ఇప్పుడు మార్కెట్‌లో లభ్యమవుతున్నాయి. ఆ విధంగా 40, 50 ఏళ్ళక్రితం రేడియో ప్రసారాలు ఇప్పటి శ్రోతలకి అందుబాటులోకి రావడం చెప్పుకోదగ్గ సంగతి. కార్లో వెడుతూ వాటిని వింటూ వుంటారక్కడి ప్రజలు.

★

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2000

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.








priya
GARAM MASALA
priya
RASAM POWDER
priya
SAMBAR POW